# సంగీత మార్తాండము

## తాళాధ్యాయము

# మహారాజశ్రీ పోడూరి సూర్యనారాయణ

(యన్. యస్. రైల్వే. పి. డబ్లియు. ఇనస్పెక్టరు) గారి యుదారతకు

కృతికర్త ప్రశంసాశీస్సులు

ఉ॥ ప్రాపుగ నిల్వగాంచి యురు భావధనమ్ములు మాకుగూర్చి జీ
వాపగ సాకురీతి కృతి యందగరూపము దిద్దినావు నీ
వోపిన నాయెగాక బుధులొద్దిక నీకృతి మేలుగాంచ నీ
యేపున వంశమెంతొ పులకించుత పూలతొ నాడు నాటికిన్.

ఉ॥ ఆయము నిత్యజీవన మహమ్మగ సూక్ష్మత నెంచి సూర్యనా
రాయణ మిత్రవర్యులిటు లందపుఁ జేతల కీర్తికాంతక
త్యాయత భూషణ ప్రతతి నంచిత పోడురి వంశదీప్తిగా
నీయుత ధర్మగుప్తికయి యిట్టి రుమాన్యుల కొజ్జనైతగన్.

## ప్రకాశకులకు కృతజ్ఞత

శికిందరాబాదు సాహిత్యపరిషత్తువారు ముద్రణాది యసౌకర్యములుగల యీ క్లిష్టపరిస్థితులలో నసమగ్రముగనున్న నా యీ గ్రంథమునకు చేయూత నొసంగి నిర్వహించినందులకై వారికే నెంతయు కృతజ్ఞుడను. ఈ పరిషత్తు వారి తోధికముగ శారద కమూల్యాలంకారములు గూర్చి చిరస్థాయిగ వర్థిల్లుగాత యని నామనఃపూర్వకాశీస్సు లర్పించుచున్నాను.

గ్రంథకర్త

# అంకితము

శా॥ పాలించన్పరిశోధనా ఫలము సుబ్రహ్మణ్య హృత్పద్మ సం
జ్ఞాలాలిత్యము తాళమాన సుమమున్సంగీత మార్తాండ ము
ద్వేలాభంగుర డోలికన్నిలిపి విన్వీధిం బరానంద గో
పాల బ్రహ్మము నందగోపశిశురు (ఋ) క్పాదమ్ముకీలించెదన్.

---

## గురుస్తుతి

ఉ॥ శ్రీ యమరత్వ సిద్ధినిడు సిద్ధమనోహర గాన విద్యలో
నే యతిరాజు నుత్తమ మతీంద్రియమైన తరంగసూక్తులన్
వ్రాయని నిష్ఠనిల్పగ నవంధ్యము నైపుణి గూర్పజాలు నా
రాయణ తీర్థ పాదకమలమ్ముల నెంచెద నిష్టసిద్ధికిన్.



శివాయ గురవే నమః.

# సంగీతమార్తాండము.

## తాళాధ్యాయము

## 1. సప్తతాళ ప్రకరణము

శ్లో॥ నానామార్గైర్లయో యత్ర యతీనాం స్యాత్కళానిధా ।
తం దక్షిణం శివం నౌమి చిత్తవృత్తిమయం ధృవమ్ ॥

తా:— అనేక మార్గములు గలవాడును, కళలకు స్థానమైనవాడును అగు నెవని యందు యతులకు చిత్తలయ మగునో అట్టి దక్షిణామూర్తిరూపుడును, చిత్తవ్యాపారస్వరూపుడును, శాశ్వతుడు నగు శివునకు నమస్కరించుచున్నాను.

మరొక అర్థము:—

దక్షిణము, వార్తికము మున్నగు అనేకమార్గములు గలదియును, గురువు, లఘువు మున్నగు కళలకు స్థానమైనదియు నై సమస్రోతోవహాదియతులును, ద్రుత మధ్య, విళంబములను లయలను గలిగియుండునో అట్టి సమర్థమైనదియు, చిత్త వ్యాపారప్రచురమైనదియు, మంగళప్రదమైనదియు నైన తాళమునకు నమస్కరించుచున్నాను.

### తాళశబ్దవిచారము.

శ్లో॥ తాలస్తలప్రతిష్ఠాయా మితి ధాతోర్ఘఞిస్మృతః ।
గీతం వాద్యం తథానృత్యం యతస్తాలేప్రతిష్ఠితమ్ ॥

తా:— గీత, వాద్య, నృత్యములు దేనిచే ప్రకాశింపబడునో అది తాళము. తలప్రతిష్ఠాయాం యనునట్టి ధాతువుయొక్క ప్రయోగమువలన తాళ

శబ్దము పుట్టెను. ఈ తల ధాతువు ప్రతిష్ఠార్థకమగుటవలన గీత వాద్య నృత్యములు తాళమందు ప్రతిష్ఠితమైయున్నవి. (వ్యాకరణచర్చ వదలివేయడమైనది)

శ్లో॥ తకార శ్శంకరః ప్రోక్తో లకార శ్శక్తిరుచ్యతే ।
శివశక్తి సమాయోగా త్తాళనా మాభిధీయతే ॥

తా:— శంకరుడు అధిదేవతగా గల తకారమును, శక్తి అధిదేవతగా గల లకారమును చేరి తాళశబ్దము పుట్టెను అనగా శివశక్తుల సమాయోగమే తాళమగుచున్నదని తాత్పర్యము.

శ్లో॥ శివశక్త్యాత్మకం పుణ్యం యశస్యంభుక్తిముక్తిదం ।
దశప్రాణాత్మకం తాళం యోజానాతి స తత్త్వవిత్ ॥

తా:— శివశక్త్యాత్మకమై పుణ్యమును, యశస్సును, భుక్తిముక్తులను ఇచ్చునట్టి దశప్రాణాత్మకమైన తాళమును దెలియువారే తత్త్వవేత్తలగుదురు.

శ్లో॥ తౌర్యత్రికంతు మత్తేభం తాళం తస్యాంకుశంవిదుః ।
న్యూనాధికప్రమాణేతు ప్రమాణం క్రియతే యతః॥

తా:— తౌర్యత్రికమ (నృత్య, గీత, వాద్యముల) ను మదగజమునకు తాళము అంకుశమువంటిది. ఏలయన తౌర్యత్రికమునందు హెచ్చుతగ్గులు కలుగకుండ తాళము సరిచేయుచున్నది.

వివరణము:- గజమును అంకుశముచేత లోబరచుకుని అదుపుఆజ్ఞలలో నుంచని పక్షమందు అది స్వేచ్ఛగ సంచరించును. అందువలన ప్రమాదములు గలుగును. అటులనే తౌర్యత్రికమను గీతవాద్యనృత్యములను తాళముచేత స్వాధీనము చేసుకొననియెడల సంగీతమునకు ప్రమాదములు కలుగును. తాళము లేనిచో లోకమే లేదనవలెను. తాళజ్ఞానమును సంపాదించుట ప్రథమకర్తవ్యము.

శ్లో॥ కాలః క్రియాచ మానంచ సంభవంతి యదాసహా !
తదాతాళస్య సంభూతి రితి జ్ఞేయం విచక్షణైః ॥

శ్లో॥ కాలః క్షణాదికో జ్ఞేయ స్తాళయో ర్ఘటనం క్రియా।
కిర్రియయో రంతరం యత్తు విశ్రామో మాన ముచ్యతే ॥

తా: — కాలము, కిర్రియ, మానము, అనునవి మూడు ఏకకాలమున కలిగినప్పుడు తాళమునకు ఉత్పత్తియని తెలియవలెను. క్షణము మున్నగునవి కాలము; రెండువస్తువులుచేరి కొట్టబడుట కిర్రియ; క్రియలకు మధ్యనుండు విశ్రాంతికాలము మానమని తెలియవలెను.

వి:— రెండుహస్తముల సంయోగవియోగములు తాళమందలి కిర్రియలు. రెండుక్రియలకు మధ్యనుండు కాలమునకు మానమని పేరు. దీనినే లయ అందురు.

శ్లో॥ లోకేవేదేచ వచసాం పాదయోర్గతిరుత్తమా ।
తాళేనైవ వినాతేన స్ఖలనం తేషుదృశ్యతే ॥

తా:— లౌకిక వైదిక భాషలయందు వాక్కులకును,పాదములకును తాళముచేతనే ఉత్తమమైన గతికలుగుచున్నది. తాళము లేనిచో వాటికి స్ఖాలిత్యము కలుగును.

వి:— లోకమునందు లయలేకపోవుట యుండదు. కాలనాదములకు అవినాభావ సంబంధముగలదు. చైతన్యమెచ్చట యుండునో అచ్చట లయయున్నట్లు గ్రహింపనగును. లయలేనిచో గమనమేయుండదు. పసిబిడ్డ తొట్రుపాటుతో నడుచునప్పుడు తప్పటడుగులు వేయుచున్నట్లు చెప్పెదము. ఒకఅడుగును ముందునకు ఎంతకాలములో వేయుదుమో రెండవఅడుగునుకూడ అంతకాలములో ముందునకు వేసినప్పుడే నడకసరిగా సాగుచున్నది. లేనిచో వ్యత్యస్తమై నడక సాగదు. లయపరిశారము నడచునప్పుడు అట్టి లయజ్ఞానము ఉండకపోవచ్చును. లయజ్ఞానము కలుగుటయే తాళజ్ఞానము కలుగుట. అభ్యాసమువలన లయజ్ఞానము సిద్ధించును. అందుకొరకు విద్యార్థులు దశప్రాణములతో గూడిన తాళమును అభ్యసించవలయును.

శ్లో॥ తౌర్యత్రికం తాళహీనం చాలయే త్పురుషాధమః ।
సపాపీ నరకంఘోర మాశుగచ్ఛతి సాన్వయః ॥

తా:— గీత, వాద్య, నృత్యములను తాళహీనముగ ననుష్ఠించువారు పురుషాధములు. అట్టివారు తన వంశమువారితోసహా ఘోరనరకముల పాలగుదురు.

శ్లో॥ హస్త ద్వ యస్య సంయోగే వియోగే చాపివర్తతే ।
వ్యాప్తిమాన్యో దశప్రాణి స్సకాలస్తాళ సంజ్ఞికః ॥

తా:— ఉభయ హస్తములయొక్క సంయోగ వియోగములవలన వ్యాప్తించిన దశప్రాణములయొక్క కాలమానమునకు తాళమని పేరు.

వి:— తాళమును హస్తములతోగాని కంచుమున్నగు సాధనములతోగాని సశబ్ద నిశ్శబ్దక్రియలను, వ్యక్తపరచుచు, తాళదశప్రాణములను పాటించుచు అనుష్ఠించవలయును. పైవిధముగ స్వయముగ తాళమును వేసుకొనుటకు అవకాశములేని నర్తకులు మున్నగువారికి తాళమును వేయుటకొరకు మరొకరి సహాయము అవుసరము. కాలక్షేపములందు అట్టివారికి తాళమును అనుష్ఠించుటకొరకు మరొకరు ఉండనిచో చిక్కులు సంభవించును. కాలక్షేపమును జేయువారు తమ శిష్యులనుగాని, సహపాఠులనుగాని తాళమును వేయుటకొరకు నియమించుకొనవలెను. అన్యులను అందులకు అంగీకరించకూడదు. "దక్షిణేతాళధారీచ పార్శ్వద్వంద్వే మృదంగికః" అను నియమము నృత్యసహిత కాలక్షేపములకు చెప్పబడినది. సంగీతమునందు కాలక్షేపములు అనేకవిధములు. ఆయా కాలక్షేపధర్మముల ననుసరించి శాస్త్రజ్ఞులు నియమములను విధించిరి. నర్తకుల పాదములకు వృత్తిని కల్పించుటకొరకును "హస్తేనార్థం ప్రదర్శయేత్" అను నియమము ప్రకారము హస్తములు గీతార్థమును ప్రకటించు వ్యాపారమునం దుండుటచేతను మృదంగపు నడకవతుగ తాళమును పాదములతో ననుష్ఠించగలందులకు "పాదాభ్యాం తాళమాచరేత్" అని చెప్పిరి. పాదగతులవలన గానమునకు అభ్యు

తరము కలుగజేయు ధ్వనులు కలుగవచ్చునని అట్టి అనర్థకములు కలుగకుండు టకై గజ్జలను కట్టుకొనవలసినదిగ చెప్పిరి. * హస్తములతో తాళము వేయునప్పు డైనను వికృతధ్వనులు కలుగకూడదు. సుస్వరము కలుగని కంచుమున్నగు తాళ ములనుగూడ వినియోగింపగూడదు. పాదములతో తాళమును అనుష్ఠింపవలసిన దను నియమము సర్వత్రా వర్తించునని ఎంచకూడదు. సంగీతవిద్వాంసులు గాన సభను (నృత్యరహితముగ) చేయునప్పుడు హస్తములతో తాళము ననుష్ఠింపవల యును. నర్తకులైనను పాదములతో తాళము ననుష్ఠించునప్పుడు చేతులతో గీతార్థమును ప్రకటింపవలయునేగాని పాదగతులకు సంబంధించని మరొకతాళమును హస్తములతో ననుష్ఠించకూడదు. రెండుపాదములతో ఒకతాళమునే నడుపవల యును. గాయకులు రెండుచేతులతోను, రెండుచంకలతోను, రెండుకాళ్లతోను, వేరువేరు తాళములను ఏకకాలమందు అనుష్ఠించుచో గానము నొకగారడివిద్యగను దొమ్మరివిద్యగను మార్పనెంచినట్లగును. గారడిమున్నగు విద్యలకుగల గౌరవము కూడ అట్టిగానమునకు కలుగనేరదు. తాళదశప్రాణములకు అట్టి గానమువలన అనర్థకములు కలుగును. తాళహీనుల కెట్టిఫలము సిద్ధించునో అట్టి గాయకులకు గూడ నదేఫలము సిద్ధించును. గానము బలాబలములను తెల్పుకొనుటకుగాను

---

* శ్లో॥ కింకిణీ కాంస్యరచితాః తామ్రేణ రజతేన వా ।
సుస్వరాశ్చ సురూపాశ్చ సూక్ష్మా నక్షత్రదేవతాః ।
బన్ధయే న్నీలసూత్రేణ గ్రంథిభిశ్చ సమన్వితం ।
శతద్వయం శతం వాఽపి పాదయో ర్నాట్యకర్మణి ।
శతం వా దక్షిణే పాదే ద్విశతం వామపాదకే ॥

తా:— గజ్జెలు, కంచు, రాగి, వెండి వీనిలో దేనితో చేయబడినవైనను ఉపయోగించును. మంచిస్వరముగలవిగను, అందమైనవిగను, చిన్నవిగను ఉండవలయును. నక్షత్రాధిదేవతలు గల ఆ ట్టిగజ్జెలను నల్లదారమున గ్రుచ్చి గజ్జెగజ్జెకు ముడివేయవలయును. నాట్యకర్మయందు కాలికి ఇన్నూరువంతునగాని, లేక నూరువంతునగాని, లేక కుడికాలియందు నూరును, ఎడమకాలియందు ఇన్నూరునుఅయిన ఉండవలయును.

ఏర్పడి యుండలేదు. కాబట్టి అట్టిఅపసవ్యపు వ్యామోహములకు లోబడి భావ శూన్యమైన గానమును ప్రోత్సహింపకుండుట శ్రేయస్కరము.

శ్లో॥ కాలో లఘ్వాది మితయా క్రియయా సమ్మితోమితమ్ ।
గీతాదే ర్విదధత్తాలః సచద్వేధా బుధైస్మృతః ॥

తా:— లఘ్వాదిమితక్రియాసమ్మితమైన గీతాదిమితివిధాయకమయిన కాలము తాళమని చెప్పబడుచున్నది. అట్టి తాళము రెండు విధములు.

శ్లో॥ మార్గదేశీ గతత్వేన తాళో ఽసాద్ద్వివిధోమతః ।
శుద్ధసాళగ సంకీర్ణా స్తాళభేదా స్త్రయమాన్మతాః ॥

తా:— మార్గము, దేశీయము అని తాళములు రెండు విధములు. ఇవి తిరిగి ఒక్కొక్కటి శుద్ధము, సాళగము, సంకీర్ణములని మూడేసి విధములై వాటి నుండి అనేకతాళములు పుట్టినవి.

—♦ సప్త తాళములు ♦—

* శ్లో॥ ధ్రువమఠ్యౌ రూపకశ్చ ఝంపో త్రిపుటఏవచ ।
అటతాళైక తాళౌచ సప్తతాళాః పరికీర్తితాః ॥

తా:— ధ్రువ, మఠ్య, రూపక, ఝంప, త్రిపుట, అట, ఏక అనునవి సప్త తాళములు.

వి:— అనుద్రుతము, ద్రుతము, లఘువు అను తాళాంగములవలన సప్త తాళములు ఏర్పడుచున్నవి. ఒక అంగమున్నను అది తాళము కావచ్చును. ఈతాళాంగములలో లఘ్వంగము అయిదువిధములైనది. అయిదువిధములకు అయిదుజా

* ఈ గ్రంథమందలి రెండవదియైన దళప్రాణప్రకరణములో రెండవదియగుక్రియాప్రాణ లక్షణమును, నాలుగవదియగు అంగప్రాణలక్షణమును ముందుగ పఠించిన యనంతరము ఈసప్తతాళప్రకరణమును పఠించినచో సులభముగ గ్రాహ్యమగును.

తులందురు. పై సప్తతాళములందుగల లఘుజాతియొక్క మార్పువలన ఒక్కొక్క తాళములయిదువిధములగుచున్నది. అనుద్రుతము ద్రుతము అనునవిజాతిమార్పునొందక నొకవిధముగనే యుండును. అనుద్రుతమునకు అరచేతిఘాతయను హస్తక్రియ ఒకటి. ద్రుతమునకు ఘాత, ఉసి అను రెండుహస్తక్రియలు. ఘాతవేసి వ్రేళ్లను ఎంచుట లఘువు. నిలువుగీటు లఘువునకు' అనుస్వారము ద్రుతమునకు, అర్ధానుస్వారము అనుద్రుతమునకు చిహ్నములు. క్రియాప్రాణలక్షణమందు వీటి వివరములుగలవు.

## జాతులు.

శ్లో॥ చతురశ్ర త్ర్యశ్రమిశ్ర ఖండసంకీర్ణ జాతయః ।
ధ్రువాదయో జాతిభేదైః ప్రత్యేకం పంచపంచచ,
తాళస్స్వస్వాంగ మాత్రాభి ర్జాతా ఇతి జగుర్బుధాః ॥

తా:— చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణములను జాతులవలన ధ్రువాదిసప్తతాళములు ఒక్కొకటి అయిదేసివిధము లగుచున్నది. తాళాంగమునందలి మాత్రల ననుసరించి ఈ జాతులు ఏర్పడినవి.

వి:— ఇచ్చట మాత్రయనగ హస్తక్రియ. సప్తతాళములలో ఒకలఘ్వాంగము మాత్రమే జాతిమార్పును పొందును. చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణములను అయిదు జాతుల లఘువులకు క్రమముగ 4, 3, 7, 5, 9 హస్తక్రియలుండును. ఈ జాతిమార్పువలన సప్తతాళములు (7×5=) 35 తాళములైనవి.

## 1. ధ్రువ తాళము.

శ్లో॥ భరతో దత్తిలశ్చైవ ఆంజనేయో మతో ధ్రువః ॥

తా:— భరత, దత్తిల, ఆంజనేయ మతము ననుసరించి ధ్రువతాళమేర్పడినది.

## లక్షణము.

శ్లో॥ లఘురేకో ద్రుతం త్వేకం లఘుద్వంద్వం చతుర్దశ ।
మాత్రాయత్ర ప్రయుజ్యంతే చతురశ్ర ధృవస్స్మృతః ॥

తా॥ ఒకలఘువు, ఒకద్రుతము పిమ్మట రెండులఘువులను క్రమముగా ననుష్ఠించిన ధ్రువతాళమగును. చతురశ్రజాతి ధ్రువతాళమునకు పదునాలుగుమాత్రలు.

ఉదాహరణము:—

తాళాంగములు: |O| |

మాత్రలు. 4+2+4+4= 14.

వి:— ఈ ధ్రువతాళమునందు మూడు లఘువులు, ఒకద్రుతము కలవు. ద్రుతము యెల్లప్పుడు నొకవిధముగనే యుండును. ద్రుతమునకు జాతిమార్పు యుండదు. లఘువుమాత్రమే మారుచుండును. ఇందు ప్రథమలఘువును ఏజాతిలో ననుష్ఠించిన మిగత రెండులఘువులను గూడ ఆజాతిలోనే వినియోగించుకొనవలెను. ఒకతాళములోని లఘువులను ఏకకాలమందు ఒకటికి మించిన జాతులలో ననుష్ఠింపగూడదు. ధ్రువతాళమునందు అయిదుజాతుల లఘువులను ప్రత్యేక ప్రత్యేకముగ అనుష్ఠించిన అవి అయిదు ధ్రువతాళములగును. జాతిమార్పుగల లఘువులను వినియోగించుకొను క్రమమును ఈ గ్రంథమున అంగప్రాణలక్షణమునందు జూడనగును. తాళమునందుగల అంగములను క్రమముగ నొకపర్యాయము ననుష్ఠించిన అదిఒక ఆవర్తమనబడును.

—•అయిదుజాతుల ధ్రువతాళములకు ఆయాజాతులలో ఒక్కొక్క ఆవర్తమునందుగల హస్తక్రియలను సంఖ్యల తెలుపుపథకము•—

| సం॥ | జాతితాళములు. | తాళాంగములు. | | | | మొత్తము క్రియలు. |
|---|---|---|---|---|---|---|
| | | । లఘువు | O ద్రుతము | । లఘువు | । లఘువు | |
| 1. | చతురశ్రజాతిధ్రువతాళము. | 4 | 2 | 4 | 4 | 14 |
| 2. | త్రిశ్రజాతిధ్రువతాళము | 3 | 2 | 3 | 3 | 11 |
| 3. | మిశ్రజాతిధ్రువతాళము | 7 | 2 | 7 | 7 | 23 |
| 4. | ఖండజాతిధ్రువతాళము | 5 | 2 | 5 | 5 | 17 |
| 5. | సంకీర్ణజాతిధ్రువతాళము | 9 | 2 | 9 | 9 | 29 |

## 2. మఠ్యతాళము.

శ్లో॥ మఠ్యతాళస్య కర్తారో మతంగార్జునకోహళాః॥

తా:— మతంగుడు, అర్జునుడు, కోహళుడు మఠ్యతాళమునకుకర్తలు.

### లక్షణము.

శ్లో॥ ఆద్యంతయో ర్లఘు ర్మధ్యే ద్రుతంచ చతురశ్రకః।
మాత్రా దశ జగు ర్యత్ర స మఠ్యః పరికీర్తితః॥

తా:— ఆద్యంతములందు ఒక్కొక్క లఘువు మధ్య ద్రుతము గలది మఠ్యతాళము. ఈతాళమునకు చతురశ్రజాతియందు మాత్రలు(హస్తక్రియలు)పది.

ఉదాహరణము:—

|0| తాళాంగములు.

చతురశ్రజాతియందు మాత్రలు: 4+2+4=10.

వి:— ధ్రువతాళాంగములలో కుడివైపునయుండు లఘువు నొకదానిని మినహాయించిన నదియే మఠ్యతాళము. లఘువు జాతిమార్పును పొందునప్పుడు ఈతాళముగూడ అయిదు భేదములగును. ఇట్లే రూపక, ఝంప, త్రిపుట, అట ఏకతాళములు గూడ అయిదేసి భేదములగును.

### అయిదుజాతుల మఠ్యతాళములు.

| సం॥ | జాతితాళములు. | తాళాంగములు. \| లఘువు | O ద్రుతము | \| లఘువు | మొత్తము క్రియలు. |
|---|---|---|---|---|---|
| 1. | చతురశ్రజాతిమఠ్యతాళము | 4 | 2 | 4 | 10 |
| 2. | త్రిశ్రజాతిమఠ్యతాళము | 3 | 2 | 3 | 8 |
| 3. | మిశ్రజాతిమఠ్యతాళము | 7 | 2 | 7 | 16 |
| 4. | ఖండజాతిమఠ్యతాళము | 5 | 2 | 5 | 12 |
| 5. | సంకీర్ణజాతిమఠ్యతాళము | 9 | 2 | 9 | 20 |

వి:— ఈమఠ్యతాళమునందు ఎడమవైపునగల లఘువును మినహాయించిన నది రూపకతాళ మగును.

## 3. రూపకతాళము.

శ్లో॥ ఆంజనేయో కుంభజోపి యాజ్ఞవల్క్య స్తురూపకే ॥

తా:—ఆంజనేయుడు, అగస్త్యుడు, యాజ్ఞవల్క్య ముని రూపకతాళమున నిర్ణయించిరి.

### లక్షణము.

శ్లో॥ ద్రుతం త్వేకం లఘుశ్చైకో మాత్రాషట్కంచ యత్రిస:।
రూపకశ్చతురశ్రి స్స్యా ది త్యాహు స్తాళవేదిన: ॥

తా:— ఒక ద్రుతమును, ఒకలఘువును క్రమముగానుండి ఆరుమాత్రలు గలది చతురశ్రిజాతి రూపకతాళము.

ఉదాహరణము:—

0 | తాళాంగములు.

మాత్రలు: 2+4=6.

### అయిదుజాతుల రూపకతాళములు.

| సం॥ | జాతితాళములు. | తాళాంగములు. ○ ద్రుతము | తాళాంగములు. । లఘువు | మొత్తంక్రియలు |
|---|---|---|---|---|
| 1. | చతురశ్రిజాతిరూపకతాళము. | 2 | 4 | 6 |
| 2. | త్రిశ్రజాతిరూపకతాళము | 2 | 3 | 5 |
| 3. | మిశ్రజాతిరూపకతాళము. | 2 | 7 | 9 |
| 4. | ఖండజాతిరూపకతాళము. | 2 | 5 | 7 |
| 5. | సంకీర్ణజాతిరూపకతాళము. | 2 | 9 | 11 |

## 4. ఝంపతాళము.

శ్లో॥ నందీశో భరతోశౌనః ఝంపాయాం చైవ సప్తధా ॥

తా:— నందికేశ్వరుడు, భరతుడు, శౌనకుడు ఏడుక్రియలుగల ఝంప తాళమును చెప్పిరి.

వి:— సప్తధాయని యున్నందున ఏడుక్రియలని భావము. చతురశ్ర జాతియందు మాత్రమే ఈతాళమునకు ఏడుక్రియలు గలవు.

### లక్షణము.

శ్లో॥ లఘురేకో ఽనుద్రుతంచ ద్రుతమేకంచ యత్రవై ।
చతురశ్ర స్సప్త మాత్రా ఝంపాతాళస్స ఉచ్యతే ॥

తా:— ఒక లఘువు, అనుద్రుతము ద్రుతము క్రమముగా నున్న ఝంప తాళమగును. చతురశ్రజాతియందు దీనికి ఏడు మాత్రలుండును.

ఉదాహరణము:—

| ‿ O తాళాంగములు.
మాత్రలు: 4+1+2=7.

### అయిదుజాతుల ఝంపతాళములు.

| సం॥ | జాతితాళములు | తాళాంగములు | | | మొత్తం క్రియలు |
|---|---|---|---|---|---|
| | | \| లఘువు | ‿ అనుద్రుతము | O ద్రుతము | |
| 1. | చతురశ్రజాతిఝంపతాళము | 4 | 1 | 2 | 7 |
| 2. | త్రిశ్రజాతిఝంపతాళము | 3 | 1 | 2 | 6 |
| 3. | మిశ్రజాతిఝంపతాళము | 7 | 1 | 2 | 10 |
| 4. | ఖండజాతిఝంపతాళము | 5 | 1 | 2 | 8 |
| 5. | సంకీర్ణజాతిఝంపతాళము | 9 | 1 | 2 | 12 |

వి:— ఈ తాళమునందు అనుద్రుతము, ద్రుతము, లఘువు అను మూడు తాళాంగములు గలవు. అనుద్రుతమును (ఘాతను) వేసినవెంటనే ద్రుత

ప్రారంభమునగలఘాతను వేయవలయును. అప్పుడు రెండుఘాతలు వరుసగావచ్చును. ఈతాళమునందలి మధ్యనుండు అనుద్రుతమును ద్రుతముగ మార్చినచో అది త్రిపుటతాళమగును.

5. త్రిపుటతాళము.

శ్లో॥ నిశాచరపతి ర్బ్రహ్మ త్రిపుటే శంఖపాలకః ॥

తా:— రావణుడు, బ్రహ్మ, శంఖపాలుడు త్రిపుటతాళమును ఏర్పరచిరి.

లక్షణము.

శ్లో॥ లఘు రేకో ద్రుతద్వంద్వం మాత్రాచాష్టౌ చ యత్ర సః।
త్రిపుట శ్చతురశ్ర స్స్యా దితి ప్రాహు ర్మనీషిణః ॥

తా:— ఒక లఘువు రెండు ద్రుతములు క్రమముగానుండి ఎనిమిది మాత్రలు గలది చతురశ్రజాతి త్రిపుటతాళము.

ఉదాహరణము:—

| 0 0 తాళాంగములు.

మాత్రలు: 4+2+2=8.

అయిదుజాతుల త్రిపుటతాళములు.

| సం॥ | తాళజాతులు | తాళాంగములు. | | | మొత్తముక్రియలు |
|---|---|---|---|---|---|
| | | \| లఘువు | O ద్రుతము | O ద్రుతము | |
| 1. | చతురశ్రజాతిత్రిపుటతాళము. | 4 | 2 | 2 | 8 |
| 2. | త్రిశ్రజాతిత్రిపుటతాళము . | 3 | 2 | 2 | 7 |
| 3. | మిశ్రజాతిత్రిపుటతాళము. | 7 | 2 | 2 | 11 |
| 4. | ఖండజాతిత్రిపుటతాళము. | 5 | 2 | 2 | 9 |
| 5. | సంకీర్ణజాతిత్రిపుటతాళము. | 9 | 2 | 2 | 13 |

వి:— ఈ త్రిపుటతాళాంగములకు ఆదియందు ఒకలఘువును జేర్చిన అటతాళమగును.

## 6. అట తాళము.

శ్లో॥ బలిః కౌమారదేవేంద్రాః అటతాళ సముద్భవే ॥

తా:— బలిచక్రవర్తి, దేవేంద్రుడు, కుమారస్వామి అటతాళమును జెప్పిరి.

### లక్షణము.

శ్లో॥ లఘుద్వంద్వం ద్రుతద్వంద్వం మాత్రా ద్వాదశ యత్ర సః ।
చతురశ్రో ఽటతాళ స్స్యా దితి తాళవిదో విదుః॥

తా:— రెండు లఘువులును, రెండు ద్రుతములును క్రమముగనుండి పది రెండు మాత్రలు గలది చతురశ్రజాతి అటతాళము.

ఉదాహరణము:—

తాళాంగములు: | | 0 0

మాత్రలు: 4 + 4 + 2 + 2=12.

అయిదుజాతుల అటతాళము.

| సం॥ | జాతితాళములు. | తాళాంగములు. | | | | మొత్తము క్రియలు |
|---|---|---|---|---|---|---|
| | | \| లఘువు | \| లఘువు | O ద్రుతము | O ద్రుతము | |
| 1. | చతురశ్రజాతిఅట తాళము | 4 | 4 | 2 | 2 | 12 |
| 2. | తిశ్రజాతిఅటతాళము. | 3 | 3 | 2 | 2 | 10 |
| 3. | మిశ్రజాతిఅటతాళము | 7 | 7 | 2 | 2 | 18 |
| 4. | ఖండజాతి అటతాళము. | 5 | 5 | 2 | 2 | 14 |
| 5. | సంకీర్ణజాతిఅటతాళము. | 9 | 9 | 2 | 2 | 22 |

## 7. ఏకతాళము.

శ్లో॥ మహతాం చాపి సర్వేషాం ఏకతాళ స్సమో మతః ॥

తా:— పెద్దలందరు ఏకతాళము నొకవిధముగనే నిర్ణయించిరి.

### లక్షణము.

శ్లో॥ లఘురేక శ్చతుర్మాత్రి శ్చతురశ్రి స్తథైవచ।
యత్రైకతాళ స్స ప్రోక్తో భరతజ్ఞై ర్మనీషిభిః ॥

తా:— నాలుగు మాత్రలు గల ఒక లఘువునకు చతురశ్రజాతి ఏకతాళ మని భరతజ్ఞులు చెప్పిరి.

### అయిదుజాతుల ఏకతాళములు.

| సం॥ | తాళజాతులు. | తాళాంగములు<br>\|<br>లఘువు | మొత్తముక్రియలు |
|---|---|---|---|
| 1. | చతురశ్రజాతిఏకతాళము | 4 | 4 |
| 2. | తిశ్రజాతిఏకతాళము | 3 | 3 |
| 3. | మిశ్రజాతిఏతాళము | 7 | 7 |
| 4. | ఖండజాతిఏకతాళము | 5 | 5 |
| 5. | సంకీర్ణజాతిఏకతాళము | 9 | 9 |

వి:— పైన వివరించిన సప్తతాళములను అభ్యసించునప్పుడు క్రియలను అంకెలతో నెంచవలయును. తాళప్రారంభక్రియను ఒకటితో ప్రారంభించి ఆవర్తాంతమువరకు క్రమముగా నెంచవలయును. రెండవ ఆవర్తము ప్రారంభమగునప్పుడు తిరిగి ఒకటినుండి ప్రారంభించి ఎంచవలెను. ఇట్లే ప్రతి ఆవర్తమునందును సంఖ్య ప్రారంభమగును. ఆవర్తమునందలి క్రియలన్నిటిని వ్యత్యస్తముగనొక సమాన కాలములలో నడుపవలెను.

సప్తతాళములు జాతిభేదము వలన ముప్పదిఅయిదు తాళములు అయిన విధము పైన నిరూపించబడినది. ఈ ముప్పదిఅయిదు తాళములకు నామములును, హస్తక్రియలును దిగువ పథకమునందు గలవు.

స ప్త తా ళ ప థ క ము.

| సం॥ | తాళములు | తాళాంగములు | తాళజాతులు. చతురశ్రజాతి | త్రిశ్రజాతి | మిశ్రజాతి | ఖండజాతి | సంకీర్ణజాతి |
|---|---|---|---|---|---|---|---|
| 1 | ధ్రువతాళం | ।०।। | 14 శ్రీకరతాళ॥ | 11 మణితాళ॥ | 23 పూర్ణతాళం | 17 ప్రమాణ | 29 భువనతా॥ |
| 2 | మఠ్య | ।०। | 10 సమతాళ॥ | 8 సారతాళం | 16 ఉదీర్ణతాళం | 12 ఉదయతా॥ | 20 రావతాళ॥ |
| 3 | రూపక | ०। | 6 పత్తితాళం. | 5 చక్రతాళం | 9 కులతాళము | 7 రాజతాళం | 11 బాదుతా॥ |
| 4 | ఝంప | ।‿० | 7 మధుకరతా | 6 కదంబతా॥ | 10 సురతాళము | 8 చణతాళం | 12 కరతాళము |
| 5 | త్రిపుట | ।०० | 8 ఆదితాళము | 7 శంఖతాళం | 11 లీలతాళము | 9 దుష్కర॥ | 13 భోగతాళ॥ |
| 6 | అటతా॥ | ।।०० | 12 లేఖతాళ॥ | 10 గుప్తతాళం | 18 లోయతా॥ | 14 విగళతాళ॥ | 22 ధీరతాళము |
| 7 | ఏకతా॥ | । | 4 మానతాళ | 3 సుధాతాళం | 7 రాగతాళం | 5 రతితాళము | 9 వసుతాళ॥ |
| అయిదుజాతులలఘువులకుఅంగసంజ్ఞలు. | | | । | ४ | ४ । | ‿ । | ४ ४ |

వి: — పైపథకమునందలి జాతిలఘువుల అంగసంజ్ఞల వివరములు అంగ ప్రాణలక్షణమునందు గలవు.

—సప్తతాళములను వాటి అంగములను సులభముగ
గుర్తించుకొనుటకు శ్లోకములు—

శ్లో॥ లఘుద్రుతద్విలఘుచ ధ్రువతాళాంగ మేవచ ।
లఘుద్రుతలఘుశ్చైవ మఠ్యతాళ ఇతి స్మృతః ॥
ద్రుత మేకం లఘు రేకో రూపకస్య ప్రకీర్తితః ।
లఘు చానుద్రుతం చైవ ద్రుతో ఝంపేతి కీర్తితః ॥
లఘుద్విద్రుత శ్చైవ త్రిపుటతాళాంగ మేవచ ।
లఘుద్వంద్వం ద్రుత ద్వంద్వం అటతాళాంగ మేవచ ॥
ఏకతాళే లఘుస్మృతః, సప్తతాళాః ప్రకీర్తితాః ।

—సప్తతాళములకు ఘాతలు—

శ్లో॥ ధ్రువతాళే చతుర్ఘాతా మఠికాయాం త్రయో మతాః ।
రూపకేతు ద్వయం ప్రాహుః ఝంపా త్రిపుటయోస్త్రయం ॥
అటతాళేతు చత్వార ఏకతాళే త్వధఃఖరః ॥

తా:— ధ్రువతాళమునకు నాలుగు, మఠ్యతాళమునకుమూడు, రూపక తాళమునకు రెండు, ఝంపాతాళమునకు మూడు, త్రిపుటతాళమునకుమూడు అటతాళమునకు నాలుగు ఏకతాళమునకు ఒకటి ఈప్రకారము సప్త తాళములకు ఘాతలు.

వి:— ఘాతలనగా శబ్దక్రియలు. ప్రతితాళాంగమునందును ఒకశబ్దక్రియ మాత్రమేయుండును. ప్రతిఅంగమునకు ప్రారంభక్రియ, శబ్దక్రియ. తాళమునందు అంగములు ఎన్ని ఉండునో శబ్దక్రియలు అన్నియుండును. శబ్దక్రియ ననుష్ఠింపగనే పూర్వాంగము సమాప్తమై మరొకఅంగము ప్రారంభమైన ట్లెంచవలెను.

కాలక్షేపములందు కంచుతాళమును వినియోగించుకొనునప్పుడు ప్రథమ కాలములో ఘాతలందుమాత్రమే కంచుతాళమును ధ్వనింపజేయవలెను. అందు కొరకే పైఘాతలు చెప్పబడినవి. శబ్దక్రియలకు మధ్యనుండు అంతరకాలమును బట్టి తాళాంగములను గుర్తించవచ్చును. శబ్దక్రియలమధ్యనుండు నిశ్శబ్దక్రియల కాలమే విరామకాలము. అనగా అంతరకాలము.

## సప్తతాళోత్పత్తిక్రమము.

పూర్వ మొకప్పుడు ప్రదోషకాలమందు ఈశ్వరుడు * తాండవముజేయు చుండ పాదమునుండి అందె జారి భూమియందు పడగా అప్పుడు కలిగిన ధ్వని "తకిటత, ధరికిట, దధిగిణ, ఝుణుఝుంత" అను పదియారుశబ్దములైనట్లును ఈప దియారుశబ్దములకాలము కాకపాదమైనట్లును శాస్త్రప్రసిద్ధము. అనంతమైనతాళ ములకు కాకపాదమే ఆదియగుటచేత దీనిని కొందరు ఆదితాళమని కూడ వ్యవహరించిరి.

---

* నాట్య, నృత్త, నృత్యములు లాస్యమనియు, తాండవమనియు రెండువిధములు. శ్లో॥ సుకుమారం తు తల్లాస్య ముద్ధతానం తాండవం విదుః ॥ లాస్యమన సుకుమారమైనది. తాండవము నిలుచుండి నృత్యముచేయుట. తాండవమునకు నిలుచుండవలయునని నియమించుటచే లాస్యమునకు కూర్చుండ వలయునని భావింపవలయును. సాధారణముగ కొందరు తాండవమును రౌద్రరసప్రధానముగ నెంచెదరు. అన్నిరసములలోను ఉపయుక్తమగును. తండువి (నందికేశ్వరుని) వలన ఒకప్పుడు చెప్పబడినందున తాండవమను పేరు వచ్చినది. ఒకప్పుడు ఈశ్వరుడు తాండవముచేయునప్పటి పరి వారము ఈక్రిందిశ్లోకమున వర్ణింపబడినది.

* శ్లో॥ బ్రహ్మా తాళధరో హరిశ్చ పటహీ వీణాకరా భారతీ,
వంశజ్ఞౌ శశిభాస్కరౌ శ్రుతిధరా స్సిద్ధాప్సరఃకిన్నరాః ।
నందీభృంగిరిటాదిమర్దలధరాః సంగీతకో నారదః,
శంభో ర్నృత్తకరస్య మంగలతనో ర్నాట్యం సదా పాతు నః ॥

కాకపాదమును ప్రస్తరింపగా నేర్పడిన తాళములన్నియు ఆదితాళ భేదములనియును, కాకపాదమునందొక ద్రుతమును * మినహాయించి ప్రస్తరింపగా కలుగునవి ధ్రువతాళభేదములనియును, ధ్రువతాళమునందొక ద్రుతమును మినహాయించి ప్రస్తరింపగా కలుగునవి అటతాళ భేదములనియును, అటతాళమునందొక ద్రుతమును మినహాయించి ప్రస్తరింపగా కలుగునవి మఠ్యతాళ భేదములనియును, మఠ్యతాళమునందొక ద్రుతమును మినహాయించి ప్రస్తరింపగా కలుగునవి త్రిపుటతాళభేదములనియును, త్రిపుటతాళమునందొక ద్రుతమును మినహాయించి ప్రస్తరింపగా కలుగునవి రూపకతాళభేదములనియును, రూపకతాళమునందొక ద్రుతమును మినహాయించి ప్రస్తరించగా కలుగునవి ఏకతాళభేదములనియును శాస్త్రనిర్ణయము. పైవిధముగ నొక్కొక్క ద్రుతమును కాకపాదమునుండి మినహాయించుచు వచ్చునప్పుడు ఏర్పడిన తాళమునందు ఆవర్తమునకు క్రమముగ 16, 14, 12, 10, 8, 6, 4 అక్షరము లుండును. పై ప్రస్తారములలో ఒక్కొక్క ప్రస్తారమునుండి ఒక్కొక్క తాళమువంతున సప్తతాళములను శాస్త్రజ్ఞులు వేరుపరచి వాటికి లక్షణములను నిర్ణయించిరి. కాకపాదమునందలి హస్తక్రియలు నిశ్శబ్దక్రియలైనందున దాని నొక్కదానిని ప్రత్యేకతాళముగ వినియోగించుకొనుటకు నవకాశముండదు. కాకపాదమును పైన ఏర్పడిన తాళములనుండి మినహాయించినచో మిగిలినవి ఆరుతాళములే యగును. ఈ ఆరుతాళములకు ఝంపతాళమును కలిపి శాస్త్రజ్ఞులు సప్తతాళములను చెప్పిరి. ఝంపతాళమును జెప్పుటకుగల కారణమును ముందు తెలియగలరు.

ధ్రువాదిషట్తాళములకు పైప్రకారము క్రమముగ 14, 12, 10, 8, 6. 4 క్రియలు ఆయాతాళములలో నేజాతికి సరిపోవునో ప్రథమమున ఈతాళములు

---

* ద్రుతమునకు రెండు అక్షరములు. అక్షరమనగా ఒకహస్తక్రియ. కాబట్టి ద్రుతమునకు రెండు హస్తక్రియలని తెలియవలెను

ఆయాజాతులలో పుట్టినట్లెంచవలెను. ప్రతితాళమునందును చతురశ్రజాతిలో మాత్రమే పైసంఖ్యలు ఆయా తాళములకు సరిపోవుచున్నవి. కాబట్టి ప్రథమమున ఈతాళములు చతురశ్రజాతిలో పుట్టినట్లు స్పష్టమైనది. ఎవరైన జాతిపేరు నుదహరింపకయే పైసప్తతాళములలో ఒకతాళమును వేయుమనిన చతురశ్రజాతిగనే అనుష్ఠింపవలెను. క్రియలసంఖ్య నడిగినను ఆవిధముగనే చెప్పవలయును.

ధ్రువాది షట్తాళములలో ద్రుతము, లఘువు అను రెండు తాళాంగములు మాత్రమే గలవు. వెనుక వివరించిన సప్తతాళపథకమునందు చూచినచో ఈ విషయము బోధపడును. ఈ షట్తాళములలో అనుద్రుతములేనందున పైతాళములలో ఒకద్రుతము, ఒకలఘువుగల రూపకతాళమునకు అనుద్రుతమునుజేర్చి లఘువు, అనుద్రుతము, ద్రుతము ( | ◡ ० ) అను వరుసక్రమములో అంగములను ఏర్పరచి దీనిని ఝంపతాళముగ నిర్ణయించిరి. ఈ ఝంపతాళముగూడ ప్రథమమున చతురశ్రజాతియందే చెప్పబడినది. చతురశ్రజాతియందు ఈతాళమునకు ఏడు క్రియలుండును. రూపకతాళాంగములకు అనుద్రుతమునుజేర్చి ప్రస్తరింపగా కలుగునవి ఝంపతాళ భేదములు.

కాకపాదమునందు క్రమముగ ద్రుతమును తగ్గించుచు వచ్చినప్పుడు ధ్రువ, అట, మఠ్య, త్రిపుట, రూపక, ఏక అను వరుసక్రమములో తాళములు ఏర్పడినవి. కాని నేడు ఆచరణలోనున్నట్లు, ధ్రువతాళమునకు తదుపరి మఠ్యతాళము వచ్చియుండలేదు. పూర్వముపై క్రమమున తాళములు ఏర్పడియుండినను అనంతరమందు శ్లోకసౌకర్యార్థము గ్రంథకర్తలు ధ్రువతాళమునకు తదుపరి మఠ్యతాళమును జెప్పియుండవచ్చును. ఈగ్రంథమునందు నేడు వాడుకలోనున్న వరుసక్రమముననే ధ్రువాదిసప్తతాళములను వివరించితిమి. క్రియలసంఖ్య ననుసరించి వరుసక్రమమును నిర్ణయింపవలసి వచ్చుచో నేటిక్రమము తారుమారగును.

## సప్త తాళములకు వారాదులు.

| సం॥ | తాళములు | వారములు | నక్షత్రములు | ఋషి | వర్ణము | వస్త్రము | నివాసము | అధిదేవత |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ధ్రువ తాళం | ఆది | పుష్యమి | కౌండిన్య / శాండిల్య | పీత | శుభ్ర | జంబూ ద్వీపము | బ్రహ్మ |
| 2 | మఠ్య | సోమ | హస్త | భారద్వాజ / విశ్వామిత్రి | శ్యామ | రక్త | ప్లక్ష | కౌమారి |
| 3 | రూపక | మంగళ | మఖ లేక మృగశీర్ష | వశిష్ట / గౌతమ | రక్త | పీతాంబర | శాల్మలి / కుశ. | అంబిక |
| 4 | ఝంప | బుధ | పుష్యమి లేక పుబ్బ | జమదగ్ని | హరిద్ర | చిత్రవస్త్రం | కుశ / క్రౌంచ | మహేశ్వర |
| 5 | త్రిపుట | గురు | అశ్వని లేక ఆరుద్ర | కాశ్యప / భరద్వాజ | శ్వేత | పీత | గౌంచ / శాల్మలి. | ఈశ్వరి |
| 6 | అటతా॥ | శుక్ర | హస్త లేక అశ్వని | ఆత్రేయ / కశ్యప | హిరణ్య | పీతాంబరం | శాక | పార్వతి |
| 7 | ఏకతా॥ | శని | జ్యేష్ఠ లేక స్వాతి | దూర్వాస / వశిష్ట | శ్యామ | పీత వస్త్రం | పుష్కర | సరస్వతి |

మతాంతరమందు మరొక పేరున్నందున రెండవనామమునుకూడ ఉదహరించితిమి.

## విశేష తాళములు.

చాపుతాళము:— ఏడుఅక్షరముల గతి. గతియనిన తాళమునడచుమార్గము. ఇందలి అక్షరములు జాతిగా తాళము వేసుకొనుటకు ఉపయోగించవు. ఇందు అక్షర కాలపరిమాణముకంటే తక్కువ కాలములో ఉచ్చరింపబడును. ఒక త్రిశ్రగతి, ఒక చతురశ్ర

గతి కలిసి ఈ తాళము నడచును. తిశ్రగతి ప్రారంభములో ఒక ఘాతను, చతురశ్రగతి ప్రారంభములో ఒక ఘాతను వేయవలయును. ఈతాళమునకు రెండు ఘాతలు గలవు. రెండు జాతుల గతులు కలసినందున మిశ్రగతి యనబడినది. దీనిని అటతాళమునికూడ వ్యవహరింతురు.

ఝంప్యతాళము:— ఇది తిశ్రగతి. మూడు అక్షరములకు ఒకపర్యాయము ఘాత వేయవలెను. గతికి, జాతికి గలభేదమును దశేపాణ ప్రకరణములో వివరింతుము.

ఖండగతి:— అయిదు అక్షరములు. ఇందు మొదటి అక్షరమునకు, మూడవఅక్షరమునకు ఘాత వేయవలెను. దీనిని కురుజ్ఞింపె యందురు.

మధ్యాది:— ౧౧౦ = వరుసగా మూడుఘాతలు, ఒకఉసి వేయవలయును.

ఉదాహరణము:—

మిశ్రగతి= త కి ట త క త క

తిశ్రగతి= త కి ట

ఖండగతి= త క త కి ట

అక్షరముపైనుండు (।) యీగుర్తు ఘాతలను తెలుపును.

పైవిధముగ నేడుఆచరించుచున్నారు. గాని ప్రతిగతికిని ఆదియందు ఒక ఘాతను మాత్రమే వేయుట ఉత్తమమైనపద్ధతి. మిశ్రగతిలో రెండుఘాతలు వేసినచో నియమమును అతిక్రమించినట్లగును. ఒకఘాతతో తాళము నిలుపుటకు మనోధర్మము చాలనివారు రెండుమూడు ఘాతలను వేయుచున్నారు. అట్టివారు విద్వాంసు లయినంతమాత్రమున వారిఆచరణ శాస్త్రసిద్ధమైనదని యెంచకూడదు.

# 2. దశ ప్రాణ ప్రకరణము.



శ్లో॥ కాలో మార్గ క్రియాంగాని గ్రహజాతి కళాలయాః ।
యతిప్రస్తారకే చైవ తాళప్రాణదశా స్స్మృతాః ॥

తా:— కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి కళ లయ, యతి, ప్రస్తారము అనునవి తాళమునకు దశప్రాణములు.

వి:— ఈ పదిప్రాణములు ప్రతితాళమునకు ఉండును. తాళమునకుగల పదివిధములైన నియమములకు పదిప్రాణములని వ్యవహారము. ఈ దశప్రాణముల పై వరుస క్రమములోనున్నను విద్యార్థులకు సులభముగ బోధపడుటకుగాను కాలము, క్రియ, మార్గము, అంగము, జాతి, గ్రహము, కళ, లయ, యతి ప్రస్తారము అను వరుసక్రమములో నీగ్రంథమున వివరించుచున్నాము.

## 1. కాల ప్రాణ లక్షణము.

తాళమునందు కాలము రెండు విధములు. అందొకటి అక్షరకాలపద్ధతి రెండవది త్రికాలపద్ధతి. తాళమును వేయునప్పుడు ఒక్కొక్క హ్రస్వాక్షరమును ఎంతకాలములో ఉచ్చరించుచు తాళమును నడుపవలయునో ఆకాలప్రమాణమును అక్షరకాల పద్ధతివలన తెలియగలము. శాస్త్రజ్ఞులు కాలప్రమాణముల నీక్రింది విధముగ నిర్ణయించిరి,

శ్లో॥ ఉపర్యుపరి విన్యస్య పద్మపత్రశతం సకృత్ ।
సకాల స్సూచిసంభేదా త్ర్త్క్షణ స్స్య త్కలం ప్రతి ॥
లవఃక్షణై రష్టభి స్స్యా త్కాష్టా చాష్టలవాత్మికా ।
అష్టకాష్టా నిమేషస్యా న్ని మేషై రష్టభిః కలా ॥
తాభ్యాం చైవచతుర్భాగో చతుర్భాగా వనుద్రుతః ।
అనుద్రుతాభ్యాం బిందుశ్చ బిందుభ్యాంతు లఘు ర్భవేత్ ॥

లఘుద్వయం గురుశ్చైవ త్రిలఘుస్లుత ముచ్యతే ।
చాతుర్లఘుః కాకపాదం ఇత్యేత త్కాలలక్షణం ॥

తా:— నూరు తామరరేకుల నొకదానిపై నొకటి నుంచి వాటిని సూదిచే భేదించిన నూరుతామరరేకులు తెగినకాలము ఒక క్షణమగును. ఈక్షణములు ఎనిమిది అయిన ఒకలవము. 8. లవములు 1 కాష్టము, 8. కాష్టములు 1 నిమిషము, 8 నిమిషములు 1 కళ, 2 కళలు 1 చతుర్భాగము, 2 చతుర్భాగములు 1 అనుద్రుతము, 2 అనుద్రుతములు 1 ద్రుతము, 2 ద్రుతములు 1 లఘువు, 2 లఘువులు 1 గురువు, 3 లఘువులు 1 ప్లుతము, 4 లఘువులు 1 కాకపాదము. ఈప్రకారము కాలలక్షణములను తెలియవలెను.

వి:— నూరు తామరరేకులను సూదితో నెంతకాలము భేదింపవలయునో ముందు తెలియవలసియున్నది. లేకున్న కాలములు తెలియవు. ఎంతకాలములో సూదితో భేదింపవలయునో ఆజ్ఞానమును కలుగజేయు మార్గము పైశ్లోకమునందు ఉదహరింపబడలేదు. ఒకరొకకాలములోను, మరొకరు మరొకకాలములోను భేదింపవచ్చును. సర్వులు ఒకకాలములోనే భేదించుటకు అవకాశము ఉండవలయును. లేకున్న ఎవరుభేదించినకాలమును ప్రమాణముగా గ్రహించి తాళముల ననుష్ఠింపవలయునో నిర్ణయించుటకు వీలుండదు. క్షణము మొదలు కళాకాలము వరకు గల కాలపరిమాణములను గుర్తించి ఆ నియమముల ప్రకారము గానము చేయుట మానవులకు సాధ్యము కానేరదు. ఇట్టి సూక్ష్మకాలములు పరాపశ్యంత్యాది నాదములకువలెనే యోగసాధ్యమైనవి:—

ఇక సామాన్యమానవులు అనుష్ఠించుటకు అనుకూలమగు పద్ధతిని వివరించు చున్నాము. పైన ఉదహరించిన కాలములలో అనుద్రుతకాలము ఒక హ్రస్వాక్షరము నుచ్చరించునట్టి కాలమని భరతశాస్త్రజ్ఞులు నిర్ణయించిరి. కాబట్టి హ్రస్వాక్షరము నెంతకాలములో నుచ్చరించవలయునో తెలియవలసియున్నది. అట్లయిన హ్రస్వాక్షరకాలమునుబట్టి కాకపాదమువరకు గల కాలనియమములను తెలియవచ్చును.

శ్లో॥ రేచకః పూరకశ్చైవ తథా హంసగతి స్స్మృతః ।
చిత్రమార్గస్య ప్రస్తావే నీయతే హంస గత్యథా ॥

తా:— రేచకపూరకములతో గూడినది హంసగతి. అట్టి హంసగతికాలమును గానమందు చిత్రమార్గముగ వాడుకొనవలయును.

వి:— రేచకమన శ్వాసనువిడుచుట, పూరకమన శ్వాసనుపీల్చుట. ఒక పర్యాయము శ్వాసనుపీల్చి విడుచుకాలమునకు హంసగతికాలమని పేరు. నిద్రించువాని ఉశ్వాసనిశ్వాసములు సక్రమముగానుండును. గాన వాటినే ప్రమాణముగ శాస్త్రజ్ఞులు గ్రహించిరి. మానవదేహమునందు దినమునకు 21600 హంసగతులు నడచును. నేడు ఒకదినమును ఇరువదినాలుగుగంటలుగా వ్యవహరించుచున్నాము. కాబట్టి 21600 హంసగతులకాలము 24 గంటలకు సమానమైనప్పుడు ఒక్కొక్క హంసగతికాలము నాలుగు శెకండ్ల కాలమునకు సమానముగును. చిత్రమార్గమన ఎనిమిది హ్రస్వాక్షరములకాలము హంసగతికాలములో చిత్రమార్గమును అనుష్ఠింపవలసినదిగ పైశ్లోకమునందు గలదు. అనగా హంసగతికాలమైన నాలుగు శెకండ్ల కాలములో ఎనిమిది హ్రస్వాక్షరములను ఉచ్చరించవలెనని స్పష్టమైనది. నాలుగు శెకండ్లకాలములో ఎనిమిది హ్రస్వాక్షరముల నుచ్చరించునప్పుడు ఒక హ్రస్వాక్షరము నుచ్చరించుటకు అరశెకండుకాలము పట్టును. దీని ననుసరించి అక్షరశబ్దమునకు అ= అర్ధ, క్ష= క్షణములో, రం= రంజిల్లునది. అక్షరమని కొందరర్ధకల్పనము జేసిరి. ఈ ప్రకారము శెకండుకు రెండక్షరములైనవి. పూర్వము నేటి గడియారములు లేనందున క్షణకాలములో "తక" అను రెండక్షరముల నుచ్చరించుచు ఇట్టి కాలమును కనురెప్పమూసి తెరచునట్టికాలమని పూర్వులు నిర్ణయించిరి. వారి క్షణకాలము నేటి శెకండుకాలమునకు అన్నివిధముల సరిపోవుచున్నది. పూర్వాచారము ననుసరించి తాళముల నభ్యసించువారు నేటికిని తకతకాదులనే వినియోగించుకొనుచున్నారు. కాని ఆనాటి కాలపరిమాణములు మాత్రము నేడు తారుమారైనవి.

తాళము వేయునపుడు ఒక్కొక్క హస్తక్రియను ఒకఅక్షర (అరశేకండు) కాలముకంటె తక్కువకాలములో నిలుపుచు గానము చేసిన ఆగానమందు రక్తి లోపించుటయేగాక కొన్ని దోషములుకూడ సంభవించును. గతి తాళములందును, త్రికాలము లందును మాత్రము ఒక అక్షరమును అరశేకండుకాలము కంటె తక్కువకాలములో నుచ్చరింపవలసివచ్చును. అప్పడాకాలములు అనుద్రుతకాల మునకు అర్ధార్థన్యాయము ననుసరించి యుండవలయునుగాని వ్యత్యస్తముగ నుండ గూడదు. అక్షరకాలమునకు అనుద్రుతకాల మని పేరు. ఈఅనుద్రుతకాలము లో సగముకాలమైన పావుశేకండుకాలమునకు చతుర్భాగకాల మని పేరు. ఈచ తుర్భాగకాలములో సగముకాలమైన పరకశేకండుకాలమునకు కళాకాలమని పేరు. చతుర్భాగకళాకాలములలో ఒక్కొక్క అక్షరమునందు హస్తక్రియలను మాత్ర ము నడుపగూడదు. ఒక హస్తక్రియయందు అట్టి చతుర్భాగ, కళాకాలాక్షర ములను రెండు మూడు కాలములలో నుచ్చరించవచ్చును. కాలప్రమాణములు ఇతరగ్రంథము లందు అనేకవిధములుగ చెప్పబడినవి. వాటి నన్నిటి నిచ్చట సమ న్వయముజేయుట అప్రస్తుత మని వదలితిమి. పైనిర్ణయముప్రకారము కళాదికా కపాదమువరకు గల కాలములను దిగువ నుదహరించుచున్నాము.

| | |
|---|---|
| కళాకాలము= | పరకశేకండుకాలము. |
| చతుర్భాగకాలము= | పావుశేకండుకాలము. |
| అనుద్రుతకాలము= | అరశేకండుకాలము. |
| ద్రుతకాలము= | శేకండుకాలము. |
| లఘుకాలము= | రెండు శేకండ్లకాలము. |
| గురుకాలము= | నాలుగు శేకండ్లకాలము. |
| ప్లుతకాలము= | ఆరు శేకండ్లకాలము. |
| కాకపాదకాలము= | ఎనిమిది శేకండ్లకాలము. |

## త్రికాలపద్ధతి.

ప్రథమకాలము, రెండవకాలము, మూడవకాలము అని కాలములు మూడువిధములు.

**ప్రథమకాలము:—**

గీతప్రారంభమున తాళము నందలి హస్తక్రియల నొక్కదానిని గీతాక్షరకాలమునకు సమానకాలమున నడపిన నది ప్రథమకాలము. అనగా తాళముయొక్క నడక, గీతముయొక్క నడక సమానకాలములో నుండవలయును. ఒక్కొక్క హస్తక్రియను ఎన్ని అక్షరములకాలములో నడిపినను గీతమునందలి హ్రస్వాక్షరముల నొక్కొక్కదానిని అర శెకండుకాలమువంతునను, మిగిలిన అక్షరాదులను దామాషాప్రకారము ఆయాకాలములలోను ఉచ్చరించినప్పుడు తాళనడకతో గీతనడక సమానము కావలయును. అప్పుడు అది ప్రథమకాలము నెంచబడును.

ఉదాహరణము:—

ఆదితాళము (త్రిపుటచతురశ్రజాతి) హస్తక్రియల నొక్కొకదానిని అక్షరకాలమైన అర శెకండుకాలమువంతున నిలుపుచు గీతాక్షరములను గూడ నదేకాలమునను సరించి ఉచ్చరించినచో నది ప్రథమకాల మగును. గీతాక్షరములు తక్కువగా నుండి హస్తక్రియ ఎక్కువఅక్షరముల మార్గములో నడచునప్పుడు గీతాలమునకు లోపమురాకుండునట్లు గీతాక్షరములకు పదాంతమందు అకారాదులతో* రాగమును పెంచి తాళనడకకు ప్రథమకాలములో సరిపెట్టుకొనవలయును. ఒక్కొక్కహస్తక్రియను ఎన్నిఅక్షరములకాలమువరకు ఎన్నివిధములుగ నిలుపవచ్చునో ఆవివరములను ముందు మార్గప్రాణలక్షణమందు తెలియగలరు.

---

* అక్షరాదులను అనుటచే, అక్షరముల మధ్యమందు రాగమునుకూడ అని భావము.

రెండవకాలము:—

ప్రథమకాలమందు ఒక్కొక్క హస్తక్రియను ఎన్ని అక్షరములకాలమువరకు నిలుపుదురో అట్టికాలములోననే హస్తక్రియ ఒకటికి అంతకు రెట్టింపు అక్షరములను ఉచ్చరించుట రెండవకాల మగును.

ఉదాహరణము:—

హస్తక్రియ ఒకటికి ఒక అక్షరమువంతున ఉచ్చరించునప్పుడు ప్రథమకాలములో ఒక్కొక అక్షరమును ఉచ్చరించుటకు ఒక అర సెకండుకాలము పట్టును. అర సెకండుకాలములో హస్తక్రియఒకటికి రెండక్షరములను ఉచ్చరించిన అదిరెండవకాల మగును. అప్పుడు ఒక్కొక్క అక్షరమును ఉచ్చరించుటకు పావు సెకండు కాలము పట్టును. ఈకాలమునకు చతుర్భాగకాలమని పేరు.

మూడవకాలము:—

హస్తక్రియఒకటికి ప్రథమకాలాక్షరములకు నాలుగురెట్లక్షరములను అదే కాలములో ఉచ్చరించిన అది మూడవకాల మగును. పై ఉదాహరణమునందు హస్తక్రియను అర సెకండుకాలమువంతున నిలుపుచు క్రియకు ఒక్కొక్క అక్షరమును ఉచ్చరించుట ప్రథమకాలముగా చెప్పియున్నాము. ఈ అర సెకండుకాలములోననే హస్తక్రియవొకటికి నాలుగు అక్షరములవంతున ఉచ్చరించుట మూడవకాల మగును. అప్పుడు ఒక్కొక్క అక్షరమును ఉచ్చరించుటకు పరక సెకండుకాలము పట్టును. ఈకాలమునకు కళాకాల మని పేరు.

ఉదాహరణము;—

1. ప్రథమకాలము: హస్తక్రియ ఒకటికి "త" } ఒక అక్షరము ఒకఅర సెకండుకాలము. అనుద్రుత కాలము.

2. రెండవకాలము: హస్తక్రియఒకటికి <u>తక</u> } రెండక్షరములు రెండుపావు శెకండ్లకాలము. చతుర్భాగకాలములు.

3. మూడవకాలము: హస్తక్రియఒకటికి <u>తకతక</u> } నాలుగక్షరములు నాలుగు పరక శెకండ్లకాలము. కళాకాలములు.

రెండవ కాలమందు అక్షరముల క్రింద ఒక గీటుగలదు. ప్రథమకాలాక్షరమునకంటె రెట్టింపు ద్రుతముగా నుచ్చరించవలయు ననుటకు అది సంజ్ఞ. మూడవకాల మందు రెండు గీట్లుగలవు. ప్రథమకాలాక్షరమునకంటె నాలుగు రెట్లు ద్రుతము (తొందర) గా ఉచ్చరింపవలయుననుటకు గుర్తు.

## 2. క్రియాప్రాణలక్షణము.

రెండుహస్తములయొక్క సంయోగవియోగములవలన తాళక్రియలు కలుగుచున్నవి. తాళము వేయునప్పుడు రెండుచేతులతో చేయు సంజ్ఞలే క్రియలు. ఈక్రియలు హస్తములవలన కలుగుచున్నవిగాన హస్తక్రియలనబడినవి.

## క్రియలు రెండువిధములు.

శ్లో॥ మార్గదేశీగతత్వేన తత్క్రియాద్వివిధా ।
నిశ్శబ్దా శబ్దయుక్తా చ నిశ్శబ్దా తు కళోచ్యతే ॥

తా॥ హస్తక్రియలు మార్గములనియు, దేశీయములనియు రెండువిధములు. అందు మార్గక్రియలు నిశ్శబ్దములనియు, శబ్దయుక్తములనియు రెండు విధములు. మార్గనిశ్శబ్దక్రియలకు కళలని పేరు.

## మార్గనిశ్శబ్దక్రియలు.

శ్లో॥ స్యాదావాపోఽథ నిష్క్రామో విక్షేపశ్చ ప్రవేశకః ।
చతుర్విధాశ్చ విజ్ఞేయా నిశ్శబ్దాశ్చ క్రియా బుధైః ॥

తా॥ ఆవాపము, నిష్క్రమము, విక్షేపము, ప్రవేశము అనునవి నాలుగు మార్గనిశ్శబ్దక్రియలు.

లక్షణము.

శ్లో॥ ఆవాప స్తత్రి హస్త స్యోత్తాన స్యాంగుళికుంచనమ్,
నిష్కాశో మో ధస్తలస్య స్యా దంగులీనాం ప్రసారణమ్ ।
క్షేపో దక్షిణపార్శ్వ స్యోత్తానస్య ప్రసృతాంగుళేః,
విక్షేపో ౽ధస్తల స్యాస్య ప్రవేశో ౽ఙ్గుళికుంచనమ్ ॥

తా:— ఆవాపము:— పైకి ఎత్తబడిన హస్తముయొక్క వేళ్ళను ముడుచుట.

నిష్క్రామము:— పైనజెప్పిన ఆవాపహస్తమునందు ముడిచిన వేళ్లను విప్పుట. లేక చాచుట. (దీనిని క్రిందుగా తీసుకునిరావలయును.)

విక్షేపము:— నిష్క్రామహస్తమును కుడిపార్శ్వమున వెలుపలకు విసరుట.

ప్రవేశము:— విక్షేపహస్తమును అధోముఖముగ వేళ్ళను వంచి తనవైపునకు తెచ్చుట.

శ్లోకాంతరము.

శ్లో॥ సర్వాంగుళిసమాక్షేప ఆవాప ఇతి కీర్తితః ।
ఆవాపో ర్ధేందుహస్తస్య తాళ స్యాంజలికుంచనమ్,
నిష్క్రామోధ శ్చలం పశ్చా దంగులీనాం ప్రసారణమ్ ।
తస్య దక్షిణతః కాలో విక్షేప ఇతి కథ్యతే,
వివర్తనంచ హస్తస్య ప్రవేశో ధోముఖస్యచ ॥

తా:— ఆవాపము:— అర్ధచంద్ర హస్తముయొక్క తర్జని మొదలు నాలుగువేళ్ళను ముడుచుట.

వి:— తర్జని మొదలు నాలుగు వేళ్ళను సమముగా
కలిపిచాచి అంగుష్ఠమును ఎడముగా చాచిపట్టి
న నది అర్ధచంద్రహస్తము.

నిష్క్రామము:— ఆవాపహస్తమును కరతలమునకు అధోభా
గమునకు తెచ్చి నాలుగువేళ్లను సమము
గ చాచి పట్టుట.

విక్షేపము:— నిష్క్రామహస్తమును కుడివైపునకువిసరుట

పరివేశము:— విక్షేపహస్తమును కరతలములకు క్రిందినుం
ఊర్ధ్వముఖముగ త్రిప్పుట.

వి:— ఎడమఅర్ధచంద్రహస్తముమీద కుడి అర్ధచంద్రహస్తమును అ
ముగ కప్పి నాభికి సమముగా పట్టవలయును. రెండుహస్తములయొక్క అరచేతుల
కలియవలెను. ఎడమచేతి వ్రేళ్ళు దక్షిణముఖమును, కుడిచేతి వ్రేళ్ళు ప్రాఙ్ముఖము
చూచుచుండవలయును. ఈప్రకారముగ నున్న కుడిహస్తమును పైకి ఎత్తి తర్జ
మొదలు నాలుగువ్రేళ్లను ముడిచిన అది ఆవాపహస్తము. పైకి ఎత్తబడిన హస్త
ము వెల్లకిలగా నుండనక్కరలేదని, కొందరి మతము. ఈహస్తమును అట్లే తనవైపు
నకు తెచ్చి నాభికి సమముగ బట్టబడిన ఎడమఅర్ధచంద్రహస్తమునకు క్రిందినుం
(పిట్ట నీటిసమీపమునకు వచ్చి నీటిలోని జలచరములను కాలదన్నుకొని వెంట
పైకెగరిపోవునట్లువలె) ముందువైపునకు రానిచ్చిన అది నిష్క్రామహస్త మగును
కుడిచేతిని ఎడమచేతిక్రిందుగ ముందునకు తెచ్చునప్పుడు వ్రేళ్ళు ఊర్ధ్వము
ముగను, అరచేయి అద్దమును చూచినట్లు తన కభిముఖముగను ఉండవలయును
ఈహస్తమందు కుడిచేతిని క్రిందికి తీసుకొనివచ్చునప్పుడు నాభికిని ఎడమహస్తమ
నకును మధ్యగా తీసుకొని రాకూడదని కొందరి అభిప్రాయము. వెలుపలగా క్రిం
కితీసుకొనివచ్చి నాభికిని ఎడమచేతికిని మధ్యగా పైకి తీసుకొని రావలయునని వా

అభిప్రాయము. ఈపద్ధతికంటె పైన ప్రథమములో ఉదహరించిన విధానమే సౌకర్యముగ నున్నది.

నిష్క్రమహస్తముయొక్క అరచేతిని ఎడమవైపునకు త్రిప్పి కుడివైపునకు కత్తితో నరకినవిధముగా విసరవలయును. ఇదివిక్షేపలక్షణము. ఈవిక్షేపహస్తము యొక్క వేళ్ళను ముడిచి క్రిందుగా తనసమీపమునకు తెచ్చుట ప్రవేశహస్తము.

## మార్గశబ్దక్రియలు.

శ్లో॥ ధ్రువ శ్శమ్యా తథా తాలః సన్నిపాత ఇతీరితాః।
పాతః కలాచ సా జ్ఞేయా తాసాం లక్ష్మాభిలక్ష్యతే॥

తా:— ధ్రువము, శమ్యము, తాళము, సన్నిపాతము అనునవి నాలుగు మార్గశబ్దక్రియలు.

వి:— "శ్లో॥ శమ్యా తాళో ద్రుతశ్చైవ సన్నిపాత స్తథాపరమ్।" అను ప్రమాణము ననుసరించి ధ్రువమను శబ్దక్రియకు మతాంతరమునందు ద్రుతమని కూడ వ్యవహార మున్నట్లు తెలియుచున్నది.

## మార్గశబ్దక్రియలకు లక్షణము.

శ్లో॥ ధ్రువో హస్తస్య పాత స్స్యా చ్ఛోటికా శబ్దపూర్వకః।
శమ్యా దక్షిణహస్తస్య తాళో వామకరస్యచ,
ఉభయో స్సన్నిపాత స్స్యా త్తాసాం మార్గవశాదితి॥

తా:— ధ్రువము:— శబ్దపూర్వకమైన చిటుక.
శమ్యము:— కుడిచేతియందు ఎడమచేతితో దెబ్బకొట్టుట.
తాళము:— ఎడమహస్తమునందు కుడిచేతితో దెబ్బకొట్టుట.
సన్నిపాతము:— రెండుహస్తములయొక్క ఘాత.

వి:— తనకు అభిముఖముగ రెండు హస్తములతో నమస్కరించినటుల దెబ్బకొట్టుట సన్నిపాతము.

## శ్లో కాంతరము.

శ్లో॥ ధ్రువో హస్తస్య పాతస్స్యా చ్ఛుటికా శబ్దపూర్వకః,
శంపా వామనిపాతస్తు తాళో దక్షిణఘాతకః।
ఉభయో ర్హస్తయో ర్ఘాత స్సన్నిపాత ఇతి స్మృతః,
ఏతా మార్గక్రియా శ్చైవ కధితా భరతజ్ఞకైః॥

ఈశ్లోకార్థమును పైశ్లోకమునకు వలెనే గ్రహింపవలెను.

## దేశ్య క్రియలు.

శ్లో॥ ధ్రువకా సర్పిణీ కృష్యా పద్మినీ చ విసర్జితా।
విక్షిప్తా చ పతాకాఖ్యా పతితా ష్టౌ క్రియాస్తథా॥

తా:— ధ్రువక, సర్పిణి, కృష్య, పద్మినీ, విసర్జిత, విక్షిప్త, పతాక, ప
త అనునవి ఎనిమిది దేశ్యక్రియలు.

వి:— ఈ క్రియలు ధ్రువాదిదేశీయతాళములందు మాత్రమే వి
యోగ మగును.

## దేశ్య క్రియలలక్షణము.

శ్లో॥ సశబ్దా త్రి ధ్రువా జ్ఞేయా సర్పిణీ వామగామినీ,
కృష్యా దక్షిణతోగస్త్రీ పద్మినీ స్యా దధోగతా।
విసర్జితా బహిర్యాతా విక్షిప్తా కుంచనాత్మికా,
పతాకా తూర్ధ్వగమనా త్పతితా కరపాతనాత్।
ధ్రువపాతే ప్రయోజ్యా స్తా నా ఽవాపాదా కదాచన॥

తా:— 1. ధ్రువకము:— శబ్దక్రియ.

వి:— ఎడమలరచేతిలో కుడిలరచేతితో దెబ్బకొట్టుట. ఈక్రియ మా
శబ్దక్రియలలో "తాళము" అనుక్రియకు సమానము. ఇక మిగిలిన క్రియలన్నియు
నిశ్శబ్దక్రియలు.

2. సర్పిణి:— ఎడమవైపునకు చేతిని రానిచ్చుట.

వి:— ఇచ్చట చెయ్యిఅనగా అర్ధచంద్రహస్తము. అర్ధచంద్రహస్తలక్షణమును మార్గక్రియలందు చూడవలెను.

3. కృష్య:— ఎడమవైపునకు విసరిన అర్ధచంద్రహస్తమును కుడిపార్శ్వమునకు విసరుట.

4. పద్మిని:— తాళము వేయుటకొరకు ముందుగా చాచి పట్టబడిన ఎడమచేతికి క్రిందుగా నధోముఖముగ కుడిహస్తమును చాచుట.

5. విసర్జిత:— పై అర్ధచంద్రహస్తమును వెలుపలకు విసరుట.

6. విక్షిప్త:— వెలుపలకు విసరిన విసర్జిత హస్తము యొక్క తర్జని మొదలు నాలుగువేళ్లను ముడిచి తన వైపునకు రానిచ్చుట.

7. పతాకము:— పతాకహస్తమును మీాదికి పట్టుట.

వి:— వేళ్లకొనలు ఆకాశము చూచునట్లుగా పట్టవలెను.

8. పతిత:— పై పతాకహస్తమును క్రిందికి రానిచ్చుట.

వి:— ఒక్కొక్క హస్తక్రియను ఎంతకాలమువరకు నిలిపి యుంచవలెనో ఆవిషయమును మార్గప్రాణలక్షణమువలన తెలియనగును. (క్రియాప్రాణలక్షణము ముగిసినది. ఇందలి మార్గక్రియలు మార్గతాళములందు వినియోగమగును. తాళాధ్యాయము రెండవభాగమున మార్గతాళములను వివరింపగలము.

## 3. మార్గప్రాణలక్షణము.

తాళము వేయునప్పుడు ఒక్కొక్క హస్తక్రియను ఎంతకాలమువరకు నిలుపవలయునో ఆనియమములను ఈమార్గప్రాణలక్షణము వలన తెలియగలరు. తాళమునడుచు మార్గములను తెలుపును కాబట్టి దీనికి యీాపేరు వచ్చినది.

## అక్షరములు.

| | | |
|---|---|---|
| 1. | అతిచిత్రితమమార్గము | 1 |
| 2. | చిత్రితమమార్గము | 2 |
| 3. | చిత్రితరమార్గము | 4 |
| 4. | చిత్రిమార్గము | 8 |
| 5. | వార్తికమార్గము | 16 |
| 6. | దక్షిణమార్గము | 32 |
| 7. | ద్వీపమార్గము | 64 |
| 8. | సిద్ధమార్గము | 128 |
| 9. | రత్నమార్గము | 256 |
| 10. | వాయుమార్గము | 512 |
| 11. | రుద్రమార్గము | 1024 |
| 12. | ఆదిత్యమార్గము | 2048 |
| 13. | నిరీహావిశ్వమార్గము | 4096 |
| 14. | విశ్వమార్గము | 8192 |
| 15. | పాక్షికమార్గము | 16384 |
| 16. | కళామార్గము | 32768 |
| 17. | వాయుద్వీపమార్గము | 65536 |
| 18. | పురాణమార్గము | 131072 |
| 19. | వాయురత్నమార్గము | 262144 |
| 20. | రేఖామార్గము | 524288 |
| 21. | పూజామార్గము | 1048576 |
| 22. | ఖుర్రిమార్గము | 2097152 |
| 23. | పూజాదంపదమార్గము | 4194304 |

24. శ్రుతిదంపదమార్గము 8388608
25. తత్త్వమార్గము 1677216
26. శ్రుత్యాశ్రిమమార్గము 33554432
27. నక్షత్రిమార్గము 67108864

ఇట్లే మార్గములు అనంతములుగా నున్నవి. వీటినిఆచరించుట మానవులకు అసాధ్యమైనపని. ప్రస్తుతకాలమున కుపయుక్తమగు మొదటి ఆరుమార్గములను మాత్రిమే ఇందు వివరించుచున్నాము. ఈపై మార్గములు అన్నియు చతురశ్రి మార్గములని తెలియవలెను. అందువలననే ఆయామార్గముల మాత్రిలు ఒకదాని కంటె ఒకటి ద్విగుణాద్విగుణ న్యాయములోనున్నవి, ఇందు వివరింపబోవు మార్గ ములకు వలెనే మిగిలిన మార్గములను చూచుకొనేది.

షణ్మార్గములు:—

శ్లో॥ దక్షిణో వార్తికశ్చిత్రి స్తత్రి చిత్రితర స్స్మృతః।
తథా చిత్రితమ శ్చస్యా దతిచిత్రితమో మతః॥
ష డేవం కథితా మార్గా స్తత్స్వరూపం నిరూప్యతే।

తా:— దక్షిణము, వార్తికము, చిత్రిము, చిత్రితరము, చిత్రతమము, అతిచిత్రితమము అని మార్గములు ఆరువిధములు.

లక్షణము

శ్లో॥ తత్రి దక్షిణమార్గస్య మాత్రాష్టక ముదాహృతం।
వార్తికే తు చతు ర్మాత్రా శ్చిత్రిమార్గో ద్విమాత్రకః॥
ఏకమాత్రి శ్చిత్రితరో ద్రుత శ్చిత్రతమే మతః।
అతిచిత్రితమే మార్గే నుద్రుతః పరికీర్తితః॥

తా:— 1. దక్షిణమార్గము. 3. మాత్రిలకాలము.
2. వార్తికమార్గము. 4. మాత్రలకాలము.

| | |
|---|---|
| 3. చిత్రమార్గము. | 2. మాత్రలకాలము. |
| 4. చిత్రతరమార్గము. | 1. మాత్రకాలము. |
| 5. చిత్రతమమార్గము. | అర్ధమాత్రకాలము. |
| 6. అతిచిత్రతమమార్గము. | పావుమాత్రకాలము. |

వి:— కాలప్రాణలక్షణమునందు చిత్రమార్గమనగా ఎనిమిది హ్రస్వాక్షరముల కాలమని చెప్పియుంటిమి. అట్టి చిత్రమార్గకాలమును రెండుమాత్రల కాలముగ నిచ్చట చెప్పబడినది. ఈకారణమువలనను, 16 అక్షరములుగల కాకపాదమునకు నాలుగు మాత్రలుగల దని అనేకప్రదేశములందు చెప్పబడుటచేతను, ప్రథమములోపుట్టిన కాకపాదము చతురశ్రజాతిలో నున్నందునను, సప్తతాళములుగూడ ప్రథమమున చతురశ్రజాతిలోనే పుట్టినందునను, మాత్రయనగ నాలుగు అక్షరములుగల చతురశ్రమాత్రయని తెలియవలెను. ఈపద్ధతి ననుసరించి

| | | |
|---|---|---|
| 1. దక్షిణమార్గమునకు | 4×4= 32 | అక్షరములు |
| 2. వార్త్తికమార్గమునకు | 4×4= 16 | ,, |
| 3. చిత్రమార్గమునకు | 2×4= 8 | ,, |
| 4. చిత్రతరమార్గమునకు | 1×4= 4 | ,, |
| 5, చిత్రతమమార్గమునకు | $\frac{1}{2}$×4= 2 | ,, |
| 6. అతిచిత్రతమమార్గముకు | $\frac{1}{4}$×4= 1 | ,, |

అయినవి. మాత్రయన నాలుగు హ్రస్వాక్షరముల కాలమని సాంప్రదాయముగ కూడ వినియోగముగలదు. సంగీతరత్నాకరాది గ్రంథములందు మార్గతాళములకు అయిదు లఘ్వక్షరముల కాలపరిమాణముగల ఖండమాత్రను జెప్పినందున దానిని జూచి నేటి లక్షణవేత్తలు కొందరు మాత్రయనగ అయిదు లఘ్వక్షరములు గల ఖండమాత్రయేయనియును, సర్వత్రా ఈ ఖండమాత్రనే వినుయోగించు

కొనవలసినదిగను నిర్ణయించుచున్నారు. అయిదు లఘ్వక్షరముల మాత్రనుచతు రశ్రమాత్రగా వ్యవహరింపవచ్చుననియును, తాము అయిదు లఘ్వక్షరముల నుచ్చరింపగనే ఘటికాయంత్రము ప్రకారము సరిపోయినదనియును, చెప్పుచున్నారు. సర్వులు తమ అభిప్రాయమునే పాటింపవలసినదిగా ఆజ్ఞాపించు చున్నారు. అట్టివారు చతురశ్రమాత్రయను శబ్దమునందుగల చతురశ్రయను పదముయొక్క ప్రయోజనమును గమనింపరైరి. అయిదు లఘ్వక్షరముల మాత్రకు ఖండమాత్రయని పేరు. దీనిని ఖండజాతి లఘువుయనికూడ అందురు. ఈఖండమాత్రను విశేషముగ మార్గములలో వినియోగించుకొనవలసిన సందర్భ మును నిరూపించుచున్నాము.

శ్లో॥ లఘ్వక్షరాణాం పంచానాం మాన ముచ్చారణే హి తత్ ।
తత్ప్రమాణం పరిజ్ఞేయం మార్గ స్తాల స్తతో బుధైః ॥

తా:— అయిదు లఘ్వక్షరముల నుచ్చరించు (మాత్రా) కాలప్రమాణ మును మార్గతాళములలో వినియోగించుకొనవలయునని పెద్దలు నిర్ణయించిరి.

వి: — ఈమాత్ర దేశీయతాళములలో ఖండలఘువుగా వినియోగ మగును. పై శ్లోకము మాతాప్రలక్షణమునందే చెప్పబడినది.

—•తాళములందు మార్గములను వినియోగించుక్రమము•—

తాళమును వేయునప్పుడు ఒక్కొక్కహస్తక్రియను 32 అక్షరములకాలము వంతున నిలుపుచు తాళమును అనుష్ఠించిన అప్పుడు తాళము దక్షిణమార్గమున నడచుచున్నట్లు ఎంచవలయును. ఇట్లే వార్త్తికాది మార్గములలో తాళములను నడుపునప్పుడు తాళమునందలి హస్తక్రియలను ఆయామార్గకాలములలో నిలుప వలయును. ఈవిషయము ముందు వివరింపబడును.

త్రికాలమన నేమో కాలప్రాణలక్షణమునందు జెప్పియుంటిమి. పైన చెప్పిన ఆరుమార్గములకు త్రికాలములను జెప్పుచున్నాము.

1. దక్షిణమార్గము:—

తాళము వేయునప్పుడు ఒక్కొక్కహస్తక్రియను ఎనిమిది మాత్రలకాలము వరకు నిలుపుట ఈమార్గమందు ప్రథమకాలము.

ఎనిమిదిమాత్రలనగా 32 లఘ్వక్షరములు. క్రియాప్రాణలక్షణమునందు చెప్పిన శబ్దక్రియలనుగాని, నిశ్శబ్దక్రియలనుగాని తాళమునందనుష్ఠించునప్పుడు ఒకక్రియను అనుష్ఠించి 32 లఘ్వక్షరముల కాలము వరకు ఆచేతిని కదలుపక అట్లే యుంచవలయును. 32 అక్షరముల కాలము పూర్తి అయినవెంటనే రెండవ క్రియను అనుష్ఠించవలయును. అట్లే తాళమునందలి క్రియలన్నిటిని అనుష్ఠించవలయును. ఒక తాళమునందుగల క్రియలన్నిటిని ఒకమార్గములోనే నడుపవలయును. తాళమందు ఏకతాళమున రెండు మార్గములను నడుపకూడదు.

ముప్పదిరెండు లఘ్వక్షరముల కాలమైన 16 శెకండ్ల కాలములో హస్తక్రియఒకటికి 64 అక్షరములను ఉచ్చరించిన ఈమార్గమున రెండవకాలమగును. ఇందు అక్షరమును ఉచ్చరించుటకు పావు శెకండుకాలము పట్టును. అనగా చతుర్భాగకాలము.

ఈమార్గకాలమైన పదియారు శెకండ్ల కాలములోనే హస్తక్రియఒకటికి 128 అక్షరములను ఉచ్చరించిన యెడల ఈమార్గమున మూడవకాలమగును. ఇందు అక్షరమును ఉచ్చరించుటకు పరక శెకండుకాలము పట్టును. అనగా కళాకాలము.

2. వార్తికమార్గము:—

తాళమందు హస్తక్రియను నాలుగు మాత్రలకాలము నిలుపుట ఈమార్గమున ప్రథమకాలము. ఇది పదియారు అక్షరముల కాలము. ఎనిమిది శెకండ్ల కాలము పట్టును.

ఎనిమిది శెకండ్లకాలములో హస్తక్రియ ఒకటికి 32 అక్షరములను ఉచ్చరించుట ఈమార్గమున రెండవకాలము.

ఎనిమిది శెకండ్ల కాలములో హస్తక్రియ ఒకటికి 64 అక్షరముల నుచ్చరించుట ఈమార్గమున మూడవ కాలము.

దక్షిణమార్గములో వలెనే ప్రతి మార్గములోను అక్షరమును ప్రథమకాలమునందు అర శెకండు కాలములోను, రెండవ కాలమందు పావు శెకండు కాలములోను, మూడవ కాలమందు పరక శెకండు కాలములోను ఉచ్చరించవలయును. ఇవి క్రమముగా అనుద్రుత, చతుర్భాగ, కళాకాలములు:—

3. చిత్రమార్గము:—

తాళమునందు హస్తక్రియను రెండుమాత్రలకాలము నిలుపుట ప్రథమ కాలము. ఇది ఎనిమిది అక్షరములు, లేక నాలుగు శెకండ్లకాలము.

నాలుగు శెకండ్లకాలములో హస్తక్రియ ఒకటికి పదియారు అక్షరములను ఉచ్చరించుట ఈమార్గమున రెండవ కాలము.

నాలుగు శెకండ్లకాలములో హస్తక్రియఒకటికి 32 అక్షరములను ఉచ్చరించుట ఈమార్గమున మూడవ కాలము:—

4. చిత్రతరమార్గము:—

తాళమందు హస్తక్రియను ఒక మాత్రకాలము వంతున నిలుపుట ప్రథమ కాలము. మాత్రయన నాలుగు హ్రస్వాక్షరముల కాలము లేక రెండు శెకండ్ల కాలము.

రెండు శెకండ్లకాలములో హస్తక్రియఒకటికి ఎనిమిది అక్షరముల వంతున ఉచ్చరించుట ఈమార్గమున రెండవకాలము:—

రెండు శెకండ్లకాలములో హస్తక్రియఒకటికి పదియారు అక్షరముల వంతున మూడవకాలము:—

5. చిత్రతమమార్గము:—

తాళమందు హస్తక్రియను అర్ధమాత్ర (ద్రుత) కాలము వంతు నిలుపుట

ప్రథమకాలము. అర్థమాత్రయన రెండక్షరములకాలము. లేకఒక శెకండుకాలమ

ఒక శెండుకాలములో హస్తక్రియఒకటికి నాలుగు అక్షరముల వంత ఉచ్చరించుట ఈమార్గమున రెండవకాలము:—

ఒక శెకండు కాలములో హస్తక్రియఒకటికి ఎనిమిది అక్షరములను ఉచ్చ రించుట ఈమార్గమున మూడవకాలము:—

6. అతిచిత్రతమమార్గము:—

తాళమందు హస్తక్రియను పాతికమాత్ర (అనుద్రుతము) కాలము వంత నిలుపుట యీమార్గమున ప్రథమకాలము. పాతికమాత్ర ఒక హ్రస్వాక్ష కాలము. లేక అర శెకండు కాలము.

అర శెకండుకాలములో హస్తక్రియఒకటికి రెండు అక్షరముల వంతు ఉచ్చరించుట రెండవ కాలము:—

అర శెకండు కాలములో హస్తక్రియఒకటికి నాలుగు అక్షరములను ఉచ్చ రించుట యీమార్గమున మూడవకాలము:—

ఇంతవరకు వివరించిన ఆరుమార్గములు, చతురశ్రమార్గములు. ఇక 3. మొదలగు బేసి అక్షరములు గల మార్గములను దెలియవలసి యున్నవి. పైచతు రశ్ర మార్గములు గాక జాతిభేదమువలన ఏర్పడిన త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణమ లను మరినాలుగు మార్గములు గలవు.

1. త్రిశ్రమార్గము:—

తాళమునందు హస్తక్రియను త్రిశ్రమాత్ర కాలమువంతున నిలుపవలెన మూడు లఘ్వక్షరముల మాత్రకు త్రిశ్రమాత్రయని పేరు. ఒకటిన్నర శెకం కాలము. ఇది ప్రథమకాలము.

వి:— చతురశ్రమార్గములలో వలెనే వీటికిగూడ త్రికాలములుగలవ ఒకటిన్నర శెకండ్లకాలములో హస్తక్రియఒకటికి ఆరు అక్షరముల

ఉచ్చరించుట ఈమార్గమందు రెండవకాలము:—

ఒకటిన్నర శెకండ్లకాలములో హస్తక్రియఒకటికి 12 అక్షరములను ఉచ్చరించుట ఈమార్గమున మూడవకాలము:—

2. మిశ్రమార్గము:—

తాళమందు హస్తక్రియను ఒకటిం ముప్పాతిక చతురశ్రమాత్ర కాలము వంతున నిలిపిన ఈమార్గమున ప్రథమకాలము. ఇది మిశ్రమార్గము. ఏడుఅక్షరములు. మూడున్నర శెకండ్ల కాలము.

మూడున్నర శెకండ్లకాలములో హస్తక్రియఒకటికి 14 అక్షరములను ఉచ్చరించుట ఈమార్గమున రెండవకాలము.

మూడున్నర శెకండ్లకాలములో హస్తక్రియఒకటికి 28 అక్షరములను ఉచ్చరించుట ఈమార్గమున మూడవకాలము.

3. ఖండమార్గము:—

తాళమందు హస్తక్రియను ఒకటింబాతిక చతురశ్రమాత్ర కాలమువంతున నిలిపిన ఈమార్గమున ఇది ప్రథమకాలము. దీనికి ఖండమార్గమని పేరు. అయిదు హ్రస్వాక్షరములు. అయిదు లఘ్వక్షరములకు ఖండమాత్రయని, ఖండలఘువు అని కూడ వ్యవహారముకలదు. రెండున్నర శెకండ్లకాలము.

రెండున్నర శెకండ్ల కాలములో హస్తక్రియఒకటికి పది అక్షరములను ఉచ్చరించుట ఈమార్గమున రెండవకాలము.

రెండున్నర శెకండ్ల కాలములో హస్తక్రియఒకటికి 20 అక్షరములను ఉచ్చరించుట ఈమార్గమున మూడవకాలము.

4. సంకీర్ణమార్గము:—

తాళమందు హస్తక్రియను రెండుంబాతిక చతురశ్రమాత్రకాలము వంతున నిలిపిన ఈమార్గమున ప్రథమకాలమగును. దీనికి సంకీర్ణమార్గమని పేరు. తొమ్మిది

హ్రిస్వాక్షరములు. నాలుగున్నర శెకండ్ల కాలము.

నాలుగున్నర శెకండ్ల కాలములో హస్తక్రియఒకటికి 18 అక్షరములవంతె ఉచ్చరించుట ఈమార్గమున రెండవకాలము.

నాలుగున్నర శెకండ్లకాలములో హస్తక్రియ ఒకటికి 36 అక్షరము ఉచ్చరించుట ఈమార్గమునందు మూడవకాలము.

దక్షిణాది ఆరు చతురశ్ర మార్గములను, త్రిశ్రాది నాలుగు మార్గము దిగువపథకములో సంగ్రహించుచున్నాము.

—మార్గాక్షర కాలత్రికాలముల పథకము—

| సం. | మార్గముల పేర్లు | మార్గకాలము శెకండ్లలో | త్రికాలముల అక్షరముల సంఖ్య. ప్రథమకాలము. | రెండకాలము. | 3వ కా |
|---|---|---|---|---|---|
| 1. | దక్షిణమార్గము. | 16 | 32 | 64 | 128 |
| 2. | వార్త్తికమార్గము. | 8 | 16 | 32 | 64 |
| 3. | చిత్రమార్గము. | 4 | 8 | 16 | 32 |
| 4. | చిత్రతరమార్గము. | 2 | 4 | 8 | 16 |
| 5. | చిత్రతమమార్గము. | 1 | 2 | 4 | 8 |
| 6. | అతిచిత్రతమమార్గం | 1/2 | 1 | 2 | 4 |
| 7. | త్రిశ్రమార్గము. | 1 1/2 | 3 | 6 | 12 |
| 8. | మిశ్రమార్గము. | 3 1/2 | 7 | 14 | 28 |
| 9. | ఖండమార్గము. | 2 1/2 | 5 | 10 | 20 |
| 10. | సంకీర్ణమార్గము. | 4 1/2 | 9 | 18 | 36 |

దిగువ నుదహరించిన విధమున అక్షరములను ఉచ్చరించుచు పైమార్గము లను అభ్యసింపవలయును. ప్రథమకాల అక్షరములను మాత్రమే ఉదహరించు చున్నాము.

| | | |
|---|---|---|
| 1. దక్షిణమార్గము. | త క త క   త క త క<br>త క త క   త క త క<br>త క త క   త క త క<br>త క త క   త క త క | 32. |
| 2. వార్తికమార్గము. | త క త క   త క త క<br>త క త క   త క త క | 16. |
| 3. చిత్రమార్గము. | త క త క   త క త క | 8. |
| 4. చిత్రతరమార్గము. | త క త క | 4. |
| 5. చిత్రతమమార్గము | త క | 2. |
| 6. అతిచిత్రతమమార్గము | త | 1. |
| 7. త్రిశ్రమార్గము. | త కి ట | 3. |
| 8. మిశ్రమార్గము. | త కి ట   త క త క | 7. |
| 9. ఖండమార్గము. | త క   త కి ట | 5. |
| 10. సంకీర్ణమార్గము. | త క తకిట త క త క | 9. |

ప్రతిమార్గములోనను మార్గకాలమునందు ప్రథమకాల అక్షరములకు రెట్టింపు అక్షరములను ఉచ్చరించిన రెండవకాలమగును. అనగా పైప్రథమకాల అక్షరములను రెట్టింపుతొందరగా రెండు పర్యాయములు ఆకాలమందే ఉచ్చరింపవలెను. అదేవిధమున నాలుగు పర్యాయములు ఆకాలములోననే నాలుగు రెట్ల తొందరలో ఉచ్చరించుట మూడవకాలము. అతిచిత్రతమమార్గములో రెండవ కాలమున "త క" అనియును; మూడవకాలమున "త క త క" అనియును ఉచ్చరించవలయును. తాళావర్తమందలి హస్తక్రియలన్నిటిని ఒక మార్గములోననే నడుపవలయు ననియును, ఒక తాళములో ఏకకాలమందు రెండుమార్గములను అనుష్ఠింపకూడదనియును తిరిగి హెచ్చరించుచున్నాము.

నేడు కొందరు గాయకులు, వాదకులు ఒకతాళమున ఏకకాలమందు రెండు

మార్గములను అనుష్ఠించుచున్నారు. చతురశ్రజాతి త్రిపుట (ఆది) తాళమునం లఘువును చతురశ్రమార్గములోను, దుతములను త్రిశ్రమార్గములోను నడ చున్నారు. మార్గకాలమును తారుమారు జేయుచున్నారు. ఆదితాళమును హ క్రియకు నాలుగు అక్షరములవంతున కొన్ని ఆవర్తములు నడిపి, అనంతరము కాలములో హస్తక్రియఒకటికి మూడు అక్షరములవంతున కొన్ని ఆవర్తమ ఉచ్చరించి తిరిగి అదేకాలములో హస్తక్రియఒకటికి నాలుగు అక్షరములను ఉ రించుచున్నారు. ఇట్టివారికి ఒక అక్షరమునకు నిర్ణీతమైన కాలప్రమాణము నిమిత్తము లేకపోవుచున్నది. ఈ అన్యాయము పెద్దలలోనే ప్రబలిపోయినది. నిర్ణయము ప్రకారము అక్షరమున అరసెకండు కాలము వంతున అనుష్ఠింప పోయినను కనీసము తాము ప్రథమములో నియమించుకొనిన నియమమున అయినను బద్ధులయియుండుట ధర్మము. విధినిషేధములను గమనించి పాటించు ఉత్తమధర్మము. ప్రారంభించిన మార్గకాలమును ఎందరో పైకాలములందు స ర్థింపలేకపోవుచున్నారు. ఇత్యాది దోషములు కలుగకుండుటకుగాను మార్గము కడు జాగరూకతతో యుక్తమైన విధమున అభ్యసింపవలయును.

### హ్రస్వదీర్ఘాక్షరముల పద్ధతి.

దీనిని కాలపైకాలముల పద్ధతియని కొందరనెదరు. ఈపద్ధతులు ద్విగు స్వభావములు కలవి, ద్విగుణస్వభావములేనివి అని రెండు విధములు. దక్షి ఆరు చతురశ్రమార్గములు ద్విగుణస్వభావము గలవి. త్రిశ్రాది నాలుగు మా ములు ద్విగుణ స్వభావము లేనివి.

### మొదటి విధము.

దక్షిణాది చతురశ్రమార్గములలో ఒక్కొక్కమార్గమందు హస్తక్రియ టికి ఒకటే అక్షరమును దీర్ఘముగ నుచ్చరించుట ప్రథమకాలము. హస్తక్రి ఒకటికి రెండు అక్షరములను రెండు సమానకాలములలో ఉచ్చరించుట రెం కాలము. ఇట్లే తుదకు అన్నియు హ్రస్వాక్షరము లగునంతవరకు రెట్టింపు రెట్టిం

అక్షరములను సమకాలములలో ఉచ్చరించవలెను.

వివరము.

1. దక్షిణమార్గము :—

హస్తక్రియఒకటికి ఒకటేఅక్షరమును 32 అక్షరములకాలమైన 16 శెకండ్ల కాలము వరకు దీర్ఘముగ ఉచ్చరించుట ప్రథమకాలము.

హస్తక్రియఒకటికి రెండేసి అక్షరముల వంతున నడుపుచు ఒక్కొక్క అక్షరమును 16 అక్షరములకాలమైన 8 శెకండ్లకాలమువలకు దీర్ఘముగ నుచ్చరించుట రెండవకాలము.

హస్తక్రియఒకటికి నాలుగు అక్షరముల నడుపుచు ఒక్కొక్క అక్షరమును ఎనిమిది హ్రస్వాక్షరముల కాలమైన నాలుగుశెకండ్ల కాలమువరకు దీర్ఘముగ నుచ్చరించిన ఇది మూడవకాలము.

ఒక అక్షరము నాలుగు లఘ్వాక్షరముల కాలమైన రెండుశెకండ్ల కాలము వరకు దీర్ఘముగ ఉచ్చరించుచు అట్టి దీర్ఘాక్షరములను హస్తక్రియ ఒకటికి ఎనిమిది వంతున ఉచ్చరించిన అది నాలుగవకాలము.

హస్తక్రి ఒకటికి 16 అక్షరములను నడపుచు ఒక్కొక్క అక్షరమును రెండు అక్షరముల కాలమైన ఒకశెకండు కాలము వరకు దీర్ఘముగా ఉచ్చరించుట అయిదవకాలము.

హస్తక్రియ ఒకటికి యథాప్రకారముగ 32 అక్షరములను ఉచ్చరించుట ఈపద్ధతియందు ఆరవకాలము.

2. వార్తికమార్గము :—

ఒక అక్షరమును పదియారు అక్షరముల కాలమైన ఎనిమిది శెకండ్లకాలము వరకు దీర్ఘముగ నుచ్చరించుచు అట్టి అక్షరములను హస్తక్రియకు ఒక్కొక్కటి వంతున నడుపుట ప్రథమకాలము.

హస్తక్రియఒకటికి రెండుఅక్షరముల వంతున నడుపుచు ఒక్కొక్క అక్షరమును ఎనిమిది హ్రస్వాక్షరముల కాలమైన నాలుగు శెకండ్ల కాలమువరకు దీర్ఘముగ నుచ్చరించిన ఈపద్ధతియందు రెండవకాలము.

హస్తక్రియఒకటికి నాలుగుఅక్షరముల వంతున నడుపుచు ఒక్కొక్క అక్షరమును నాలుగుహ్రిస్వాక్షరముల కాలమైన రెండు శెకండ్లకాలమువరకు దీర్ఘముగా నుచ్చరించుట మూడవకాలము.

హస్తక్రియఒకటికి ఎనిమిది అక్షరముల వంతున నడుపుచు ఒక్కొక్కఅక్షరమును రెండుహ్రిస్వాక్షరముల కాలమైన ఒక శెకండు కాలము వరకు దీర్ఘముగా నుచ్చరించుట నాలుగవకాలము.

హస్తక్రియఒకటికి యథాప్రికారముగ పదియారు అక్షరములను ఉచ్చరించుట అయిదవకాలము.

3. చిత్ర మార్గము :—

హస్తక్రియఒకటికి ఒక అక్షరమునే ఎనిమిది లఘ్వాక్షరముల కాలమైన నాలుగు శెకండ్ల కాలము వరకు దీర్ఘముగా నుచ్చరించుట ప్రిథమకాలము.

హస్తక్రియఒకటికి రెండు అక్షరములను నడుపుచు ఒక్కొక్క అక్షరమును నాలుగు అక్షరముల కాలమైన రెండు శెకండ్ల కాలమునరకు దీర్ఘముగా నుచ్చరించుట రెండవకాలము.

హస్తక్రియఒకటికి నాలుగు అక్షరములను నడుపుచు ఒక్కొక్క అక్షరమును రెండు అక్షరముల కాలమైన ఒక శెకండు కాలమువరకు దీర్ఘముగ నుచ్చరించుట మూడవకాలము.

హస్తక్రియఒకటికి యథాప్రికారముగ ఎనిమిది లఘ్వాక్షరముల వంతున ఉచ్చరించుట నాలుగవకాలము.

4. చిత్రితర మార్గము :—

హస్తక్రియఒకటికి ఒకఅక్షరమునే నాలుగులఘ్వాక్షరముల కాలమైన రెండు శెకండ్ల కాలమువరకు దీర్ఘముగా నుచ్చరించుట ప్రిథమకాలము.

హస్తక్రియఒకటికి రెండుఅక్షరములవంతున నడుపుచు ఒక్కొక్క అక్షరమును రెండు లఘ్వక్షరముల కాలమైన ఒక శెకండు కాలమువరకు దీర్ఘముగానుచ్చరించుట రెడవకాలము.

హస్తక్రియఒకటికి యథాప్రకారముగ నాలుగు లఘ్వక్షరముల వంతున ఉచ్చరించుట మూడవకాలము.

5. చిత్రతమ మార్గము :—

హస్తక్రియఒకటికి ఒక అక్షరమునే రెండులఘ్వక్షరముల కాలము వరకు దీర్ఘముగా నుచ్చరించుట ప్రథమకాలము.

హస్తక్రియఒకటికి యథాప్రకారముగ రెండులఘ్వక్షరములను ఉచ్చరించుట రెండవకాలము.

6. అతిచిత్రతమ మార్గము :—

యథాప్రకారముగ హస్తక్రియఒకటికి ఒక లఘ్వక్షరమును ఉచ్చరించుట ప్రథమకాలము. ఈపద్ధతియందు దీనికి పై కాలములు లేవు.

ఈపద్ధతిని దక్షిణమార్గమునందు 1, 2, 3, 4, 5, 6 కాలములలోని ఒక్కొక్కఅక్షరమును క్రమముగ 16, 8, 4, 2, 1, 1/2 శెకండ్లకాలములలోను, వార్తికమార్గమునందు 1, 2, 3, 4, 5 కాలములలోని ఒక్కొక్క అక్షరమును క్రమముగ 8, 4, 2, 1, 1/2 శెకండ్ల కాలములలోను, చిత్రమార్గమునందు 1, 2, 3, 4 కాలములలోని ఒక్కొక్క అక్షరమును క్రమముగ 4, 2, 1, 1/2 శెకండ్ల కాలములలోను, చిత్రతరమార్గమందు 1,2,3 కాలములలోని ఒక్కొక్క అక్షరమును క్రమముగ 2, 1, 1/2 శెకండ్ల కాలములలోను, చిత్రతమమార్గమునందు 1, 2 కాలములలోని ఒక్కొక్కఅక్షరమును క్రమముగ 1, 1/2 శెకండ్ల కాలములలోను అతిచిత్రతమమార్గమునందు ఒక్కొక్కఅక్షరమును 1/2 శెకండు కాలములోను ఉచ్చరించవలెను.

## —:◆◆ దక్షిణాదిషణ్మార్గములకు హ్రస్వదీర్ఘప్లుతరముల పథకము ◆◆:—

| సం. | మార్గములు | మార్గాక్షరములు | మార్గకాలం కొండల్లో | హ్రస్వదీర్ఘప్లుతరములు. ప్రథమకాలము. | 2వకాలము. | 3వకాలము. | 4వకాలము. | 5వకాలము. | 6వకాలము. |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | దక్షిణ మార్గము. | 32 | 16 | త , , , , , , , ,<br>, , , , , , , , ,<br>, , , , , , , , ,<br>, , , , , , , , , | త , , , , , , , ,<br>, , , , , , , , ,<br>క , , , , , , , ,<br>, , , , , , , , , | త , , , , , , , ,<br>క , , , , , , , ,<br>త , , , , , , , ,<br>క , , , , , , , , | త , , , క , , ,<br>త , , , క , , ,<br>త , , , క , , ,<br>త , , , క , , , | త , క , త , క ,<br>త , క , త , క ,<br>త , క , త , క ,<br>త , క , త , క , | తకతకతకతక<br>తకతకతకతక<br>తకతకతకతక<br>తకతకతకతక |
| 2. | వార్త్తిక మార్గము. | 16 | 8 | త , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | త , , ,<br>, , , ,<br>క , , ,<br>, , , , | త , , ,<br>క , , ,<br>త , , ,<br>క , , , | త క ,<br>త , క ,<br>త , క ,<br>త , క , | త క త క<br>త క త క<br>త క త క<br>త క త క | |
| 3. | చిత్ర మార్గము. | 8 | 4 | త , , ,<br>, , , , | త , , ,<br>క , , , | త , క ,<br>త , క , | త క త క<br>త క త క | | |
| 4. | చిత్రతర మార్గము, | 4 | 2 | త , , , | త , క , | త క త క | | | |
| 5. | చిత్రతమ మార్గము. | 2 | 1 | త , | త క | | | | |
| 6. | అతిచిత్రతమమార్గం. | 1 | 1/2 | త | | | | | |

పై పథకమునందు దక్షిణమార్గములోని ఆరవకాలమును, వార్తికమార్గములోని అయిదవకాలమును, చిత్రమార్గములోని నాలుగవకాలమును, చిత్రతరమార్గములోని మూడవకాలమును, చిత్రమార్గములోని రెండవకాలమును, అతిచిత్రతమమార్గములో ఉన్న ఒకకాలమును, లోగా యీప్రకరణమునందు జెప్పబడిన మార్గత్రికాలములలో ఆయా మార్గము లందలి ప్రథమకాలములకు సమానము లౌచున్నవి. అనగా త్రికాలపద్ధతియందలి ప్రథమకాలములు ఈపద్ధతియందలి తుదికాలములు.

## రెండవవిధము.

త్రిశాదిబేసిఅక్షరములుగల మార్గములందు ఒక్కొక్క అక్షరమును దీర్ఘముగా నుచ్చరించుచూ ఎంతకాలమువరకు నిలుపగలుగుదురో అంతవరకు ద్విగుణద్విగుణస్వభావముగల దీర్ఘకాలములో ఒక్కొక్క అక్షరమును ఉచ్చరించవలెను. ఈపద్ధతియందు ప్రథమమున అక్షరమునకు నిర్ణయించుకొనిన దీర్ఘకాలము ప్రథమకాల మగును. తదుపరి అదేకాలములో దక్షిణాదిచతురశ్రమార్గములకువలెనే ఒక్కొక్క హస్తక్రియయందు అంతకు రెట్టింపు అక్షరములకు సమానకాలములో నుచ్చరించుట రెండవకాల మగును. ఈవిధముగ హస్తక్రియయందుగల అక్షరములన్నియు హ్రస్వాక్షరము లగునంతవరకు కాలపైకాలములను అనుష్ఠించవలెను. ఈపద్ధతియందు ప్రథమకాలము అనంతరము ఏర్పడే ప్రతికాలములోనను అక్షరములు అంతకు పూర్వమందలి కాలములోని అక్షరములయొక్క కాలపరిమాణములో సగము కాలపరిమాణమును కలిగి యుండును.

ఈప్రకారముగ కాలపైకాలములను నిర్ణయించినందువలన ఇతరమార్గములందు వీటికి సమానత్వము సిద్ధించును. అయినను అట్టి ఇతరమార్గములు ఈమార్గముల ననుసరించి ద్విగుణద్విగుణన్యాయములో నుండుటవలనను, ఈమార్గాక్షరములను చతురశ్రమార్గములందువలె ఆర్ధించుటకు వీలులేనందునను ఇతరకారణములవలనను త్రిశాదిమార్గములను ఈపద్ధతిలో వివరించితిమి. దిగువపథకమున వీటిని విపులముగ తెలియగలరు.

| —♦త్రిశ్రాదిచతుర్విధజాతిమార్గములకు హ్రస్వదీర్ఘాక్షరముల పథకము♦— | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| మార్గములు | సహజమార్గాక్షరములు | | పెంచినమార్గము | | హ్రస్వదీర్ఘాక్షరములు | | |
| | అక్షర సంఖ్య | సెకండ్ల కాలం | అక్షర సంఖ్య | సెకండ్ల కాలము | ప్రథమకాలము | రెండవకాలము | మూడవకాలము |
| త్రిశ్రమార్గము: | 3 | 1/2 | 12 | 6 | త ,,,<br>కి ,,,<br>ట ,,, | త, కి, ట,<br>త, కి, ట, | తకిట తకిట<br>తకిట తకిట |
| మిశ్రమార్గము: | 7 | 3 1/2 | 28 | 14 | త ,,,<br>కి ,,,<br>ట ,,,<br>త ,,,<br>క ,,,<br>త ,,,<br>క ,,, | త, కి, ట,<br>త, క, త,<br>క, త, కి,<br>ట, త, క,<br>త, క, | తకిట తక త<br>తకిట తక త<br>తకిట తక త<br>తకిట తక త |
| ఖండమార్గము: | 5 | 2 1/2 | 20 | 10 | త ,,,<br>క ,,,<br>త ,,,<br>కి ,,,<br>ట ,,, | త, క, త,<br>కి, ట,<br>త, క, త,<br>కి, ట, | త క త కి ట<br>త క త కి ట<br>త క త కి ట<br>త క త కి ట |
| సంకీర్ణమార్గము | 9 | 2 1/2 | 36 | 18 | త,,, క,,,<br>త,,, కి,,,<br>ట,,, త,,,<br>క,,, త,,,<br>క,,, | త,క,త,కి,<br>ట,త,క,త,<br>క,త,క,<br>త,కి,ట,<br>త,క,త,క. | తకతకిటతకత<br>తకతకిటతకత<br>తకతకిటతకత<br>తకతకిటతకత |

పై పథకమునందు మార్గాక్షరములను రెండుపర్యాయములు రెట్టించి దానిని ప్రథమకాలముగ నిర్ణయించి దానికి పై కాలములను జెప్పితిమి. ఇదేవిధమున శక్తి యున్నంతవరకు మార్గాక్షరములను ఎన్నిపర్యాయము లైనను రెట్టించి దానిని ప్రథమ కాలముగా నిర్ణయించుకొని పై విధమున పై కాలములను అనుష్ఠించ వచ్చును.

పై పథకమునందు మూడక్షరముల తిశ్రమార్గమును రెండుపర్యాయములు రెట్టించగా 12 అక్షరములైనవి. 12 అక్షరముల మార్గ మొకటి ప్రత్యేకముగ కలదు; కాని వాడుకలో లేదు. 12 అక్షరము లన? 6 శెకండ్లకాలము. దీని యందు ప్రథమకాలములో ఒక్కొక అక్షరమును రెండుశెకండ్లకాలములోనను రెండవకాలమందు ఒక్కొక్క అక్షరమును ఒక శెకండుకాలములోనను దీర్ఘముగ నుచ్చరింపవలెను. మూడవకాలమందు యథాప్రకారము అక్షరమును అర శెకండు కాలములో నుచ్చరింపవలయును. ఇదేవిధమున మిశ్ర, ఖండ, సంకీర్ణమార్గము లను అనుష్ఠించవలెను.

ఈ హ్రస్వదీర్ఘాక్షరముల పద్ధతిలో నేర్పడిన కాలవబలలో కొన్నిటి నీకా లమున కొందరు షట్కాలములుగా వ్యవహరించుచున్నారు. ఈపద్ధతియందు గూడ ప్రతిమార్గములోను షట్కాలములు ఉండవు నీటిని ఆవిధముగ గ్రహిం పవలసి వచ్చుచో దక్షిణమార్గము మొదలు క్రమముగా ఆరు మార్గములకు 8,7,6,5,4,3, వంతున కాలములు కళాకాలమువరకు గ్రహించినప్పుడుమాత్రమే ఏర్పడును. అప్పుడైనను ప్రతిమార్గములోనను షట్కాలములు ఏర్పడుటలేదు. అక్షరమును దీర్ఘముగా నుచ్చరించు నియమమును రాగముకొరకు ఉపయోగపడు టకుగా నిర్ణయించిరి. తాళముకొరకని భ్రమపడి కొందరు గారడీసంగీతమును తయారుచేయుచున్నారు. స్వరములను దీర్ఘదీర్ఘముగ నుచ్చరించుటకొరకును అక్షరములను దామాషాప్రకారముగ నిర్ణయమైన కాలములలో నుచ్చరించుటకు

సాధనకొరకు యీపద్ధతి జెప్పబడినది. షట్కాలము లనుటకంటె షణ్మార్గము
వ్యవహరించుకొనుట ఉత్తమము. లేనిచో ఒక స్వరమును ఉచ్చరించుటకు పా
భించి పాఠకుడు రెండవస్వరమును ప్రారంభించులోగా శ్రోతలు సమీపగా
మునకు వెళ్లిరా నవకాశ మేర్పడును. షణ్మార్గములకు ప్రతిమార్గమందును క్రి
లములు గలవు. కాబట్టి వాటిని మార్గములనుగానే వ్యవహరించుచు వాటి
త్రికాలములను అనుష్ఠించుట ఉత్తమమైన పద్ధతియని మాఅభిప్రాయము.



## 4 అంగప్రాణలక్షణము.

ఒక హస్తక్రియను గాని, ఒకటికి మించిన హస్తక్రియలను గాని తెలి
జేయునట్టి సంజ్ఞకు అంగ మని పేరు. ఒక అంగము లేక ఒకటికి మించిన అ
ములవలన తాళము ఏర్పడుచున్నది. ఇట్టి యంగములు పదియారు గలవు.
కాకపాదమునుండి ఏర్పడినవి. కాకపాదమునందు ఒక్కొక అనుద్రుతమును త
చుచు వచ్చిన 16 అంగములు ఏర్పడినవి. ఈఅంగములవలన తాళములు ఏర్ప
చున్నందున ఇవి తాళాంగము లనబడినవి.

| అంగముల పేరు. | అంగసంజ్ఞ | అంగముల పేరు | అంగసంజ్ఞ |
|---|---|---|---|
| 1 కాకపాదము | + | 4 ప్లుతవిరామము | [illegible] |
| 2 ప్లుతద్రుతవిరామము | [illegible] | 5 ప్లుతము | [illegible] |
| 3 ప్లుతద్రుతము | [illegible] | 6 గురుద్రుతవిరామము | [illegible] |

| అంగముల పేరు | అంగసంజ్ఞ | అంగముల పేరు | అంగసంజ్ఞ |
|---|---|---|---|
| 7 గురుద్రుతము | 8° | 12 లఘువిరామము | ◡\| |
| 8 గురువిరామము | 8◡ | 13 లఘువు | \| |
| 9 గురువు | 8 | 14 ద్రుతవిరామము | ○◡ |
| 10 లఘుద్రుతవిరామము | ◡°\| | 15 ద్రుతము | ○ |
| 11 లఘుద్రుతము | °\| | 16 అనుద్రుతము | ◡ |

అనుద్రుతమనినను, విరామమనినను ఒకటిగానే గ్రహించవలెను. ఈఅంగములు మార్గతాళమునందు వినియోగమగును. అనుద్రుతమును ప్రత్యేక తాళాంగముగ కొందరు శాస్త్రజ్ఞులు అంగీకరించలేదు. సంగీతరత్నాకరము నందు అనుద్రుతమును విరామముగ చెప్పియున్నారు. విరామమనగ కేవలము అనుద్రుతముగనే భావింపకూడ దని కల్లినాథుల మతము. ఏఅంగమునకు అనంతరము విరామము చెప్పబడునో ఆఅంగమునందలి సగము మాత్రాకాలమును విరామము కలిగియుండు నని కల్లినాథుని అభిప్రాయము. అందువలన విరామమునకు ఒక స్థిరమైన అర్థము కల్పించి ప్రత్యేకతాళాంగముగ విరామమును వినియోగించుకొనగూడదని నిషేధించిరి. పూర్వకాలమున అనుద్రుతమును కొందరు ప్రత్యేకతాళాంగముగ వినియోగించుకొనుచున్నందున అట్టివారు భరతంమన్యులని కల్లినాథులు వ్రాసిరి. కల్లినాథులు అనినట్లు విరామమునకు నిశ్చితార్థము లేనిచో తాళాంతమునందు లఘువు, అనంతరము ద్రుతము ఉన్నప్పుడు, గురువు అనంతరము

లఘువు ఉన్నప్పుడుకూడ విరామాంత మని చెప్పియుండవలసియుండెను. సంగీతరత్నాకరమున ఆవిధిగ చెప్పియుండలేదు.

ఉదాహరణములు:—

1. చతుర్థతాళము:—

శ్లో॥ లఘుద్వయం ద్రుత శ్చైకః ॥ | | o

2. నిశ్శంకలీలాతాళము:—

శ్లో॥ తాలే నిశ్శంకలీలాఖ్యే
ప్లుతౌ ద్వౌ గద్వయం లఘుః ॥ } ऽ̇ ऽ̇ ऽऽ ।

ఇట్లే అనేకతాళము లందు తుది అర్ధాంగమునకు పేరును చెప్పెను. గాని ఎచ్చటను విరామాంత మనియుండలేదు. ఇత్యాదిహేతువులవలన దేశీయతాళము లందు అనుద్రుతమును ప్రత్యేకతాళాంగముగ వినియోగించుకొనుటయే ఉత్తమ మని మాయాశయము.

పై షోడశాంగములలో ద్రుతవిరామము, లఘువిరామము, లఘుద్రుతవిరామము, గురువిరామము అను అంగములు లఘువు జాతిమార్పును పొందునపుడు వచ్చుచున్నవి. గాన వీటిని వివరింపవదలివేయుచున్నాము.

లఘుద్రుతము; గురుద్రుతము; గురుద్రుతవిరామము; ప్లుతవిరామము; ప్లుతద్రుతము; ప్లుతద్రుతవిరామము అను అంగములను పూర్వము మార్గతాళములలో వినియోగించుకొని యుండిరి. అనుద్రుత; ద్రుత; లఘు; గురు; ప్లుతములలో పై అంగములు అంతర్భూతములై యున్నవి. అనుద్రుత; ద్రుతములను ప్రత్యేకతాళాంగములుగ చెప్పుచున్నందున పై అంగములను వివరించుటలేదు. సంకీర్ణలఘువునకువలెనే పై అంగములు అధికాక్షరములలో నిలుపుకొని ఏకాంగముగనే మార్గతాళములందు వినియోగించుకొనవలయును. పై షోడశాంగములలో ముఖ్యమైన షడంగములనుమాత్రమే ఇందు వివరించుచున్నాము.

## షడంగములు.

శ్లో॥ విరామంచ ద్రుతంచైవ లఘు ర్గురుప్లుతే తథా ।
కాకపాదం తథా ప్రోక్తం తాళాంగానిచ షడ్విధం ॥

తా:— విరామము; ద్రుతము; లఘువు; గురువు; ప్లుతము; కాకపాదము అని తాళాంగములు ఆరువిధములు.

వి:— విరామ మనగ అనుద్రుతము.

## షడంగములకు సంజ్ఞలు.

శ్లో॥ ద్రుత స్తు వలయాకారో లఘురూర్ధ్వశరాకృతిః ।
గురు ర్వక్రధను ర్జ్ఞేయః ప్లుతశ్చ సశరా గురుః ॥
విరామ స్త్వర్థచంద్ర స్స్యా న్నిశ్శబ్దః కాకపాదవత్ ।

వి:— శ్లోకసౌకర్యముకొరకు పైశ్లోకమున ద్రుతమునుండి ప్రారంభించి చెప్పబడినది. అనుద్రుతము నుండి ప్రారంభమని గ్రహించవలెను:—

ఉదాహరణ.

తా:— 1. విరామము అర్థచంద్రాకారము. ◡
2. ద్రుతము వలయాకారము. ○
3. లఘువు బాణమువలె నిలువుగీటు. |
4. గురువు వక్రధనస్సు ఆకారము. ઽ
5. ప్లుతము శరముతో కూడిన గురువు. ઽ̇
6. కాకపాదము. +

అనుద్రుతము:—

శ్లో॥ అనుద్రుతోర్థచంద్ర స్స్యా ద్వ్యాంజనం చానునాసికం ।
అవ్యక్తంచ విరామంచ వక్తవ్యం భరతజ్ఞకైః ॥

(శ్లో కాంతరము.)

శ్లో॥ అనుద్రుతం జాతిబీజం విరామం చాక్షర శ్శిరః ।

తా:— అనుద్రుతము, అర్ధచంద్రము, వ్యంజనము, అనునాసికము, అవ్యక్తము, విరామము, జాతిబీజము, అక్షరము, శిరము, అనునవి అనుద్రుతమునకు పేర్లు.

వి:— మతాంతరము నందు అంకుశ, అణు, అర్ధబిందు, అర్ధద్రుత, ధను, అను పేర్లుకూడ గలవు.

2. ద్రుతము:—

శ్లో॥ అర్ధమాత్రం ద్రుతం వ్యోమ బిందుకం వలయాకృతిః ॥

(శ్లో కాంతరము.)

శ్లో॥ ద్రుతం చాక్షరయుగ్మంచ లఘువృత్తార్ధమాత్రికా ॥

తా:— అర్ధమాత్రి, ద్రుతము, వ్యోమము, బిందువు, వలయము, అక్షరద్వయము, లఘువు, వృత్తము, అనునవి ద్రుతమునకు పేర్లు.

వి:— మతాంతరమునందు వ్యంజనము, శూన్యము; ఆకాశము, ఉత్తర; ఖ, కూప, వలయము అను పేర్లుకూడ కలవు.

3. లఘువు:—

శ్లో॥ లఘు స్సరళనామాచ హ్రిస్వవ్యాపకమాత్రికం ॥

(శ్లో కాంతరము.)

శ్లో॥ మాత్రస్య సరళం హ్రిస్వం కళాయాంచ లఘు ర్భవేత్ ॥

తా:— లఘువు, సరళము, హ్రిస్వము, కళ, వ్యాపకము, మాత్రి అనునవి లఘువునకు పేర్లు.

వి:— మరొక మతము నందు శర; దంప; ఛట; మేరు అనుపేర్లు కూడ కలవు.

4. గురువు:—

శ్లో॥ గురు ర్వక్రో ద్విమాత్రశ్చ కళాభో దీర్ఘ ఇత్యపి ॥

(శ్లోకాంతరము)

శ్లో॥ ద్విమాత్రకం గురు ర్వక్రం కాణోయ మళదీర్ఘకం॥

తా:— గురువు, వక్రము, ద్విమాత్ర, కళ, దీర్ఘము, కాణము, యమళము, అనునవి గురువునకు పేర్లు.

వి:— మరొక మతము నందు పూజ్య, గోప్యకళ, కేయూర, నూపుర, హార, కంకణ అను పేర్లుకూడ కలవు.

5. ప్లుతము:—

శ్లో॥ ప్లుతం త్ర్యంగం దీప్తసంజ్ఞం నామ చేతి త్రిమాత్రికం ॥

(శ్లోకాంతరము)

శ్లో॥ సమోద్భవం ప్లుతం దీప్తం తథా త్ర్యంగం త్రిమాత్రికం ॥

తా:— ప్లుతము, త్ర్యంగము, దీప్తము, నామము, త్రిమాత్రికము, సమోద్భవము అనునవి ప్లుతమునకు పేర్లు.

వి:— మరొక మతమునందు సామజ అనుపేరు గలదు.

6. కాకపాదము:—

శ్లో॥ కాకో హంసపదాభ్యోపి నిశ్శబ్దశ్చ చతుర్లఘుః ॥

తా:— కాకపాదము, హంసపాదము, నిశ్శబ్దము, చతుర్లఘువు అనునవి ఈఅంగమునకు పేర్లు. దీనికి చతుష్కళ యను మరొక పేరుకూడ గలదు

పడంగములకు వినియోగము.

1. అనుద్రుతము:—

దీనిని నేడు ధ్రువక్రియలో అనుష్ఠించుచున్నారు. ఈఅంగము సప్తతాళములలో ఒక ఝంపతాళములోమాత్రమే కలదు. ఇది శబ్దక్రియ.

2. ద్రుతము:—

ఈద్రుతమును నేడు ధ్రువక, విసర్జిత అను రెండుక్రియలలో వినియో చుకొనుచున్నారు. మొదటిది శబ్దక్రియ; రెండవది నిశ్శబ్దక్రియ. ద్రుతము గల కాలమును రెండు సమానభాగములుగ విభజించి అందు మొదటిభాగకా మును ధ్రువకక్రియతోను, రెండవభాగకాలమును విసర్జితక్రియతోను అనుష్ఠిం వలెను. తాళము నడచు మార్గకాలము ననుసరించి ద్రుతకాలము నిర్ణయమగు

3. లఘువు:—

అంగనిఘంటువునందు ఇది మాత్రయని చెప్పబడినది. జాతిపేరును హరించకయే మాత్ర యని చెప్పినపుడు చతురశ్రమాత్ర యని తెలియవలె దీని పరిమాణము నాలుగు లఘ్వక్షరముల కాలము. ఈమాత్రలో సగముకాల ద్రుతకాల మనియును; నాలుగవవంతుకాలము అనుద్రుతకాల మనియును శా ప్రసిద్ధము. మార్గభేదమును పొందునప్పుడుతప్ప సామాన్యముగ అనుద్రుత నకు ఒక లఘ్వక్షరకాలమనియును, ద్రుతమునకు రెండు లఘ్వక్షరముల కాల నియును తెలియవలెను. కాబట్టి అనుద్రుతమునకు నాలుగురెట్లును, ద్రుతమున రెండురెట్లును సర్వమార్గములందును లఘువుయొక్క కాలప్రమాణ మగును. ల ఘువును పూర్వము ఒక ధ్రువకక్రియతోడనే అనుష్ఠించుచుండినట్లు దిగువ ప్రమా ణమువలన తెలియుచున్నది.

శ్లో॥ ధ్రువకా సర్పిణీ కృష్యా ప్లుతేచ పరివర్తితా ।
ధ్రువకా పతితే దీర్ఘే ధ్రువకాచ లఘు స్స్మృతః ॥
ధ్రువకార్ధద్రుతశ్చైవ తదర్ధం మునయో విదుః ।

తా:— పైశ్లోకమునందు లఘు, ద్రుత, అనుద్రుతములను క్రమము ఒక ధ్రువకక్రియ, అర్ధధ్రువకక్రియ, పాతికధ్రువకక్రియలతో వినియోగించు వలసినదిగ చెప్పబడినది. ధ్రువకక్రియ యనగా ఒక ఘాత. ద్రుత, అనుద్రు ములందు యీఘాతను అర్థించుట ఎట్లని కొందరికి సంశయము కలుగవచ్చు

లఘువును అనుష్ఠించునప్పుడు నాలు గక్షరముల కాలమువరకు నిలిపిన "ధ్రువక" అను హస్తక్రియను రెండు అక్షరముల కాలమువరకే నిలిపినట్లయిన అర్ధధ్రువకక్రియ యగును. ఒక అక్షరకాలమువరకే నిలిపిన పాతికధ్రువకక్రియ యగును. ఈపద్ధతి లఘువు చతురశ్రజాతిలో నున్నప్పుడుమాత్రమే సరిపోవును. నేడు లఘ్వంగమునందలి మొదటి అక్షరమును ధ్రువకక్రియతోడను, మిగిలిన అక్షరములను వ్రేళ్లను ఎంచుటమాలమునను వినియోగించుకొనుచున్నారు. వీనిలో ధ్రువకక్రియమాత్రమే శబ్దక్రియ. వ్రేళ్లను ఎంచునవి నిశ్శబ్దక్రియలు. లఘువుయొక్క కాలము మార్గభేదముల ననుసరించి మారుచుండును. ఏజాతిలఘువునందు వ్రేళ్లను ఎంతవరకు ఎంచవలసినది జాతిప్రకరణమునందు గలదు.

4. గురువు:—

పైన లఘువును గురించి చెప్పిన శ్లోకములో "ధ్రువకా పతితే దీర్ఘే" అను గురువును వినియోగించుకొనుక్రమము చెప్పబడినది. ధ్రువక, పతిత అను రెండు క్రియలతో గురువును అనుష్ఠించవలెను. రెండు లఘువులు ఒక గురు వగును. గురువునందుండు ప్రథమలఘువును ధ్రువకక్రియతోడను, రెండవలఘువును పతిత అను క్రియతోడను అనుష్ఠించవలయును. అనగా ఎడమచేతియందు కుడిచేతితో దెబ్బ కొట్టి లఘుకాలము పూర్తియగునంతవరకు ఆచేతిని అట్లే యుంచి లఘుకాలము పూర్తియయిన అనంతరము కుడిచేతిని క్రిందకు విసరి ఆచేతి రెండవలఘుకాలము పూర్తియగునంతవరకు అటులే యుంచవలయును. ఇదియొక పద్ధతి.

మరొక పద్ధతియందు పై విధముగ దెబ్బకొట్టి లఘువులో మొదటిభాగకాలమువరకు ఆచేతిని అటులే యుంచి ఆలఘువులో గల మిగతా భాగకాలములు పూర్తియగునంతవరకు ఒక్కొక్కభాగమునకు ఒక్కొక వ్రేలివంతున ఎంచి రెండవలఘువును పైవలెనే పతిత అను క్రియతోడ అనుష్ఠించవలెను. జాతిభేదము ననుసరించి లఘువుయొక్క హస్తక్రియలసంఖ్యయు, మార్గభేదము ననుసరించి హస్తక్రి

య యందలి అక్షరములసంఖ్యయు మారుచుండును. లఘువు మొదలు కాకపాద మువరకుగల అంగములుమాత్రమే జాతిమార్పును పొందును. అనుద్రుతము మొదలు కాకపాదమువరకుగల అంగము లన్నియు మార్గభేదములను పొందును.

5. ప్లుతము:—

దీని ప్రమాణము మూడు లఘువుల కాలము. "ధ్రువకా సర్పిణీ కృష్యా ప్లుతేచ పరివర్తితా" అను ప్రమాణము ననుసరించి ధ్రువక, సర్పిణీ, కృష్య, అను మూడుక్రియలతోడ క్రమముగ మూడు లఘువులను వినియోగించుకొనవలయును. ఇందు మొదటి లఘువును గుర్వంగమునందువలె రెండు విధములలో నేదో విధమున ధ్రువకక్రియతో ననుష్ఠించవలెను. రెండవలఘువును సర్పిణీక్రియతోను, మూడవలఘువును కృష్య అను క్రియతోడను వినియోగించుకొనవలెను. లఘువులను ఏజాతిలో అనుష్ఠించుకొనిన ఇది ఆజాతిప్లుత మగును. ఇచ్చటపాఠములు ఒక విషయమును ముఖ్యముగ గమనింపదగియున్నవి. అనుద్రుత, ద్రుత, లఘువు లందు అక్షరమునకు ఒక హస్తక్రియ చెప్పబడియున్నందున వాటియందు దక్షిణాదిదశవిధమార్గములను వినియోగించుకొను క్రమము బోధపడుచునే యున్నది. వీటిలో హస్తక్రియల ననుసరించి మార్గములను మార్చుకొనవచ్చును. ఇక గురు, ప్లుత, కాకపాదములలో లఘువునకు ఒక క్రియవంతున చెప్పియుండుటచే మార్గములను వినయోగించుకొనునప్పుడు సంశయములు కలుగవచ్చును. గురు, ప్లుత, కాకపాదము లందలి యథాక్షరములను హస్తక్రియలుగా నిర్ణయించుకొని అందు మార్గములను వినియోగించుకొనవలయును. ఈవిషయమును జాతిప్రకరణమున వివరించుచున్నాము. మతాంతరమునందు ఈప్లుతమునకు ధ్రువక, కృష్య, పతిత అను క్రియలలో గూడ వినియోగము గలదు.

6 కాకపాదము:—

దీనిలో నాలుగు లఘువులు గలవు. దీనికి పదియారు లఘ్వక్షరములకాలము పరిమాణము. ఈ అంగమును సర్పిణీ, కృష్ణ, పతాక, పతిత అను నాలుగు నిశ్శబ్దక్రియలచేత అనుష్ఠించవలయును. ఇందు గల నాలుగు లఘువులను క్రమముగ నాలుగు క్రియలతో వినియోగించుకొనవలయును. జాతి, మార్గములను అనుసరించి ఈఅంగముకూడ కాలభేదములను పొందును.

## రంగప్లుతము.

వి:— ఈకాకపాదమునందు ఘాతను అనుష్ఠించినచో రంగప్లుతమని వ్యవహారము గలదు. అరచేతియందు కొట్టుతో హస్తమును కుడిప్రక్కకు కొనివచ్చి ఒక లఘుకాలమువరకు అచ్చటనే యుంచి, అనంతర మెడమవైపునకు తెచ్చి అచ్చట ఒక లఘుకాలము ఉంచి, కాకపాదములో వలెనే హస్తమును పైకి ఎత్తి ఒక లఘుకాలము నిలిపి, తదుపరి క్రిందికివిడిచి, ఒకలఘుకాలము నిలుపవలయును.

## మతాంతరమునందు షడంగముల వినియోగము.

అనుద్రుతాదిషడంగములను తాళములందు అంగుళపరిమాణములతో వినియోగించుకొను పద్ధతి ఒకప్పుడు ఆచరణయందున్నటులు తెలియుచున్నది.

శ్లో॥ ద్వ్యయాంగులో బాలచంద్రో ద్రుతస్తు చతురంగుళః ।
లఘు రష్టాంగుళః ప్రోక్తో గురు స్స్యా త్షోడశాంగుళః ।
ద్వాత్రింశ త్కాకపాద స్స్యా త్తానాంగుళనిర్ణయః ॥

తా:— అనుద్రుతమును రెండంగుళములు, ద్రుతమును నాలు గంగుళములు, లఘువును ఎనిమిది అంగుళములు, గురువును పదియా రంగుళములు, కాకపాదమును ముప్పది రెం డంగుళములు ఈపరిమాణములలో ఉన్నతముగా అనుష్ఠించవలయును.

వి:— పై శ్లోకమునందు అనుద్రుతము మొదలు ద్విగుద్విగుణన్యాయము లో కాకపాదమువరకుగల అంగములకుమాత్రమే అంగుళపరిమాణములు గలవు. ప్లుతము ద్విగుణపద్ధతిలో లేనందున చెప్పబడియుండలేదు. లఘుపరిమాణము ననుసరించి ప్లుతపరిమాణమును గుర్తించవచ్చును. లఘువుకు ఎనిమిది అంగుళపరిమాణమైనప్పుడు ప్లుతమునందు మూడు లఘువు లుండును గనుక ప్లుతపరిమాణ మిరువదినాలుగు అంగులము లగును. ఈ పై పరిమాణములు చతురశ్రజాతిలో అతిచిత్రతమమార్గ మందు చెప్పబడినవి. జాతి మార్గములు మారినప్పుడు క్రమప్రకారము అంగుళపరిమాణములును, క్రియల అక్షరకాలపరిమాణములును మారుచుండును.

ఎడమచేతి అర్ధచంద్రహస్తమును నాభికి సమానముగ వెల్లకిలగ పట్టవలయును. ఆవిధముగ నున్న ఎడమచేతిలో కుడిఅర్ధచంద్రహస్తముతో దెబ్బకొట్టి ఆకొట్టుతోడనే కుడిచేతిరెండు అంగుళముల పైకి ఎత్తిన అది అనుద్రుత మగును తాళము ఏమార్గమున నడచుచుండిన ఆమార్గకాలము ననుసరించి దెబ్బకొట్టిన కుడిచేతిని పైకి పోనివ్వవలయును. లఘ్వాదిఅంగముల జాతిమార్పు ననుసరించి అంగుళములు నిర్ణయ మగును. కాని తన ఇచ్చవచ్చిన విధమున చేతిని పైకి తీసుకొని పోకూడదు. ఎడమచేతిని మాత్రము కదల్చకూడదు. ఇటులే తక్కినఅంగములను అనుష్ఠించవలయును. కాకపాదమునందు శబ్దక్రియ లేనందున దెబ్బకొట్టకయే ఎడమచేతిమీదనుండిన కుడిహస్తమును పైకి ముప్పదిరెండు అంగుళముల వరకు ఎత్తవలయును. ఈవిధముగ తాళాంగములను వినియోగించుకొనునప్పుడు వెనుక చెప్పిన అక్షరకాలములకు ఏలాటిభంగములను రానివ్వకూడదు ఈపద్ధతి విశేషముగ మార్గతాళములందు వినియోగ మగును.

తాళములను వినియోగించుకొనుటకు రెండు పద్ధతులను చెప్పియున్నాము

ఒక తాళము నందు ఒకపర్యాయమే ఈ రెండుపద్ధతులను వినియోగించుకొన కూడదు. ఏదో ఒక పద్ధతిలోననే ఆచరింపవలయును.

పై రెండుపద్ధతులలో కూడ కాకపాదముతప్ప మిగిలిన అంగములు శబ్దక్రియతోడనే ప్రారంభ మగుచున్నవి. శబ్దక్రియ ననుష్ఠింపగనే అంగము ప్రారంభమైన ట్లెంచదగును. అనగా అంగప్రారంభమున తప్ప తాళములలో మరెప్పుడును శబ్దక్రియల ననుష్ఠింపగూడదు. తాళప్రధానమైన వాద్యములకు మాత్రము ఈనియమము వర్తించదు. వాటి ధర్మములు వేరుగా నుండును. శైవమౌళాభజనలందు కంచుతాళములతో అనులోమవిలోమములుగ త్రికాలములను అనుష్ఠించునప్పుడు అనేక శబ్దక్రియలు కలుగుచున్నవి. వాటికి కూడ నియమములు గలవు. * ప్లుతము తప్ప జాతిమార్పును పొందునట్టి లఘు గురు కాకపాదములు

* పైనియమములను పాటించువారు నేడు అరుదుగ నున్నారు. క్రియలను, అంగములను అనుష్ఠించునప్పుడు నేడు కొందరు విద్వాంసులుసహితము పెడత్రోవలనడచుచున్నారు. దక్షిణోత్తరపశ్చిమదేశములవారినుండి తాము అనుకరించిన పద్ధతులు సలక్షణములో, అవలక్షణములోగమనింపకయే వారునూతనమార్గములను దేశములోనికి ప్రవేశపెట్టుచున్నట్లు గర్వించుచున్నారు. "హిమగిరితనయాపత్యం" అనుకృష్ణలీలాతరంగములలోని ప్రథమశ్లోకము నాదితాళములో కీర్తనగ సశబ్దనిశ్శబ్దక్రియలను పాటింపగ తల పంకింపుచూ ఒకరు గానము చేయుటనుచూచి గ్రాట్లైదాటు వ్యవహారముగ అన్యదేశమునుండి ఆపద్ధతిని రవాణా చేయువారేగాని శాస్త్రమర్యాదను గాని, రక్తినిగాని గమనించువారు అరుదుగ నున్నారు. కొందరు ఒక్కొక్కహస్తక్రియలో రెండు మూడు శబ్దక్రియల ననుష్ఠించుచున్నారు, లఘువును ద్రుతములుగను, ద్రుతములను లఘువుగను అనుష్ఠించెదరు. త్రిశ్రజాతి త్రిపుటతాళములోని లఘువును నిశ్శబ్దక్రియగను ద్రుతములను సొంతము శబ్దక్రియలుగను కొందరనుష్ఠించుచున్నారు. విద్వాంసుల మనుపించుకొన యత్నించువారు ప్రక్కవాద్యపరులను మోసముచేయుటమూలమున కీర్తినిగడింపనెంచి కృత్రిమపద్ధతులలో తాళములను వేయుచున్నారు. ప్రక్కవాద్యపరులతో ఒద్దికను కుదుర్చుకొని వారికి తెలిసిన రాగతాళములలో గానముచేయుట

ప్రతిజాతిలోను క్రమముగ ఒకదానికంటె ఒకటి రెట్టింపు కాలపరిమాణములలో నుండును.

ప్లుతముతప్ప అనుద్రుతము మొదలు కాకపాదమువరకు గల అయిదు అం ములు చతురశ్రజాతిలో నున్నప్పుడుమాత్రమే క్రమముగ ఒకదానికంటె ఒక రెట్టింపు కాలపరిమాణములలో నుండును.

ప్లుతము ప్రతిజాతియందును ఆయా జాతిలఘ్వంగమునకు మూడురెట్లధి కాలపరిమాణమును కలిగియుండును.

ఒకతాళము లందలి అంగము లన్నిటిని ఒక మార్గములోననే అనుష్ఠిం చవలెను.

లఘుగురు కాకపాదముల జాతిభేదములను జాతిప్రాణలక్షణమందు తెలియ వలెను.

---

ధర్మము. తాను గానము చేయనున్న రాగతాళములను ముందుగ ప్రక్కవాద్యపరులకు తెలియ యవలయును. ప్రక్కవాద్యపరులు తమతోపాటిసమర్థులయినను, అర్థభావములను పోషింప చుచో పై నియమములను విధిగ పాటింపవలయును శాస్త్రమందు కొందరికి అభిమానముశూన్యమ అట్టివారు చంకలతోను, కాళ్లతో, తలతోను చేతులతోను, వివిధతాళములను ఏకకాళమందు అ ష్ఠించెదరు. కొందరు అష్టావధానములకు ధశావధానములు చేయుదురు. భావశూన్యమైన గార సంగీతమును కొందరు గానము ఫైనార్ట్సులోని దని వచించెదరు. ఇట్టి పెద్దలు దేశములో విరివి తయారైనందుననే గానముయొక్క ప్రాముఖ్యతను గమనించువారు అరుదైరి. గానము బ్రహ్మ ద్యవంటిదని తెలియ గోరితిమి. కొందరు లక్షణము అక్కరలేదనియును, స్వేచ్ఛగాగానముచేసి నే గాని భావము కలుగదని అభిప్రాయపడుచున్నారు. గాని స్వేచ్ఛ యన తమస వశపగుటయో తా ము వశమగుటయో అట్టివారు గమనించుటలేదు. లక్షణమునందు స్వేచ్ఛను సంపాదించుటయే స్వేచ్ఛ యనుపించుకొనును గానితామొక అవలక్షణమునకు లోబడుట స్వేచ్ఛ యనుపించుకొనదు. లక్షణమును విడిచి సంచరించుట కాళ్లతో నడకనుమాని మోకాళ్లతో నడచుటవంటిది. లక్షణ ము పరిత్యజించిన వానిస్థితి మాతాపితృలను బాల్యముననే కోలుపోయిన వాని స్థితివలె నుండును. లక్షణమును పాటించుచు తాళములను అభ్యసించినవారికిమాత్రమే గానమందు స్వేచ్ఛ జనించును.

## —షడంగవివరములను తెలుపు పథకము—



| సం. | అంగములు | అంగసంజ్ఞలు | చతురశ్రజాతియం దక్షరములు | అంగుళములు | వినియోగక్రియలు. |
|---|---|---|---|---|---|
| 1 | అనుద్రుతము: | ◡ | 1 | 2 | ధ్రువక |
| 2 | ద్రుతము: | ○ | 2 | 4 | ధ్రువక, విసర్జిత |
| 3 | లఘువు: | \| | 4 | 8 | ధ్రువక- వ్రేళ్ళనెంచుట |
| 4 | గురువు: | ऽ | 8 | 16 | ధ్రువక- పతిత |
| 5 | ప్లుతము: | ऽ̍ | 12 | 24 | ధ్రువక, సర్పిణి, కృష్య |
| 6 | కాకపాదము: | + | 16 | 32 | సర్పిణి, కృష్య, పతాక, పతిత. |

# 5. జాతిప్రాణలక్షణము.

లఘ్వంగము జాతిమార్పును పొందును. అప్పుడు లఘువుయొక్క అక్షరములసంఖ్య వృద్ధిక్షయములను పొందును.

## లఘుజాతులు.

శ్లో॥ చతురశ్రత్రిశ్రమిశ్రఖండసంకీర్ణకా స్తథా ।
పంచధా జాతయ స్సర్వే తత్స్వరూపం నిరూప్యతే॥

తా:— చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణము లని లఘుజాతులు అయిదు విధములు.

## లక్షణము.

శ్లో॥ చతురక్షరమానేన చతురశ్రలఘుస్స్మృతః ।
త్ర్యశ్రేతు త్ర్యక్షరం ప్రోక్తం మిశ్రే సప్తాక్షరం భవేత్ ॥
ఖండే పంచాక్షర మిదం సంకీర్ణేతు నవాక్షరమ్ ।
ఏవ మక్షరకాలేన లఘుజాతివినిర్ణయః ॥

తా:— లఘువు చతురశ్రజాతియందు 4 అక్షరములను, త్రిజాతియందు 3 అక్షరములను, మిశ్రజాతియందు 7 అక్షరములను, ఖండజాతియందు 5 అక్షరములను, సంకీర్ణజాతియందు 9 అక్షరములను కలిగియుండును.

వి:— ఈ లఘువులలో ప్రథమాక్షరమును ధ్రువకక్రియతోను, మిగిలిన అక్షరములను వ్రేళ్లను ఎంచుటతోను వినియోగించుకొనవలెను. చిటికెనవ్రేలు మొదలు బొటనవ్రేలివరకు ఎంచిన అనంతరము లఘ్వంగమునందలి అక్షరములు

మిగిలియున్న యెడల తిరిగి చిటికెనవ్రేలినుండి ఎంచవలయును. వ్రేళ్లను ఎంచుట పూర్తి అయినంతమాత్రమున మిగిలియున్న అక్షరములను తిరిగి దెబ్బనుండి ప్రారంభించగూడదు. ఒక అంగములో రెండుశబ్దక్రియలు ఉండవు. ప్రతిఅంగము నందు ఒక శబ్దక్రియమాత్రమే ఉండును. వ్రేళ్లను ఒకపర్యాయము ఎంచగామిశ్ర సంకీర్ణజాతుల లఘువులందు 1, 3 అక్షరములు మిగులును. మిశ్రజాతిలో తిరిగి చిటికెనవ్రేలును ఎంచిన పూర్తియగును. సంకీర్ణజాతియందు తిరిగి మధ్యమవ్రేలి వరకు ఎంచిన పూర్తి యగును.

ఉదాహరణము:—

1. చతురశ్రజాతిలఘువు.




1 అరచేతిఘాత.
2 చిటికెనవ్రేలు.
3 అనామికవ్రేలు.
4 మధ్యమవ్రేలు.

ఎడమచేతివ్రేళ్లను కుడిచేతివ్రేళ్లతో ఎంచవలెను. ఏవ్రేలిని ఆవ్రేలితోనే ఎంచవలయును.

2. త్రిశ్రజాతిలఘువు.




1 అరచేతిఘాత.
2 చిటికెనవ్రేలు.
3 అనామికవ్రేలు.

3 మిశ్రజాతిలఘువు.

1 అరచేతి ఘాత.
2 చిటికెనవ్రేలు.




3 అనామిక వ్రేలు.
4 మధ్యమ వ్రేలు.
5 తర్జనీ వ్రేలు.
6 అంగుష్ఠము.
తిరిగి 7 చిటికెన వ్రేలు.

4. ఖండజాతిలఘువు.




1 అరచేతిఘాత.
2 చిటికెన వ్రేలు.
3 అనామిక వ్రేలు.
4 మధ్యమ వ్రేలు.
5 తర్జనీ వ్రేలు.

5. సంకీర్ణజాతిలఘువు.




1 అరచేతిఘాత.
2 చిటికెన వ్రేలు.
3 అనామిక వ్రేలు.
4 మధ్యమ వ్రేలు.
5 తర్జనీ వ్రేలు.
6 బొటన వ్రేలు.
తిరిగి 7 చిటికెన వ్రేలు.
తిరిగి 8 అనామిక వ్రేలు.
తిరిగి 9 మధ్యమ వ్రేలు.

చతురశ్రజాతిలఘువు మధ్యమ వ్రేలితోను, త్రిశ్రజాతిలఘువు అనామిక వ్రే లితోను, ఖండజాతిలఘువు తర్జనీ వ్రేలితోను, సంకీర్ణ జాతిలఘువుమధ్యమ వ్రేలితోను అంతమగుచున్నవి. ఇందెంచునట్టి వ్రేళ్లనుకూడ హస్తక్రియలుగనే భావించవ యును. ఈలఘువులను దక్షిణాదిదశవిధమార్గములలో వినియోగించుకొనునపు ఆయా లఘువుల కేర్పడునట్టి కాలపరిమాణములు దిగువపథకమున గలవు.

## మార్గభేదములందు చతురశ్రాది
## లఘుకాలనిర్ణయపథకము.

| మార్గములు | మార్గాక్షరములు | చ. లఘువు. 4 క్రియలు. | | త్రి. లఘువు. 3 క్రియలు. | | మి. లఘువు. 7 క్రియలు. | | ఖం. లఘువు 5 క్రియలు. | | సం. లఘువు 9 క్రియలు. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | అక్షరములు. | శెకండ్ల కాల | అక్షరములు. | శెకండ్ల కాలము | అక్షరములు. | శెకండ్ల కాలము | అక్షరములు. | శెకండ్ల కాలము | అక్షరములు. | శెకండ్ల కాలము. |
| దక్షిణ మార్గము | 32 | 128 | 64 | 96 | 48 | 224 | 112 | 160 | 80 | 224 | 1[illegible]4 |
| వార్తిక మార్గము | 16 | 64 | 32 | 48 | 24 | 112 | 56 | 80 | 40 | 144 | 72 |
| చిత్ర మార్గము | 8 | 32 | 16 | 24 | 12 | 56 | 28 | 40 | 20 | 72 | 36 |
| చిత్రతర మార్గము | 4 | 16 | 8 | 12 | 6 | 28 | 14 | 20 | 10 | 36 | 18 |
| చిత్రతమ మార్గము | 2 | 8 | 4 | 6 | 3 | 14 | 7 | 10 | 5 | 18 | 9 |
| అతిచిత్రతమమార్గం | 1 | 4 | 2 | 3 | 1, 1/2 | 7 | 3, 1/2 | 5 | 2, 1/2 | 9 | 4, 1/2 |
| త్రిశ్ర మార్గము | 3 | 12 | 6 | 9 | 4, 1/2 | 21 | 10, 1/2 | 15 | 7,1/2 | 27 | 13, 1/2 |
| మిశ్రమార్గము: | 7 | 28 | 14 | 21 | 10, 1/2 | 49 | 24, 1/2 | 35 | 17, 1/2 | 63 | 31, 1/2 |
| ఖండమార్గము: | 5 | 20 | 10 | 15 | 7, 1/2 | 35 | 17, 1/2 | 25 | 12, 1/2 | 45 | 22, 1/2 |
| సంకీర్ణ మార్గము | 9 | 36 | 18 | 27 | 13, 1/2 | 63 | 31, 1/2 | 45 | 22, 1/2 | 81 | 40,1/2 |

లఘువు జాతి ననుసరించి గురు, ప్లుత కాకపాదములు కూడ జాతిమార్పును పొందును. అతిచిత్రతమమార్గములో లఘు, గురు, ప్లుత, కాకపాదములకు చతుర

శ్రాదిజాతులందు అక్షర (హస్తక్రియల) కాలమును క్రింది పథకములో వివరించుచున్నాము.

| అంగములు. | చతురశ్ర | | త్రిశ్ర | | మిశ్ర | | ఖండ | | సంకీర్ణ | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | అక్షరములు | సెకండ్ల కాలం | అక్షరములు | సెకండ్ల కాలం | అక్షరములు | సెకండ్ల కాలం | అక్షరములు | సెకండ్ల కాలం | అక్షరములు | సెకండ్ల కాలం |
| లఘువు: | 4 | 2 | 3 | 1,1/2 | 7 | 3,1/2 | 5 | 2,1/2 | 9 | 4,1/2 |
| గురువు: | 8 | 4 | 6 | 3 | 14 | 7 | 10 | 5 | 18 | 9 |
| ప్లుతము: | 12 | 6 | 9 | 4,1/2 | 21 | 10,1/2 | 15 | 7,1/2 | 27 | 13,1/2 |
| కాకపాదము | 16 | 8 | 12 | 6 | 28 | 14 | 20 | 10 | 36 | 18 |

ఈ అంగములను అంగప్రాణలక్షణమునందు చెప్పినవిధమున తాళములలో హస్తక్రియలతో వినియోగించుకొనవలెను. లఘ్వంగములో వలెనే గురు, ప్లుత, కాకపాదములకు గూడ దక్షిణాదిదశవిధమార్గములను జాతిభేదము ననుసరించి వినియోగించుకొనవలెను.

## చతురశ్రాది గురువులకు దక్షిణాదిదశవిధమార్గములందు అక్షరకాలనిర్ణయపథకము.



| మార్గములు | మార్గాక్షరములు | చ. గురువు. | | త్రి. గురువు. | | మి. గురువు. | | ఖం. గురువు. | | సం. గురువు. | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | అక్షరములు | శేకండ్లకాలం | అక్షరములు | శేకండ్లకాలం | అక్షరములు | శేకండ్లకాలం | అక్షరములు | శేకండ్లకాలం | అక్షరములు | శేకండ్లకాలం |
| దక్షిణమార్గము: | 32 | 256 | 128 | 128 | 64 | 448 | 224 | 320 | 160 | 576 | 288 |
| వార్తికమార్గము: | 16 | 128 | 64 | 96 | 48 | 224 | 112 | 160 | 80 | 288 | 144 |
| చిత్రమార్గము: | 8 | 64 | 32 | 45 | 24 | 112 | 56 | 80 | 40 | 144 | 72 |
| చిత్రతరమార్గము: | 4 | 32 | 16 | 24 | 12 | 56 | 28 | 40 | 20 | 72 | 36 |
| చిత్రతమమార్గము: | 2 | 16 | 8 | 12 | 6 | 28 | 14 | 20 | 10 | 36 | 18 |
| అతిచిత్రతమమా– | 1 | 8 | 4 | 6 | 3 | 14 | 7 | 10 | 5 | 18 | 9 |
| త్రిశ్రమార్గము: | 3 | 24 | 12 | 18 | 9 | 42 | 21 | 30 | 15 | 54 | 72 |
| మిశ్రమార్గము: | 7 | 56 | 28 | 42 | 21 | 98 | 49 | 70 | 35 | 126 | 63 |
| ఖండమార్గము: | 5 | 40 | 20 | 30 | 15 | 20 | 35 | 50 | 25 | 90 | 46 |
| సంకీర్ణమార్గము | 9 | 72 | 36 | 54 | 27 | 126 | 63 | 90 | 45 | 162 | 81 |

## చతురశ్రాది ప్లుతములకు దక్షిణాదిమార్గములందు అక్షరకాలనిర్ణయపథకము.



| మార్గ ములు | మార్గాక్షర ములు | చ. ప్లుతము | | త్రి. ప్లుతము | | మి. ప్లుతము | | ఖం. ప్లుతము | | సం. ప్లుతము | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | అక్షర ములు | శెకండ్ల కాలం | అక్షర ములు | శెకండ్ల కాలం | అక్షర ములు | శెకండ్ల కాలం | అక్షర ములు | శెకండ్ల కాలం | అక్షర ములు | శెకండ్ల కాలం |
| దక్షిణ మార్గము: | 32 | 384 | 192 | 288 | 144 | 672 | 336 | 480 | 240 | 464 | 232 |
| వార్తిక మార్గము: | 16 | 192 | 96 | 144 | 72 | 336 | 168 | 240 | 120 | 232 | 116 |
| చిత్ర మార్గము: | 8 | 96 | 48 | 72 | 36 | 168 | 84 | 120 | 60 | 116 | 58 |
| చిత్రతర మార్గము: | 4 | 46 | 24 | 36 | 18 | 84 | 42 | 60 | 30 | 108 | 56 |
| చిత్రతమ మార్గము: | 2 | 24 | 12 | 18 | 9 | 42 | 21 | 30 | 15 | 54 | 27 |
| అతిచిత్ర తమమా- | 1 | 12 | 6 | 9 | 4,1/2 | 21 | 10,1/2 | 15 | 7,1/2 | 27 | 13,1/2 |
| త్రిశ్ర మార్గము: | 3 | 36 | 18 | 27 | 13,1/2 | 63 | 31,1/2 | 45 | 22,1/2 | 81 | 40,1/2 |
| మిశ్ర మార్గము: | 7 | 84 | 42 | 63 | 31,1/2 | 147 | 73,1/2 | 105 | 52,1/2 | 189 | 94,1/2 |
| ఖండ మార్గము: | 5 | 60 | 30 | 45 | 22,1/2 | 105 | 52,1/2 | 75 | 37,1/2 | 135 | 67,1/2 |
| సంకీర్ణ మార్గము: | 9 | 108 | 54 | 81 | 40,1/2 | 189 | 94,1/2 | 135 | 67,1/2 | 243 | 121,1/2 |

## చతురశ్రాది కాక పాదములకు దక్షిణాది దశవిధ మార్గములందు

## అక్షర, కాల, నిర్ణయ పథకము.



| సంఖ్య | మార్గములు | మాత్రాక్షరములు | చతురశ్రజాతి కాకపాదము | | తిశ్రజాతి కాకపాదము | | మిశ్రజాతి కాకపాదము | | ఖండజాతి కాకపాదము | | సంకీర్ణజాతి కాకపాదము | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | అక్షరములు | శెకండ్లకాలము | అక్షరములు | శెకండ్లకాలము | అక్షరములు | శెకండ్లకాలము | అక్షరములు | శెకండ్లకాలము | అక్షరములు | శెకండ్లకాలము |
| 1 | దక్షిణ మార్గము | 32 | 512 | 256 | 384 | 192 | 896 | 448 | 640 | 320 | 1152 | 576 |
| 2 | వార్తిక మార్గము | 16 | 256 | 128 | 192 | 96 | 448 | 224 | 320 | 160 | 576 | 288 |
| 3 | చిత్ర మార్గము | 8 | 128 | 64 | 96 | 48 | 224 | 112 | 160 | 80 | 288 | 144 |
| 4 | చిత్రతర మార్గము | 4 | 64 | 32 | 48 | 24 | 112 | 56 | 80 | 40 | 144 | 72 |
| 5 | చిత్రతమ మార్గము | 2 | 32 | 16 | 24 | 12 | 56 | 28 | 40 | 20 | 72 | 36 |
| 6 | అతి చిత్రతమ మార్గము | 1 | 16 | 8 | 12 | 6 | 28 | 14 | 20 | 10 | 36 | 18 |
| 7 | తిశ్ర మార్గము | 3 | 48 | 24 | 36 | 18 | 84 | 42 | 60 | 30 | 108 | 54 |
| 8 | మిశ్ర మార్గము | 7 | 112 | 56 | 84 | 42 | 196 | 98 | 140 | 70 | 252 | 126 |
| 9 | ఖండ మార్గము | 5 | 80 | 40 | 60 | 30 | 140 | 70 | 100 | 50 | 180 | 90 |
| 10 | సంకీర్ణ మార్గము | 9 | 144 | 72 | 108 | 54 | 252 | 126 | 180 | 90 | 324 | 162 |

## —* వి ని యో గ దో ష ము లు *—

శ్లో॥ ద్వాదశాక్షర సంయుక్తం నామ ప్లుతమి తీరితం
తద్దివ్యగురు రిత్యేవ యో బ్రూయాత్స జనాధమః.

తా:— పదిరెండక్షరముల ప్లుతమును దివ్యగురువని చెప్పువాడు అధముడని తాత్పర్యము.

వి:— ఆరు క్రియలుగల అంగమునకు దివ్యలఘువని పేరు. షోడశాంగములలోని లఘు ద్రుతాంగమునకు రెట్టింపు కాలముగల ప్లుతము దివ్యలఘువునకు రెట్టింపుకాలములో నున్న దివ్యగురుకాలమునకు సమానమగుచున్నది. 12 అక్షరముల కాలమును గురువుగ వినియోగించుకొనునపుడును, ప్లుతముగ వినియోగించుకొనునపుడును క్రియలలో భేదముండును. దాని ననుసరించి గీతము యొక్క నడక భేదించును. కాన పైరెండిటిలోను ఒక తాళములో నున్నగీతమును మరియొక తాళముతో వినియోగించుకొనుట దోషమని ఈ శ్లోకాభిప్రాయము.

శ్లో॥ గృహేచ నవమే జాతః సంకీర్ణలఘు రిత్యపి
యేబ్రూవంతి ప్లుతం త్రిశ్రిం రౌరవం నరకం భవేత్॥

తా:—తొమ్మిది (క్రియలు) అక్షరముల లఘువును త్రిశ్రజాతి ప్లుతమని చెప్పువాడు రౌరవ నరకమును పొందునని తాత్పర్యము.

వి:— సంకీర్ణలఘువును, త్రిశ్రజాతిప్లుతమును క్రియలందు సమాన సంఖ్య గలవియైనను వీటి నడకలో భేదము గలదు. సప్తతాళ ప్రకరణమునందు జెప్పబడిన ప్రకారము ఒకప్పుడు లఘువును ఒక ఘాతలో నిలుపుచు అనుష్ఠించ వచ్చును. ప్లుతమును ఎట్టి సందర్భములో నైనను మూడు క్రియలతో నడుపుట తప్పదు. ఛందస్సు ననుసరించి గీతము ఏర్పడుచున్నది. ఆ ఛందో గీతమున కనుకూలముగనే తాళము ఏర్పడుచున్నది. ఒక తాళమునకు సంబంధించిన గీతమును మరియొక నడక గల తాళముతో ననుష్ఠించుచు గీతపు నడకను తారుమారు జేయు నెడల అందనేక దోషములు సంభవించును. వాటివలన అనేక నష్టములు కలుగును.

ఇట్టి సందర్భములో ఏక కాలమందు ఒక గీతమును వివిధ తాళములతో ననుష్ఠించుచూ అది గొప్ప పాండిత్యముగ ప్రకటించుకొనుచో అందువలన కలుగు దోషములు వర్ణింప నలవి కానివి. కాన వాటి నన్నిటిని వివరించుట ఎందులకని ఆవిధముగ గానమును జేయువారు రౌరవనరకమును పొందుదురని పై శ్లోకమున చెప్పబడినది.



# 6. గ్రిహాప్రాణ లక్షణము

గ్రహములు రెండు విధములు. అందొకటి తాళగ్రహము. రెండవది రాగగ్రిహము. రాగగ్రహమును రాగాధ్యాయమున వివరింతుము. తాళమందు గీతమును ప్రారంభించు స్థానమునకు తాళగ్రిహమని పేరు. గ్రిహమన గ్రహించుట. తాళమందు గీతమును ఏస్థానమునుండి గ్రహింతుమో లేక ప్రారభింతుమో ఆస్థానభేదములను ఈ గ్రహప్రాణ లక్షణము వలన తెలియ గలము.

శ్లో॥ గ్రహోఽతీతోఽనాగతశ్చ సమశ్చ విషమ స్తథా
ఏవం చతుర్విధా ప్రోక్త స్తాళగ్రహావిచక్షణైః॥

శ్లోకాంతరము

శ్లో॥ అతీతోఽనాగతశ్చైవ సమశ్చ విషమోఽపిచ
గ్రహాశ్చతుర్విధా ప్రోక్తా స్తత్స్వరూపం నిరూప్య తే॥

తా:—అతీతము, అనాగతము, సమము, విషమము అని తాళగ్రహములు నాలుగు విధములు.

లక్షణము

శ్లో॥ గీతాతీతే త్వతీతస్స్యా త్తాళాతీతే త్వనాగతః
సమస్సగ్రహః ప్రోక్తస్తాళజ్ఞైః పూర్వసూరిభిః॥

శ్లోకాంతరము-

శ్లో॥ గీతాతీతే త్వతీతస్స్యా త్తాళాతీతే త్వనాగతః
గీతాయాః తాళసంయుక్తా సమగ్రిహ మితీరితం
ఆద్యంతయో రనియమో విషమశ్చ ప్రకీర్తితః
మాత్రాధిక్యంచ తస్యైవ క్వచి త్కేచి త్ప్రచక్షతే॥

తా:—గీతమును ప్రారంభించిన పిమ్మట తాళమును ప్రారంభించుట అతీతము. తాళమును ప్రారంభించిన పిమ్మట గీతమును ప్రారంభించుట అనాగతము.

తాళగీతముల రెండింటిని ఒక పర్యాయమే ప్రారంభించుట సమము. ఆద్యంత నియమములు లేక అధికమాత్రలు గడచిన తర్వాత గీతమును ప్రారంభించుట విషమము.

వి:—గీతమును ప్రారంభించుటకు ముందు తాళమును నడచు మార్గమును నిర్ణయించుకొనవలెను. అటుపిమ్మట తాళమునందు గీత ప్రారంభ స్థానమును నిర్ణయించుకొనవలెను. తాళము మార్గము ముందుగా నిర్ణయముకానిది గ్రహ స్థానమును నిర్ణయించుటకు వీలుండదు. అందువలన తాళమార్గములను ముందుగ నిర్ణయించుకొనుట అవసరము. "తాళమునకంటె ముందు గీతమును ప్రారంభించుట" అనికదా అతీతగ్రహలక్షణము. అగుచో గీతమునకంటె తాళము ముందుగ నెట్లు నిర్ణయించుకొన నగునని సంశయము కలుగవచ్చును. అసలు పైగ్రహములలో సమగ్రహమును ప్రథమమున జెప్పవలసి యుండెను. శ్లోకసౌకర్యార్థమై పైవిధమున అతీత- అనాగతములు ముందుజెప్పబడినవి. అయ్యవి సమము, అనాగతము, అతీతము, విషమము అను వరుసలో నుండవలయును. ఒకవేళ అతీతమును ముందు చెప్పినను తరువాత సమమును జెప్పి దానివెనుక అనాగత, విషమములను జెప్పిన ఒకవిధముగ నుండెడిది. ఈగ్రంథమునందు సమము, అనాగతము ,అతీతము, విషమము అను క్రమమునే పాటించుచున్నాము. పైసంశయమునకు సమాధానము ముందురాగలదు.

## 1 సమగ్రహము

"గీతాయా తాళసంయుక్తౌ సమగ్రహమితీరితః" అని పైన చెప్పబడినది. తాళమును గీతమును ఏకకాలమునందు ప్రారంభించుట సమగ్రహము. ఈసమగ్రహమునకు కాలభేదము లుండవు.

## 2 అనాగతగ్రహము

"తాళాతీతే త్వనాగతః" అని పైన చెప్పబడినది. తాళమును ప్రారంభించిన వెనుక గీతమును ప్రారంభించుట అనాగతము. అనగా తాళప్రారంభ హస్తక్రియను అనుష్ఠించినపిమ్మట రెండవ హస్తక్రియను ప్రారంభించుటకు పూర్వము ఏస్థాన

మందైనను గీతమును ప్రారంభించుట అనాగతగ్రహము. తాళమునందు ప్రథమ హస్తక్రియలో గల అక్షరకాలములలో ప్రథమాక్షరకాలము గడచిన పిమ్మట రెండవ అక్షరకాలములోగాని లేక రెండవ హస్తక్రియను ప్రారంభించుటకు పూర్వము ఏ అక్షరకాలమందైననుగాని గీతమును ప్రారంభించవలెను. ఈ గ్రహమందు త్రికాలములు గలవు. క్రమముగా తాళము ప్రథమ, ద్వితీయ, తృతీయ కాలములలో అక్షర (అరసెకండు) కాలము చతుర్భాగాక్షర (పావుసెకండు) కాలము, కళాక్షర (పరకసెకండు) కాలము గడచిన అనంతరము రెండవహస్త క్రియను ప్రారంభించుటకు పూర్వము క్రమముగా అక్షర, చతుర్భాగాక్షర, కళాక్షర కాలములలో ఏ భాగకాలమందైనను గీతమును ప్రారంభించిన అనాగత గ్రహ మనబడును.

### ఉ దా హ ర ణ ము

### ప్ర థ మ కా ల అ నా గ త గ్ర హ ము

తాళమును చిత్రతరమార్గములో అనుష్ఠించు నప్పుడు ఒక్కొక్క హస్త క్రియకు నాలుగు అక్షరముల కాలము నడచును. అయిదవ అక్షరకాలములో రెండవ హస్తక్రియ ప్రారంభ మగును. మొదటి హస్తక్రియ అనుష్ఠించిన పిదప రెండవ హస్తక్రియ ప్రారంభస్థానమగు ఆయిదవ అక్షర కాలమును అనుష్ఠించుటకు పూర్వము గల రెండు, మూడు, నాలుగు అక్షరకాలములలో ఏ అక్షర కాలమునుండి గీతమును ప్రారంభించినను అది ప్రథమకాల అనాగతగ్రహ మనబడును.

### ద్వి తీ య కా ల అ నా గ త గ్ర హ ము

తాళప్రారంభమునుండి ఒక చతుర్భాగాక్షర (పావుసెకండు) కాలము గడచిన వెనుక రెండవ హస్తక్రియ ప్రారంభమగులోగా గల ఏ చతుర్భాగాక్షర కాలమందైనను గీతమును ప్రారంభించవలెను అనగా తాళమును చిత్రతరమార్గములో ననుష్ఠించు నప్పుడు ఒక్కొక్క హస్తక్రియకు ఎనిమిది చతుర్భాగాక్షర కాలములు నడచును. తాళప్రారంభము నుండి ఒక చతుర్భాగాక్షర కాలము గడ

చిన వెనుక రెండవ హస్తక్రియను అనుష్ఠించుటకులోగా ఏడు చతుర్భాగాక్షర కాలములుండును. ఈఏడు చతుర్భాగాక్షరకాలములలో నే చతుర్భాగాక్షర కాల మందైనను గీతమును ప్రారంభించుట ద్వితీయకాల అనాగతగ్రహ మనబడును.

## తృ తీ య కా ల అ నా గ త గ్ర హ ము

తాళప్రారంభమునుండి ఒక కళాక్షర (పరక శేకండు) కాలము గడచిన అనంతరము రెండవహస్తక్రియ ప్రారంభమగులోగా గల ఏ కళాక్షరకాలమం దైనను గీతమును ప్రారంభించవలెను. అనగా చిత్రతరమార్గమునందు ఒక్కొక్క హస్తక్రియకు 16 కళాక్షరకాలములు నడచును. ఇందు ప్రథమకళాక్షరకాలము గడచిన పిమ్మట మిగత 15 కళాక్షరకాలములలో ఏ కళాక్షరకాలమందైనను గీతమును ప్రారంభించిన అది తృతీయకాల అనాగతగ్రహ మనబడును.

## 3 అ తీ త గ్ర హ ము

"గీతాతీ తేత్వతీతస్స్యాత్" అని పైశ్లోకమున చెప్పబడెను.
అతీత మనగా తాళమును ప్రారంభించుటకు ముందు గీతమును ప్రారంభించుట అని ఒక అర్థము. తాళావర్తమునందు గల హస్తక్రియలన్నిటిని అతిక్రమించి గీతమును ప్రారంభించుట యని మరొక అర్థము. ఈరెండు అర్థములును ఒక భావ మునే తెలుపుచున్నవి. అనాగత గ్రహమునకు వలెనే దీనికి గూడ త్రికాల ములు గలవు.

## ఉ దా హ ర ణ ము

## ప్ర థ మ కా ల అ తీ త గ్ర హ ము

చతురశ్రజాతి త్రిపుట (ఆది) తాళమునందు ఎనిమిది హస్తక్రియలు గలవు. ఒక పర్యాయము ఈఎనిమిది హస్తక్రియలను అనుష్ఠించిన అనంతరము తిరిగి రెండవ పర్యాయము తాళమును ప్రారంభించుటకు పూర్వము గీతమును ప్రారంభింప వలెను, గానమును ప్రారంభించుటకుముందు తాళ, మార్గములను నిర్ణయించు కొనవలెనని పైనచెప్పియుంటిమి. అప్పుడు హస్తక్రియయొక్క అక్షర

కాలసంఖ్య తెలియగలదు. చతురశ్రజాతి త్రిపుటతాళము చిత్రతరమార్గమున నడచు నప్పుడు ఒక్కొక్క హస్తక్రియ నాలుగక్షరముల కాలము వంతున నిలుప బడును. ఈతాళమున తుదియందుగల ఎనిమిదవ హస్తక్రియను అనుష్ఠించి ఒక అక్షరకాలము గడచిన అనంతరము తిరిగి తాళమును ప్రారంభించుటకు పూర్వము నందుగల రెండు, మూడు, నాలుగు అక్షరకాలములలో ఏ అక్షరకాలమునం దైనను గీతమును ప్రారంభించుట ప్రథమకాల అతీతగ్రహ మనబడును.

## ద్వితీయకాల అతీతగ్రహము

తాళాంత్యహస్తక్రియను అనుష్ఠించి చతుర్భాగాక్షరకాలము గడచిన అనంతరము తిరిగి తాళము ప్రారంభమగులోగా ఏ చతుర్భాగాక్షరకాలము నందైనను గీతమును ప్రారంభించుట. అనగా చిత్రతరమార్గమునందు ఒక్కొక్క హస్తక్రియకు ఎనిమిది చతుర్భాగాక్షరకాలములు గలవు. చతురశ్రజాతి త్రిపుట యందు తుదిహస్తక్రియ (ఉసిని) అనుష్ఠించి ఒక చతుర్భాగాక్షరకాలము గడచిన అనంతరము తిరిగి తాళము ప్రారంభమగులోగాగల ఏడు చతుర్భాగాక్షరకాల ములలో ఏ చతుర్భాగాక్షరకాలమందైనను గీతమును ప్రారంభించుట ద్వితీయకాల అతీతగ్రహ మనబడును.

## తృతీయకాల అతీతగ్రహము

తాళాంత్య హస్తక్రియను అనుష్ఠించి ఒక కళాకాలము గడచిన అనంతరము తిరిగి తాళము ప్రారంభమగులోగాగల 15 కళాక్షరకాలములలో ఏకళా క్షరకాలమందైనను గీతమును ప్రారంభించుట. అనగా చిత్రతరమార్గమున ఒక్కొక్క హస్తక్రియకు 16 కళాక్షరకాలము లుండును. చతురశ్రజాతి త్రిపుటయందు తుది హస్తక్రియననుష్ఠించి ఒక కళాక్షరకాలముగడచిన అనంతరముతిరిగి తాళము ప్రారం భమగులోగాగల 15 కళాక్షరకాలములలో ఏ కళాక్షర కాలమందైనను గీతమును ప్రారంభించుట తృతీయకాల అతీతగ్రహమనబడును.

## 4 విషమ గ్రహము.

"ఆద్యంతయో రనియమో" (మాత్రాధిక్యంచ) అని పైన చెప్పబడెను.

ఆద్యంత నియమములు లేనిది. తాళావర్తమునకు ఆదియందు అనాగత గ్రహమును, అంత్యమందు అతీతగ్రహమును గలవు. ఈ విషమగ్రహమునకు అట్టి తాళావర్తమున కాద్యంతములందు గల పైగ్రిహముల నియమములు వర్తించవు. పైగ్రహస్థానములు ఒక హస్తక్రియకు మించకూడదు. అనాగత గ్రహము తాళావర్తప్రారంభక్రియలోను, అతీతగ్రిహము తాళాంత్యక్రియలోను ఉండవలయును. ఒక క్రియయందు గల మాత్రల (అక్షరముల) కు గ్రహస్థానము మించుచో రెండవ హస్తక్రియకు జేరును. అప్పుడది విషమమగును. అందువలననే మాత్రాధిక్యంచ అని చెప్పబడినది.

తాళావర్తమునందు రెండవ హస్తక్రియ ప్రారంభమున గాని, తాళాంత్య హస్తక్రియ ప్రారంభమునగాని ఈ రెండుహస్తక్రియలకును మధ్యగల ఏ కాలములోనైనను గాని గీతమును ప్రారంభించుట విషమగ్రిహ మనబడును. విద్యార్థులు సులభముగ గ్రహించుటకుగాను ఈ గ్రిహమును విషమసమమనియును విషమ విషమమనియును రెండుగా విభజించి నిరూపించుచున్నాము.

## (1) విషమసమము

తాళావర్తమునందలి రెండవ హస్తక్రియప్రారంభమున గాని తాళాంత్య హస్తక్రియప్రారంభమున గాని, ఈ రెండు హస్తక్రియలకు మధ్యయందు గల హస్తక్రియలలో ఏ హస్తక్రియ ప్రారంభమందు గాని గీతమును ప్రారంభించుట విషమసమ మనబడును. దీనియందు సమగ్రిహమునకు వలెనే త్రికాలములుండవు.

## (2) విషమవిషమము

తాళావర్తమునందలి రెండవ హస్తక్రియకును తాళాంత్యహస్తక్రియకును మధ్యగల హస్తక్రియలలో ఏ రెండుహస్తక్రియలకు మధ్యనుండు ఏ కాలములోనైనను గీతమును ప్రారంభించుట విషమవిషమ మనబడును.

# తాళ గ్రహ విమర్శన పథకము.

చతురశ్ర జాతి త్రిపుట తాళము చిత్రతర మార్గము.

| సంఖ్య | గ్రహముల పేర్లు | ప్రథమావర్తము. లఘువు. ఘాత | చిటికెన వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ద్రుతము ఘాత | ఉసి | ద్రుతము ఘాత | ఉసి | ద్వితీయావర్తము. లఘువు. ఘాత | చిటికెన వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ద్రుతము ఘాత | ఉసి | ద్రుతము ఘాత | ఉసి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | సమ గ్రహము | , - - - | | | | | | | | , - - - | | | | | | | |
| 2 | అనాగత గ్రహము — ప్రథమ కాలము | - , , , | | | | | | | | - , , , | | | | | | | |
| | ద్వితీయ కాలము | - , , ,<br>, , , , | | | | | | | | - , , ,<br>, , , , | | | | | | | |
| | తృతీయ కాలము | - , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | | | | | | | | - , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | | | | | | | |

### విషమ విషమమున కుదాహరణము

చతురశ్రజాతిత్రిపుటతాళములో తాళప్రారంభమునుండి రెండుహస్తక్రియలను అనుష్ఠించి మూడవ హస్తక్రియ ప్రారంభమగులోగా గీతమును ప్రారంభించుట, మూడవహస్తక్రియను అనుష్ఠించిన అనంతరము నాలుగవ హస్తక్రియ ప్రారంభమగులోగా గీతమును ప్రారంభిచుట, ఇట్లే తాళాంత్యహస్తక్రియవరకు ప్రతిరెండు హస్తక్రియలమధ్య నందు ఏ కాలములో నైనను గీతమును ప్రారంభించుట విషమ విషమగ్రహ మనబడును. అతీతఅనాగతగ్రహములలోవలెనే దీనియందుగూడ త్రికాలములను వినియోగించుకొనవలెను. పై గ్రహములను చతురశ్రజాతిత్రిపుట తాళమునందు చిత్రతరమార్గమున త్రికాలములలో ఈ పై పథకమునందు వివరించియున్నాము.

పైపథకమునందు రెండు ఆవర్తములలో గ్రహస్థానములను నిరూపించియున్నాము. దృతమునందుగల రెండవ హస్తక్రియకు ఉసి అని పేరు. పూర్వము దీనిని విసర్జితక్రియ యనెడివారు. సమము, విషమసమము అనురెండుగ్రహములలో హస్తక్రియను ప్రారంభిచునపుడే గీతము ప్రారంభించబడుచున్నందున వీనికి కాల భేదములు లేకున్నవి. త్రికాలములందును వీనికి గ్రహస్థానములు ఒకవిధముగనే ఉండును. తక్కినగ్రహములలో మూడుకాలములలోగూడ భిన్నభిన్నస్థానములందు గ్రహములను నిర్ణయించుకొనుటకు వీలుండును. ఒక పర్యాయము నిర్ణయించుకొనిన గ్రహకాలము త్రికాలముల ననుష్ఠించునపుడుకూడ చ్యుతముకాగూడదనిన యంశము మరువకూడనిది. ప్రతిగ్రహములోనను (,) ఈ 'కామా' గురుతు ఉన్నచోట గీతప్రారంభస్థాన మని తెలియవలెను. ఒక క్రియలో ఎక్కువ కామాగురుతులున్నచోట ఏకామాగురుతుగల స్థానమునందైనను గ్రహమును నిర్ణయించుకొనవచ్చునని తాత్పర్యము. గ్రహస్థానము కాని అక్షరకాలములందు (–) ఈగురుతు నుంచితిమి. ప్రథమకాలమందలి గురుతులు అక్షరకాలములనియును, రెండవకాలమందలివి చతుర్భాగాక్షరకాలములనియును, మూడవకాలమందలివి కళాక్షరకాలములనియును తెలియవలెను. గ్రహమును కొందరు జాగా అనివ్యవహరించుచున్నారు.

ఒక పర్యాయము తాళమును, మార్గమును, కాలమును, గ్రహస్థానమును నిర్ణయించుకొని గానము చేయునప్పుడు అట్టిగానము సమాప్తియగునంతవరకు వానియందు మార్పుకలుగకూడదను యంశమును తిరిగి జ్ఞాపకము చేయుచున్నాము. గాత్రముతో మూడుకాలములలో గానము చేయునపుడుకూడ చేతులతో వేయు తాళమునుమాత్రము ప్రారంభించినమార్గములోననే నిలుపవలయును. ఒకప్పుడు గాత్రపాటతో మార్గకాలమును పోషించుచూ చేతులతో తాళమును త్రికాలములలో అనుష్ఠించినను తిరిగి తాళము యథాప్రకారముగ మార్గకాలమును అందుకొనునంతవరకును పాటను ప్రారంభించినమార్గకాలములోననే నిలుపవలెను. పాట మధ్యమందు మార్గము మారకూడదు. మార్గము మారునప్పుడు అనుష్ఠించుచున్న గ్రహస్థానముకూడ మారకూడదు. త్రికాలములలో గానముచేయునప్పుడు నేడు అనేకులు యీనియమమును తారుమారుజేయుచున్నారు. త్రికాలములలో కూడ ఒకటేసంఖ్యగల అక్షరకాలమును త్రోసివేసి గీతమును ప్రారంభించుచున్నారు. కాని ఒకటేకాలప్రమాణములో జాగాను (గ్రహస్థానమును) నిలుపుట లేదు. ప్రథమకాలమందు అరశెకండు కాలమువంతున ప్రమాణముగల మూడు అక్షరముల (1½ శెకండ్లు) కాలము తాళము నడచినవెనుక గీతమును ప్రారంభించి అప్పుడే రెండవకాలమందు పావుశెకండుకాలమువంతున ప్రమాణముగల మూడు చతుర్భాగాక్షరముల (¾ శెకండ్లు)కాలము తాళము నడచినవెనుక గీతమును ప్రారంభించుచున్నారు. ఇట్లే మూడవకాలమందు పరకశెకండుకాలప్రమాణముగల మూడు కళాక్షరముల (⅜ శెకండు) కాలము తాళము నడచినవెనుక గీతమును ప్రారంభించుచున్నారు. త్రికాలములందును గ్రహాక్షరకాలములు మూడుగానున్నను ప్రథమకాలమందు ఒకటిన్నర శెకండును, రెండవకాలమందు ముప్పాతిక శెకండును, మూడవకాలమందు ముప్పరక శెకండును గ్రహకాలము లైనవి. ఈ విధముగ ఎప్పుడును గ్రహకాలము మారకూడదు. ఈ పద్ధతిలో కాలభేదమందు గ్రహస్థాన అక్షరకాలముల యొక్క ప్రమాణములు మారుచున్నవి. అక్షరకాలముల సంఖ్య మారినను కాల ప్రమాణముమాత్రము మారకూడదు. ప్రథమకాలమందు అరశెకండుకాలము వంతున ప్రమాణముగల మూడు అక్షరకాలములు (1½ శెకండ్లకాలము) గ్రహమైనప్పుడు, రెండవకాలమున పావుశెకండువంతున కాలప్రమాణముగల ఆరు అక్షరకాల

# శాస్త్ర పద్ధతి

## చతురశ్రజాతి - త్రిపుటతాళము - చిత్రతరమార్గము - అనాగతగ్రహము

| సంఖ్య | కాలములు | లఘువు. ఘాతి | చిటికెన వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | దృతము ఘాతి | విసి | దృతము ఘాతి | విసి |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | ప్రథమ కాలము | తకిట , | , , , , | , , , , | , , , , | , , , , | , , , , | , , , , | , , , , |
| 2 | ద్వితీయ కాలము | తకిట తకిట<br>,, | , , , , , , , , | , , , , , , , , | , , , , , , , , | , , , , , , , , | , , , , , , , , | , , , , , , , , | , , , , , , , , |
| 3 | తృతీయ కాలము | తకిట త<br>కిట తకిట తకిట<br>, , , , | , , , , , , , ,<br>, , , , , , , , | , , , , , , , ,<br>, , , , , , , , | , , , , , , , ,<br>, , , , , , , , | , , , , , , , ,<br>, , , , , , , , | , , , , , , , ,<br>, , , , , , , , | , , , , , , , ,<br>, , , , , , , , | , , , , , , , ,<br>, , , , , , , , |

# నేటి పద్ధతి

## చతురశ్రజాతి - త్రిపుటతాళము - చిత్రతరమార్గము - అనాగతగ్రహము

| కాలములు | లఘువు ఘాతి | చిటికెన వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ద్రుతము ఘాతి | విసి | ద్రుతము ఘాతి | విసి |
|---|---|---|---|---|---|---|---|---|
| ప్రథమ కాలము | తి కి ట , | , , , , | , , , , | , , , , | , , , , | , , , , | , , , , | , , , , |
| ద్వితీయ కాలము | త కి ట ,<br>, , , , | , , , ,<br>, , , , | , , , ,<br>, , , , | , , , ,<br>, , , , | , , , ,<br>, , , , | , , , ,<br>, , , , | , , , ,<br>, , , , | , , , ,<br>, , , , |
| తృతీయ కాలము | త కి ట ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | , , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | , , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | , , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | , , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | , , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | , , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , | , , , ,<br>, , , ,<br>, , , ,<br>, , , , |

ములు ($1\frac{1}{2}$ శెకండ్లు) గ్రహమగును. అట్లే మూడవకాలమునందు పరక శెకండు కాలమువంతున ప్రమాణముగల పదిరెండక్షరకాలములు ($1\frac{1}{2}$ శెకండ్లు) గ్రహమగును. ఇది శాస్త్రపద్ధతి. ఈ మూడుకాలములందును గ్రహాక్షరముల సంఖ్య మాత్రము ఒకదానియందుకంటె మరొకదానియందు ద్విగుణద్విగుణన్యాయమున వృద్ధియగును. కాని కాలప్రమాణముమాత్రము మారుటలేదు. శాస్త్రపద్ధతియు, నేటిపద్ధతియు ఈ యెదుటి పథకములో నిరూపింపబడియున్నవి.

పై మొదటిపథకములో హస్తక్రియ ఒకటికి నాలుగు అక్షరకాలముల వంతున తాళమునడచును. తాళప్రారంభహస్తక్రియయందు ప్రథమకాలములో 'తకిట' అనుమూడుఅక్షరములకాలము గడచినపిమ్మట గీతప్రారంభస్థానము. ( , ) ఈ కామాగుర్తులు గీతము నడచుకాలము రెండుమూడుకాలములలో గ్రహా (జాగా)క్షరములకు క్రింద క్రమముగ ఒకటి రెండు అడ్డగీట్లుకలవు. ఆ యాకాలములందు అక్షరములను ఒకకాలమునందు కంటె మరొకకాలమునందు రెట్టింపు రెట్టింపుతొందరగా నుచ్చరించవలెనని ఆగీట్లయొక్క తాత్పర్యము.

రెండవ పథకమున ప్రథమకాలమందు మూడు అక్షరకాలములను, రెండవ కాలమందు మూడుచతుర్భాగాక్షరకాలములను, మూడవకాలమందు మూడుకళాక్షరకాలములను గ్రహముగా జూపితిమి. నేడు ఈపద్ధతిని అనేకులు ఆచరించుచున్నారు. ఈపద్ధతియందు అక్షరములసంఖ్యలు సమానములయినను కాలప్రమాణములు భిన్నములగుచున్నవి.

ఇదేవిధముగ అతీత, విషమవిషమగ్రహములందుకూడ శాస్త్రపద్ధతిని, నేటిపద్ధతిని తెలియవలెను. ఇదేవిధముగ అన్నితాళములందును అన్నిమార్గములందును గ్రహస్థానములను తెలియవలెను.



# 7. లయఃప్రాణ లక్షణము

రెండు హస్తక్రియలమధ్య నడచునట్టికాలమునకు లయకాలమని పేరు. ఒక ప్పుడు అక్షరములుకూడ క్రియలుగనే భావింపబడుచున్నవి. తాళమువేయునప్పుడు అక్షరోచ్చారణకును, హస్తక్రియలకును సంబంధము ఏర్పడుచున్నది. హస్తక్రియల ననుష్ఠించకపోయినను అక్షరముల నుచ్చరించినమాత్రమున లయకాల మున్నటు లనే గ్రహింపవలయును. అక్షరమక్షరమునకు మధ్యకూడ లయకాలము కలదు.

శ్లో॥ తాళాంతరవర్తియః కాలస్స్యా త్సలయ స్త్రిధా
ఏలామలబిల్వాభో ద్రుతమధ్యవిళంబకః
ద్రుతో మధ్యార్ధకాల స్స్యాన్మధ్యకాలస్స్వభావతః
విళంబో దీర్ఘకాల స్స్య త్త్రికాలస్థితినిశ్చయః॥

తా:— తాళాంతరవర్తియకాలము లయ యనబడును. ఇది ద్రుత, మధ్య విళంబములని మూడువిధములు. వాని స్వరూపములు క్రమముగ ఏలక్కాయ, ఉసిరికకాయ, మారేడుకాయలవంటివి. ద్రుతలయకాలము మధ్యలయకాలములో సగము. విళంబలయకాలము మధ్యలయకాలమునకు రెట్టింపు.

వి:— ఉదాహరణకొరకు నిమిత్తమాత్రముగ ఏలాదిఫలములను త్రివిధ లయలకు పోల్చి చెప్పిరేకాని అంతమాత్రమున అవి ద్విగుణద్విగుణపరిమాణము లలో నున్నవనియును, లయలయొక్క తారతమ్యము ఆమాదిరిగనే ఉండుననియును ఎంచకూడదు. "మధ్యకాలస్స్వభావతః" అని ఇందు మధ్యలయప్రధానముగా గ్రహింప బడినది. అనగా తాళప్రారంభమున అనుష్ఠించిన మార్గకాలము మధ్యలయగా చెప్పబడినది. "ద్రుతోమధ్యార్ధకాలస్య" అనగా అట్టి మధ్యలయకాలములో సగముకాలమునకు ద్రుతలయ అనిపేరు. మధ్యలయ ఏమార్గములో నుండునో అట్టి మార్గాక్షరకాలములో సగము మార్గాక్షరకాలముగల మార్గములో తాళము ననుష్ఠించుట ద్రుతలయ యగును. "విళంబోదీర్ఘకాలస్స్యాత్" అనగా మధ్యలయ కంటె రెట్టింపుకాలమునకు విళంబలయఅనిపేరు.

### శ్లో కాంతరము

శ్లో॥ క్రియానంతరవిశ్రాంతి ర్లయస్స్యాత్త్రివిధో మతః
దృతో మధ్యవిళంబశ్చ ద్రుత శ్శీఘ్రతమో మతః
ద్విగుణద్విగుణజ్ఞేయా తస్మా న్మధ్యవిలంబితౌ॥

తా:- క్రియానంతరవిశ్రాంతికి లయ అనిపేరు. ఈలయ ద్రుత, మధ్య, విళంబము లని మూడు విధములు. అందు ద్రుతము శీఘ్రితమమైనది. దానికంటె రెట్టింపు చౌకమైనది మధ్యలయ, మధ్యలయకంటె ద్విగుణము చౌకమయినది విళంబలయ.

వి:— క్రియానంతరము అనగా హస్తక్రియానంతరము. కాలప్రాణలక్షణమందు త్రికాలములను చెప్పునప్పుడు తాళమును ప్రారంభించినమార్గము చ్యుతము కాకుండునటుల హస్తక్రియలతో ననుష్ఠించుచు గీతమును త్రికాలముల లోను అనుష్ఠించుటను చెప్పియుంటిమి.

ఇచ్చట ప్రారంభించినమార్గకాలమునకు భంగము కలుగకుండునటుల గీతమును అనుష్ఠించుచు హస్తములతో తాళమునుమాత్రము (త్రికాలములలో) త్రిలయలలోను అనుష్ఠించుక్రమమును చెప్పుచున్నాము.

పై శ్లోకమున ముందు ద్రుతలయ చెప్పబడినది. కాబట్టి ప్రథమమున ఏ మార్గమందు తాళగీతములు ప్రారంభించబడునో అట్టిమార్గమునందు తాళమును అనుష్ఠించుట దృతలయగా నిర్ణయించుకొని అంతకు రెట్టింపుఅక్షరకాలములు గల మార్గములో తాళమునను ష్ఠించిన అది మధ్యలయ. మధ్యలయకు రెట్టింపుఅక్షర కాలముగల మార్గమునందు తాళమును అనుష్ఠించిన అది విళంబలయ.

ఈ పద్ధతియందు ద్రుతలయలోని ఒకఆవర్తపుగీతము మధ్యలయలోని అరావర్తమునకును, విళంబలయలోని పాతికఆవర్తమునకును సరిపోవును.

చిత్రతరమార్గములో గానముచేయుచు, తాళమునుమాత్రము చిత్రమార్గములోను, వార్తికమార్గములోను క్రమముగా ననుష్ఠించిన గానముచేయుచుండిన చిత్రతరమార్గము ద్రుతలయ యనియును, చిత్రవార్తికమార్గములు క్రమముగ మధ్య, విళంబలయలనియును తెలియవలెను. ఇదియొకపద్ధతి. ఇవిగాక యింకా రెండుపద్ధతులు గలవు.

రెండవపద్ధతి:—

గీతము నడచుమార్గాక్షరకాలమునకు సగముమార్గాక్షరకాలములోను, నాల్గవవంతు మార్గాక్షరకాలములోను క్రిమముగ తాళమును అనుష్ఠించుచో గీతమునడచుమార్గాక్షరకాలము విళంబలయ తరువాత చెప్పబడిన రెండుకాలములు క్రిమముగా మధ్య ద్రుతలయ లగును.

ఉదాహరణము:—

చిత్రతరమార్గమునందు గీతమునడుచుచుండి, చిత్రతమ, అతిచిత్రతమ మార్గములలో క్రమముగ తాళము ననుష్ఠించిన గీతము నడచుకాలము విళంబలయ లోను, చిత్రతమమార్గము మధ్యలయలోను అతిచిత్రతమమార్గము ద్రుతలయ లోను ఉన్నట్లెంచనగును.

మూడవ పద్ధతి:-

తాళగీతములను ప్రారంభించినమార్గమును మధ్యలయగా నిర్ణయించుకొని దీనికి రెట్టింపుఅక్షరకాలమార్గములో తాళము నడచిన విళంబలయయు, సగము అక్షరకాలమార్గములో తాళమునడచిన ద్రుతలయయు అగుచున్నవి.

ఉదాహరణము:—

తాళగీతములు చిత్రతరమార్గమున నడచునప్పుడు తాళము చిత్రమార్గమున నడచుట విళంబలయయు, చిత్రతమమార్గమున నడచుట ద్రుతలయయు ప్రారంభమార్గమైన చిత్రతరమార్గము మధ్యలయయు అగుచున్నవి.

పై మూడుపద్ధతులలో గానముచేయునప్పుడు తాళము మూడులయలలో క్రమముగా నడిచి యథాస్థానమునకు చేరవలయును. తాళము గీతమార్గమునకు చేరునంతవరకును గీతకాలము మారకూడదు.

రెండవపద్ధతి యందు విళంబలయయందలి ఒక ఆవర్తపుగీతము మధ్యలయ యందు రెండుఆవర్తములును, ద్రుతలయయందు నాలుగుఆవర్తములును అగుచున్నవి. మూడవపద్ధతిలో గీతమార్గము(మధ్యలయ)నందు ఒకఆవర్తపుగీతము విళంబలయయందు అరావర్తమును, ద్రుతలయయందు రెండుఆవర్తములును అగుచున్నవి. ఈమూడుపద్ధతులను ప్రక్కపథకములో వివరించుచున్నాము.

# లయ నిరూపణ పథకము

| సంఖ్య | విధములు | తాళ - గీత మార్గము | లయ మార్గములు | అయ నామములు |
|---|---|---|---|---|
| 1 | మొదటి విధము | చిత్రతర మార్గము | చిత్ర తర మార్గము | ద్రుతలయ |
| | | | చిత్ర మార్గము | మధ్యలయ |
| | | | వార్తిక మార్గము | విళంబలయ |
| 2 | రెండవ విధము | చిత్రతర మార్గము | చిత్ర తర మార్గము | విళంబలయ |
| | | | చిత్ర తమ మార్గము | మధ్యలయ |
| | | | అతి చిత్ర తమ మార్గము | ద్రుతలయ |
| 3 | మూడవ విధము | చిత్రతర మార్గము | చిత్ర తర మార్గము | మధ్యలయ |
| | | | చిత్ర మార్గము | విళంబలయ |
| | | | చిత్ర తమ మార్గము | ద్రుతలయ |

పైపథకములో మూడవవిధమునందు మధ్యలయనుండి విళంబలయకు తాళము మారినప్పుడు తిరిగి మధ్యలయకు వచ్చినఅనంతరమందే తాళము ద్రుతలయకు రావలయును. ఇటులనే మధ్యలయనుండి ద్రుతలయకు మారినప్పుడు తిరిగి మధ్యలయకు వచ్చినఅనంతరమందే విళంబలయకు రావలయును.

గీతమును ఒకమార్గమునందు నిర్ణయించి తాళమును మూడులయలందు అనుష్ఠించినవిధముననే తాళమునుకూడ ఒకమార్గమందు నిర్ణయించుకొని గీతమునుగూడ పైమూడుపద్ధతులలోను అనుష్ఠించుట కలదు. తాళమును ఒక మార్గమునందు స్థిరముచేసినచో రెండుహస్తక్రియలకు మధ్యనుండుకాలవ్యవధి సదా ఒకవిధముగనే ఉండును. రెండుహస్తక్రియల మధ్యనుండుకాలమునకే లయ అనిపేరు. "క్రియానంతరవిశ్రాంతిర్లయ" అని పైప్రమాణముగూడ గలదు. అక్షరములందుగూడ లయయున్నను హస్తక్రియల ననుసరించి ఏర్పడిన మార్గాక్షరములందే లయ సిద్ధించును. తాళమార్గము మారనిచో లయ మారదు. అప్పుడు పై త్రివిధలయలు ఉండవు.

తాళమును స్థిరముచేసినప్పుడు గీతకాలము మారినచో అది పూర్వోక్త త్రికాలనియమములననుసరించి ఉండవలయును. ఆనియమములకు తప్పి, పైకాల నియమములలో నుండకూడదు.

———

# 8. కళా ప్రాణ లక్షణము



కళ అనుసంజ్ఞకు ప్రకరణమునుబట్టి అనేకఅర్థములు గలవు. సంగీతము నందు, నిశ్శబ్దము, గురువు, పరక శ్రేకంఠుకాలము, సంగతి, మొదలగునవి కళలన బడుచున్నవి. తాళమందు కాలవిషయములో రెండుకళాకాలములయిన ఒక చతుర్భాగకాలము. రెండు చతుర్భాగములయిన ఒకఅక్షరకాలము లేక అను ద్రుతకాలము. ఈవిషయమును లోగా చెప్పియుంటిమి. ఇదిగాక ఒక్కొక్క తాళము ఒక్కొకకళతో నిండియుండును. దూరమునుండిచూచి నడకనుబట్టి పరి చయముగలవారిని గుర్తించగలుగుదుము. నడకలోగూడ శృంగారాదిరసములు వ్యక్తమగును. ఈనడకభేదములు అనంతములు. పశుపక్ష్యాదినడకలలోగూడ ఇట్టి భేదములు గలవు. అట్లే తాళనడకలు కూడ అనంతములు కాబట్టి గీతమునను సరించి తాళమునిర్ణయమగును. ఒకతాళములో కళాక్షరకాలముల క్రమమునుబట్టి ఏర్పడినసంగతులు గూడ కళలనబడుచున్నవి. ఇతర ప్రయోజనములను ఆయా సందర్భములందు వివరింతుము.



# 9. యతి ప్రాణ లక్షణము



శ్లో॥ లయ ప్రవృత్తి నియమో యతి రిత్యభిధీయతే
సమ స్రోతోవహాఖ్యాతా గోపుచ్ఛక పిపీలికే
మృదంగాఖ్యాచ విషమో షడ్విధాయతి రుచ్యతే॥

తా॥ లయయొక్క ప్రవృత్తి నియమమునకు యతి అని పేరు. సమయతి, స్రోతోవహయతి, గోపుచ్ఛయతి, పిపీలికయతి, మృదంగయతి, విషయమతి, అని యతులు ఆరు విధములు.

వి:—లయ ప్రవృత్తి నియమము అనగా లయయొక్క నడకలోని నియమము. 'క్రియానంతర విశ్రాంతిర్లయః' అని లయప్రాణలక్షణమునందు చెప్పబడి యుండుటచే తాళమునందలి రెండు హస్తక్రియల నడుమనుండు విశ్రాంతికాల క్రమమునందు పై ఆరు యతులను వినియోగించుకొనుట యని తెలియదగును. అయితే తాళాంగముల క్రమమునందుగూడ యతులను నిర్ణయించు పద్ధతి శాస్త్రమందుగలదు. ఈ పద్ధతియందు ఒక తాళమున కొకయతియే యుండును. ఒక తాళములో పై ఆరుయతులకు వినియోగము ఉండదు. ముందు ఈ పద్ధతియే చెప్పబడుచున్నది. తరువాత క్రియానంతర విశ్రాంతి కాలమందు యతులను వినియోగించు విధానము చెప్పబడును.

మొదటి విధము

## 1. సమయతి :—

శ్లో॥ ద్రుతాదయోసమాయత్ర సమాఖ్యా యతి రిష్యతే॥

తా॥ ద్రుతము మొదలగు అంగములలో నొకే విధమగు అంగములు తాళమునందుండిన సమయతి యనబడును.

వి:- పూర్వము ద్రుతము మొదలు గొప్ప అంగములు మాత్రమే వ్యవహారములో నుండెను. ద్రుతమునకంటె తక్కువ అంగమగు అనుద్రుతము

వ్యవహారములో నుండనందున పై శ్లోకము దుృతాదిగా చెప్పబడినది. తరువాత తాళాంగములలో అనుదృతముకూడా చేరినది.

సమయతికి ఉదాహరణములు

1. ᴗ ᴗ ᴗ ᴗ 2. o o o o 3. | | | | 4. ઽ ઽ ઽ ઽ 5. ઽ̇ ઽ̇ ઽ̇ ઽ̇

తాళమునందలి అంగములన్నియు ఒకవిధముగనేయుండిన సమయతి అని భరతముని మతము. మాదిరికొరకు పై తాళముల నుదహరించితిమి. ఈ విధముగ అంగములను యింకా పెంచవచ్చును. సప్త తాళములలోగల ఏకతాళము మరొక విధమగు అంగములేనందున సమయతి తాళమగుచున్నది.

## 2. స్రోతోవహయతి :—

శ్లో॥ ద్రుతాదీనాం విపర్యాసాద్యది స్రోతోవహా తథా

తా॥ ద్రుతము మొదలగు వానినుండి కొద్ది అంగముతో ప్రారంభమై క్రమముగ తుదకు గొప్ప అంగముగలది స్రోతోవహాయతి అనబడును.

వి:—స్రోతోవహము అనగా నది. నది ప్రారంభమున చిన్నదిగానుండి పోనుపోను పెద్దదిగానుండును. ఆ విధముగ అంగములుగలది గాన స్రోతోవహాయతి అనబడినది. సమయతి యందువలెనే తక్కిన యతులలోగూడ అనుదృతమును చెప్పుచున్నాము.

స్రోతోవహాయతికి ఉదాహరణములు

1. ᴗ o | ઽ ઽ̇ + 2. o | ઽ ઽ̇ + 3. | ઽ ઽ̇ + 4. ઽ ઽ̇ +
5. o | ఇది సప్తతాళములలోని రూపకతాళము.

## 3. గోపుచ్ఛయతి :—

శ్లో॥ ఆదౌ గురుప్లుతాయత్ర లఘు దృతలయాంతికే
గోపుచ్ఛయతి రాఖ్యాతం తాళజ్ఞాన వినోదిభిః॥

తా॥ గురుప్లుతాది గొప్పఅంగములతో ప్రారంభమై క్రమముగ తుదను కొద్ది అంగముగలది గోపుచ్ఛయతి అనబడును.

వి:—గోపుచ్ఛమన ఆవుతోక. ఆవుతోకవలె ప్రథమములో గొప్ప అంగ ముండి తరువాత అంగములు క్రమముగ తగ్గియుండును.

గోపుచ్ఛయతికి ఉదాహరణములు

1. ఠ ౭ । ౦ ౮ 2. ౭ । ౦ ౮ 3. । ౦ ౮ ఇది సప్తతాళములలోని ఝుంపతాళభేదము. 4. । ౦ ౦ ఇది సప్తతాళములలోని త్రిపుటతాళము. 5. । । ౦ ౦ ఇది సప్తతాళములలోని అటతాళము.

పై తాళాంగవరుసలో ఒకమాదిరి అంగములు ఒకచోటనే ఒకటికిమించి యుండవచ్చును. కాని అట్టి అంగములకు మీదవచ్చు అంగము అంతకు తక్కువదిగా నుండవలయును.

## 4. పిపీలికయతి:—

శ్లో॥ లఘు ద్రుతాశ్చ మధ్యేస్యు రాదావంతే గురుప్లుతౌ
పిపీలికా యతి రాఖ్యాతా తాళజ్ఞాన వినోదిభిః॥

తా॥ లఘు దృతములు మధ్యమండి ఆద్యంతములందు గురుప్లుతములు గలది పిపీలిక యతి తాళమని తాళజ్ఞానవిదులనిరి.

వి:—పిపీలిక మనగా చీమ. చీమ దేహము రెండువైపులను లావుగనుండి నడుమ సన్నముగానుండును. ఆ విధముగనే రెండువైపులను గొప్ప అంగమును, లేక అంగములనుగలిగి మధ్య కొద్ది అంగమునులేక అంగములను కలిగియుండునది పిపీలిక యతి తాళమని భావము.

పిపీలిక యతికి ఉదాహరణములు

1. ౦ ౮ ౦ 2. । ౦ । ఇది సప్త తాళములలోని మఠ్య తాళము. 3. ౭ ౭ । । ౭ ౭ 4. ౭ । ౭ 5. । ౦ । । ఇది సప్త తాళములలోని ధ్రువ తాళము. 6. ఠ ౭ । ౦ ౮ ౦ । ౭ ఠ 7. ఠ ౭ ఠ

## 5. మృదంగయతి:—

శ్లో॥ గురుప్లుతాశ్చ మధ్యేస్యురాదావంతే లఘు ద్రుతౌ
మృదంగయతిమిచ్ఛంతి లయజ్ఞాన వినోదినః॥

తా॥ ఆద్యంతములందు లఘు ద్రుతములను కొద్ది అంగములుండి మధ్య యందు గురుప్లుతములను గొప్ప అంగములుకలది మృదంగయతి.

వి:—మృదంగము మధ్యలావుగనుండి రెండువైపులను తగ్గియుండును. అందు వలన ఈ యతికీపేరు వచ్చినది. అను ద్రుతమును చేర్చుకొనుట మరువకూడదు.

మృదంగయతికి ఉదాహరణములు

1. ◡ O I S ﾜ S I O ◡ 2. ◡ O I S I O ◡ 3. O I ﾜ I O
4. ◡ O I O ◡ 5. ◡ O ◡

## 6. విషమయతి:—

"శ్లో॥ ఆదౌ గురుప్లుతాయత్ర లఘు ద్రుతలయాంతికే
విషమా యతిరిత్యేత ద్వ్యఖ్యతే విబుధైరపి"

తా॥ ఆదియందు గురుప్లుతములును అంతమందు లఘుద్రుతములును గలది విషమయతి యని శాస్త్రజ్ఞులు చెప్పిరి.

వి:—పైన వివరించిన అయిదు యతులలోను చేరక, అంగములు ఒక వరుసలోనుండక ఎగుడు దిగుడుగానుండునది విషయమతి అనబడును.

విషమయతికి ఉదాహరణములు

1. S ﾜ I O 2. ◡ ﾜ O I S 3. O S I ◡ ﾜ 4. ◡ I O ◡
5. I O S ◡ I O

ఇంతటితో ఈ విధము పూర్తియైనది. ఇకను రెండవవిధము చెప్పబడు చున్నది.

రెండవ విధము

తాళమందు మార్గాక్షరకాలముల నడకయొక్క భేదములవలన పై ఆరు యతులు కలుగును. ఒక్కొక్క హస్తక్రియయందుగల మార్గాక్షరములను లేక మార్గాక్షరకాలములను దీర్ఘముగను, హ్రస్వముగను, చతుర్భాగకాలముగను, కళాకాలముగను వినియోగించుకొనునప్పుడు యీ భేదములు కలుగును.

## 1. సమయతి:—

శ్లో॥ ఆది మధ్యావసానేషు సమోయది లయ స్తథా

తా॥ ఆది మధ్యాంతములందు లయ సమముగనుండుట సమయతి యనబడును.

వి:—తాళావర్తమునందు హస్తక్రియల మధ్యనుండు కాలమును సమాన కాలాక్షరములుగా అనుష్ఠించుట. అనగా అన్నిటిని హ్రస్వాక్షరములుగగాని, దీర్ఘాక్షరములుగగాని, చతురశ్రాగాక్షరములుగగాని, కళాక్షరములుగగాని అనుష్ఠించుట. కాలస్వరూపములను గుర్తించుటకుగాను సమాదియతులను వాద్యాక్షరములతో నిరూపించుచున్నాము. అట్టి కాలముల స్థానములో గీతమునడచునప్పుడు సాహిత్యము, రాగము ననుష్ఠించునప్పుడు అకార, ఇకార, ఉకారాదులతో కూడిన నాదము యతులరూపమున ప్రవర్తించును.

### సమయతికి ఉదాహరణములు

1. తా తా తా తా దీర్ఘాక్షరములు
2. తక తక తక తక హ్రస్వాక్షరములు
3. <u>తక తక తక తక</u> చతురశ్రాగాక్షరములు
4. <u>తక తక తక తక</u> కళాక్షరములు

## 2. స్రోతోవహయతి:—

శ్లో॥ స్రోతోగతా ద్రుతారంభా తత్సమాప్తా చ మధ్యమా
అథవా మధ్యమారంభా విలంబిత సమాపితా॥

తా॥ ద్రుతలయతో అరంభమై మధ్యలయతో సమాప్తమగునది స్రోతోవహయతి. ఒకవేళ మధ్యలయతో ప్రారంభమైనచో విలంబలయతో సమాప్తమగును.

వి:—లయకాలములో ప్రారంభమున ద్రుతలయగను అనంతరము మధ్యలయగను నడుపవలయును. ప్రారంభమున మధ్యలయయగుచో తరువాత విళంబ

లయ యుండవలయును. ప్రతి హస్తక్రియయందును యతి పూర్తి కావలయును. దృత, మధ్య, విళంబకాలముల ప్రస్తారమువలన ఈ యతులు ఏర్పడుచున్నవి.

స్రోతోవహాయతికి ఉదాహరణములు

1. కిట తక ఝుం
2. తరికిట తక ఝుం క్రింద గీటుగలవి చతుర్భాగ కాలాక్షరములు.
3. తరికిట తక తకతక ఝుం క్రింద రెండుగీట్లు కలవి కళాకాలాక్షరములు. ఒకగీటుకలవి చతుర్భాగకాలాక్షరములు.

## 3. గోపుచ్ఛయతి:—

శ్లో॥ మధ్యారంభా దృతాంతాచ గోపుచ్ఛాతు యతిర్మతా

తా॥ మధ్యలయతో ప్రారభింపబడి అంత్యమందు ద్రుతముగలది గోపుచ్ఛయతి.

వి:—స్రోతోవహాయతిని అపసవ్యముగననుష్ఠించిన గోపుచ్ఛయతి అగును. అనగా విళంబ, మధ్య, ద్రుతలయలను క్రమముగా ననుష్ఠించవలెను.

1. ఝుం కిటతక
2. ఝుం తక తరికిట
3. ఝుం తకతక తక తరికిట

అక్షరముల క్రిందిగీటులను వెనుకటివలెనే గ్రహించవలెను.

## 4. పిపీలికయతి:—

శ్లో॥ అస్యాస్తువైపరీత్యేన పిపీలికయతిర్మతా

తా॥ అస్య అనగా * మృదంగయతి. మృదంగయతికి వైపరీత్యముగనుండునది పిపీలికయతి.

వి:—మృదంగయతినిగురించి వెనుక చెప్పబడినది. ఈపద్ధతియందు ముందు

(*) ఈశ్లోకపాదము మృదంగయతినిగురించి చెప్పినట్టి శ్లోకముయొక్క తుదిపాదమగుటచే అస్యాస్తు అని చెప్పబడినది. అందువలన అస్య అనగా మృదంగయతి అని భావము.

చెప్పబడును. చతుర్భాగ, కళా, చతుర్భాగకాలములలో అక్షరములననుష్ఠించుట పిపీలికయతి. తక్కినఅక్షరములుకూడ ఇట్లేచూచుకొనవలెను.

ఉ దా హ ర ణ ము లు

1. తాం కిటతక తాం
2. ఝుం తరికిట తాం
3. తాఝుం తరికిట తాఝుం

## 5. మృదంగయతి:—

శ్లో॥ ద్రుతాద్యంతా మధ్యమధ్యా మృదంగాఖ్యాసమీరితా
అథవాఽఽద్యంతయోర్మధ్యగతి ర్మధ్యే విలంబితా॥

తా॥ ఆద్యంతములందు ద్రుతలయ, మధ్యయందు మధ్యలయగలది, లేక ఆద్యంతములందు మధ్యలయ, మధ్యయందు విలంబితలయగలది మృదంగయతి అనబడును.

వి:—ఆద్యంతములందు హ్రస్వాక్షరములను మధ్యయందు దీర్ఘకాలాక్షరములను అనుష్ఠించవలెను. ఇట్లే తక్కినకాలములందు వినియోగించుకొనవలెను.

ఉ దా హ ర ణ ము లు

1. తరికిట ఝుం తరికిట
2. తరికిట తకతక తరికిట
3. తరికిట తకతక తరికిట

## 6. విషమయతి:—

పైఅయిదు యతుల నియమములలోనికి జేరక వ్యత్యస్తముగా అక్షరకాలములు గలది విషమయతి అనబడును.

ఉ దా హ ర ణ ము లు

1. ఝుం త తక కిట
2. త కిట త కిట
3. కిట తక త కిట

ఈ పద్ధతియందు యతులనుగురించి వివరించునప్పుడు ఉదహరించబడిన శ్లోకములను అందరును మొదటిపద్ధతియందే సమన్వయము జేయుచున్నను మేము ఆ శ్లోకములను ప్రత్యేకించి ఇందుదహరించి ఈవిధముగ సమన్వయము జేసితిమి.

# యతి విమర్శన పథకము

## ఏకతాళము - చతురశ్రజాతి - చిత్రతరమార్గము - సమగ్రహము

| సంఖ్య | | యతులు | చతురశ్రజాతి లఘువు: ఘాత | చిటికెనవ్రేలు | అనామికవ్రేలు | మధ్యమవ్రేలు |
|---|---|---|---|---|---|---|
| 1 | 1 | సమ యతులు | తాఝం | తాఝం | తాఝం | తాఝం |
| | 2 | ,, | తక తక | తక తక | తక తక | తక తక |
| | 3 | ,, | తక తక తక తక | తక తక తక తక | తక తక తక తక | తక తక తక తక |
| | 4 | ,, | తక తక తక తక తక తక తక తక | తక తక తక తక తక తక తక తక | తక తక తక తక తక తక తక తక | తక తక తక తక తక తక తక తక |
| 2 | | స్రోతోవహాయతి | కిటతక తకతక త | తకతక తకతక త | కిట తక తక తక త | తకతక తకతక త |
| 8 | 1 | గోపుచ్ఛ యతి | త తకతక కిటతక | త తకతక కిటతక | త తక తక కిటతక | త తకతక కిట తక |
| | 2 | ,, | తా త తక | తా త తక | తా త తక | తా త తక |
| 4 | 1 | పిపీలికయతి | త కిట తక త | త కిట తక త | త కిట తక కి | త కిట తక త |
| | 2 | ,, | త తరికిట తరికిట త | త తరికిట తరికిట త | త తరికిట తరికిట త | త తకిరిట తరికిట త |
| 5 | 1 | మృదంగ యతి | కిట తత కిట | కిట తత కిట | కిట త త కిట | కిట త త కిట |
| | 2 | ,, | తరికిట తక తరికిట | తరికిట తక తరికిట | తరికిట తక తరికిట | తరికిట తక తరికిట |
| 6 | | విషమయతి | త కిట త కిట | కిట తక్క త కిట | తా దికి ద తక | ఝం తరి త కిట |

ఈ విధానమునందు నిరూపించబడిన యతులను చతురశ్రజాతి ఏకతాళములో పై పథకమునందు నిరూపించియున్నాము.

పై పథకమునందలి గుర్వక్షరమును ఒక శేకండు కాలములో నుచ్చరించవలెను. అక్షరము, చతుర్భాగాక్షరము, కళాక్షరములను వాటికేర్పడియున్న కాలములలో ననుష్ఠించవలెను. చతుర్భాగాక్షరముల క్రింద ఒకగీటును, కళాక్షరముల క్రింద రెండు గీట్లను గుర్తుకొరకు ఉంచితిమి.

ఇంతవరకు ప్రతిహస్తక్రియయందును అనుష్ఠించువిధానమును వివరించితిమి. ఈవిధముగనే తాళముయొక్క ఒక ఆవర్తమునందు (గలమొత్తముహస్తక్రియలలో) కూడ ఈయతులను అనుష్ఠించవచ్చును. ఈవిధానమును ప్రక్క పథకములో నిరూపించుచున్నాము.

ఈ పథకములో సులభముగాగ్రహించగలందులకుగాను తకతకాదులతో యతులను నిరూపించితిమి. వెనుకటిపథకమునందు వలెనే ఈపథకమునందుగూడ అక్షరకాలము ననుష్ఠించవలెను. క్రియానంతర విశ్రాంతి కాలమందును, ఆవర్తమందును సమయతు లొకవిధముగనే యుండును. ప్రత్యేకలక్షణము చెప్పబడిన తాళములందుగాక తక్కిన తాళములన్నిటియందును యతుల నీ విధముగనే యనుష్ఠించవలెను.



# ఏకావర్త యతివిమర్శన పథకము

## ఏకతాళము - చతురశ్రజాతి - చిత్రతరమార్గము - సమగ్రహము

| సంఖ్య | | యతులు | చతురశ్ర జాతి లఘువు | | | |
|---|---|---|---|---|---|---|
| | | | ఘాత | చిటికెనవ్రేలు | అనామికవ్రేలు | మధ్యమవ్రేలు |
| 1 | 1 | సమయతి | తాఝుం | తాఝుం | తాఝుం | తాఝుం |
| | | ,, | తరికిట | తరికిట | తరికిట | తరికిట |
| | 2 | ,, | కిటతక తరికిట | కిటతక తరికిట | కిటతక తరికిట | కిటతక తరికిట |
| | 3 | ,, | కిటతక తరికిట | కిటతక తరికిట | కిటతక తరికిట | కిటతక తరికిట |
| | 4 | ,, | కిటతక తరికిట | కిటతక తరికిట | కిటతక తరికిట | కిటతక తరికిట |
| 2 | 1 | స్రోతోవహయతి | కిటతక తరికిట<br>కిటతక తరికిట | కిటతక తరికిట | తరికిట | తాఝుం |
| | 2 | ,, | కిటతక తరికిట | తరికిట | తక తా | తాఝుం |
| 3 | 1 | గోపుచ్ఛయతి | తాఝుం | తరికిట | తరికిట తరికిట | తరికిట తరికిట<br>తకతక తకతక |
| | 2 | ,, | తాఝుం | తా తక | తకతక | తకతక తకతక |
| 4 | 1 | పిపీలికయతి | తరికిట తరికిట | కిటతక తరికిట<br>తరికిట తరికిట | కిటతక తరికిట<br>తరికిట తరికిట | కిటతక తరికిట |
| | 2 | ,, | తకతక | తరికిట కిటతక | కిటతక తరి | కిటతక |
| | 3 | | తాఝుం | తరితక | తరి తా | ఝుం ఝుం |
| 5 | 1 | మృదంగయతి | తక తరికిట తక<br>తక తత కిటతక | తరికిట తరికిట | తరికిట కిటతక | తకతరి కిటతక<br>తకతత కిటతక |
| | 2 | ,, | తరికిట కిటతక | తకతక | తరికిట | తకతరి కిటతక |
| | 3 | | తకతక | తాఝుం | తాఝుం | తకతక |
| 6 | | విషమయతి | తకతక | తాఝుం | తకతత కిటతక | తరికిట |

# 10. ప్రస్తార ప్రాణలక్షణము

ద్రుతాది అంగప్రస్తారములు అనేకవిధములుగా నున్నవి. ఈ ప్రస్తారము లన్నియు తాళభేదములను నిరూపించుటకొరకు ఏర్పడినవి. ఈ ప్రస్తారలక్షణమును ఇచ్చట సంగ్రహముగ సూచించుచున్నాము.

### షో డ శాం గ ము లు

కాకపాదమునందు క్రమముగా నొక్కొక్క అనుద్రుతమును తగ్గించుచూ వచ్చిన షోడశాంగములు ఏర్పడును. అందు ఒక్కొక్క అంగమును ప్రస్తరించిన అనేక తాళములు ఏర్పడును. షోడశాంగముల నామములను వానిరూపములను దిగువ నుదహరించుచున్నాము.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | + | కాక పాదము | 16. | అక్షరములు లేక అనుద్రుతములు. |
| 2. | ◡ o \| S | ప్లుత ద్రుత విరామము | 15. | ,, ,, ,, |
| 3. | o \| S | ప్లుత ద్రుతము | 14. | ,, ,, ,, |
| 4. | ◡ \| S | ప్లుత విరామము | 13. | ,, ,, ,, |
| 5. | \| S | ప్లుతము | 12. | ,, దీనిని వాద్యలఘువందురు. |
| 6. | ◡ o S | గురుద్రుత విరామము | 11. | ,, ,, |
| 7. | o S | గురు ద్రుతము | 10. | ,, దీనిని వర్ణలఘువందురు. |
| 8. | ◡ S | గురు విరామము | 9. | దీనిని చిత్రలఘువందురు. |
| 9. | S | గురువు | 8. | దీనిని సింహలఘువందురు. |
| 10. | ◡ o \| | లఘుద్రుత విరామము | 7. | దీనిని హంసలఘువందురు. |
| 11. | o \| | లఘు ద్రుతము | 6. | దీనిని దివ్య లఘువందురు. |

| | | | | |
|---|---|---|---|---|
| 12. | ⌐ | లఘు విరామము | 5. | దీనిని మార్గలఘువని, ఖండ లఘువని అందురు. |
| 13. | \| | లఘువు | 4. | దీనిని మనుష్యలఘువని చతురశ్రలఘువని అందురు. |
| 14. | ಶ | ద్రుత విరామము | 3. | దీనిని స్వర్గలఘువందురు. |
| 15. | o | ద్రుతము. | 2. | |
| 16. | ◡ | అనుద్రుతము. | 1. | |

ఈ షోడశాంగములను అంగప్రాణలక్షణమునందుగూడ నుదహరించితిమి. ఇందులో కాకపాదము మొదలు లఘువు వరకుగల పదమూడు అంగములు మాత్రము చతురశ్రాదిజాతిమార్పును పొందును. ఈ మార్పును పొందునప్పుడు అయాజాతులందు లఘు, గురు, ప్లుత, కాకపాదములయొక్క అక్షరసంఖ్యలు మారుచుండును. ఆక్రమము నీపక్క పథకములో నిరూపించుచున్నాము.



# త్రయోదశాంగములకు జాతి భేదములు

| సంఖ్య | అంగ సంజ్ఞలు | ఒక్కొక్క జాతియందలి అక్షరములు లేక అనుద్రుతములు | | | | |
|---|---|---|---|---|---|---|
| | | చతురశ్రజాతి | త్రిశ్రజాతి | మిశ్రజాతి | ఖండజాతి | సంకీర్ణజాతి |
| 1 | + | 16 | 12 | 28 | 20 | 36 |
| 2 | U O I 8 | 15 | 12 | 24 | 18 | 30 |
| 3 | O I 8 | 14 | 11 | 23 | 17 | 29 |
| 4 | U I 8 | 13 | 10 | 22 | 16 | 28 |
| 5 | I 8 | 12 | 9 | 21 | 15 | 27 |
| 6 | U O 8 | 11 | 9 | 17 | 13 | 21 |
| 7 | O 8 | 10 | 8 | 16 | 12 | 20 |
| 8 | U 8 | 9 | 7 | 15 | 11 | 19 |
| 9 | 8 | 8 | 6 | 14 | 10 | 18 |
| 10 | U O I | 7 | 6 | 10 | 8 | 12 |
| 11 | O I | 6 | 5 | 9 | 7 | 11 |
| 12 | U I | 5 | 4 | 8 | 6 | 10 |
| 13 | I | 4 | 3 | 7 | 5 | 9 |

ఈ పదమూడంగములు ఒక్కొక్కటి అయిదేసి భేదములనుపొంది మొత్తము అరువదిఅయిదు భేదములయినవి. వీనితో జాతిమార్పును పొందని అనుద్రుత, ద్రుత, ద్రుత విరామములుచేరి అరువదియెనిమిది తాళాంగములైనవి. పై పథకములోని 3,5,7,9,10,11,13 వరుస సంఖ్యలుగల అంగములయొక్క చతురశ్రజాతి అనుద్రుతసంఖ్యలు క్రమముగ ధ్రువ, అట, మఠ్య, త్రిపుట, ఝంప, రూపక,ఏక తాళములయొక్క చతురశ్రజాతుల అనుద్రుత సంఖ్యలకు సమానములు. వీనిలో 7,10,11,13 సంఖ్యల అంగములకు అయిదుజాతులందుగల అనుద్రుత సంఖ్యలు క్రమముగ మఠ్య, ఝంప, రూపక, ఏక తాళములందు అయిదుజాతులందు గల అనుద్రుతసంఖ్యలకు ఆయాజాతులందు సమానములు. 5,9, సంఖ్యల అంగము లందలి చతురశ్రజాతి అనుద్రుతసంఖ్యలు క్రమముగా అట, త్రిపుటతాళముల యొక్క చతురశ్రజాతులకు సమానములు. ప్లుత, గురువులందలి లఘువులసంఖ్యకును, అట, త్రిపుటతాళములందలి లఘువులసంఖ్యకును తేడాయున్నందున వాటికి అనుద్రుతములసంఖ్యలు యితరజాతులలో పరస్పరము సమానములు కాకున్నవి. అటతాళమునందు రెండు లఘువులును, త్రిపుటతాళమునందు ఒక లఘువును గలవు. 5,9 అంగములకు ప్లుత, గురువులందు క్రమముగా మూడు, రెండు లఘువులుగలవు. అట త్రిపుటతాళములందు రెండు ద్రుతములు ఉండుటచేతను, రెండు ద్రుతముల అనుద్రుతసంఖ్య ఒక చతురశ్రలఘుసంఖ్యకు సమానమగుటచేతను 5,9 అంగములకు చతురశ్రజాతియందు మాత్రమే అట, త్రిపుట, తాళములయొక్క అనుద్రుతములసంఖ్యలు సమానములైనవి.

అనుద్రుతము జాతిభేదమును పొందదు. దీనికి ప్రస్తారములేదు. మార్గభేదము వలన అక్షరసంఖ్య మాత్రము మారుచుండును. ద్రుత, ద్రుతవిరామములకు జాతి భేదములేదు కాని ప్రస్తారముకలదు. ఏ అంగమునైనను ప్రస్తరించునప్పుడు ఏర్పడు భేదములన్నియు ప్రత్యేక తాళములగును. అట్టి తాళములకు ప్రస్తార తాళ ములని వ్యవహారము. ఏదేని ఒక అంగమును ప్రథమమున (నిర్ణయించుకొని)దాని క్రింద పై అంగమునందలి అనుద్రుతముల సంఖ్యకు సరిపోవునట్టి భిన్నాంగముల నుంచుచూ రావలయును. ఈ విధముగ పునరుక్తులు కలుగకుండునటుల అంగము లన్నియు అనుద్రుతములగు నంతవరకు ప్రస్తరించవలయును. ఈ పద్ధతియందేర్ప

డిన భేదములన్నియు తాళములగును. అనుద్రుతాది లఘ్వంగమువరకుగల అంగములను మాత్రమిచ్చట ప్రస్తరించి చూపుచున్నాము.

# ప్రస్తారములు

౧. అనుద్రుతము. దీనికి మరొక భేదములేదు.

---

దృత ప్రస్తారము. 2. భేదములు

1. ౦ 2. ౦౦

---

ద్రుత విరామ ప్రస్తారము. 4. భేదములు

1. ౦ 2. ౦ ౦ 3. ౦ ౦ 4. ౦ ౦ ౦

---

## లఘు ప్రస్తారము అయిదు విధములు

1. చతురశ్ర లఘుప్రస్తారము. 6. భేదములు

1. । 2. ౦ ౦ 3. ౦ ౦ ౦ 4. ౦ ౦ ౦ 5. ౦ ౦ ౦ 6. ౦ ౦ ౦ ౦

---

2. తిశ్ర లఘుప్రస్తారము. 4. భేదములు

1. । 2. ౦ ౦ 3. ౦ ౦ 4. ౦ ౦ ౦

---

3. మిశ్ర లఘుప్రస్తారము. 22. భేదములు

1. ।
2. ౦ ౦ ౦ ౦
3. ౦ ౦ ౦ ౦
4. ౦ ౦ ౦ ౦
5. ౦ ౦ ౦ ౦
6. ౦ ౦ ౦ ౦ ౦
7. ౦ ౦ ౦ ౦ ౦
8. ౦ ౦ ౦ ౦ ౦
9. ౦ ౦ ౦ ౦ ౦
10. ౦ ౦ ౦ ౦ ౦
11. ౦ ౦ ౦ ౦ ౦
12. ౦ ౦ ౦ ౦ ౦
13. ౦ ౦ ౦ ౦ ౦
14. ౦ ౦ ౦ ౦ ౦
15. ౦ ౦ ౦ ౦ ౦
16. ౦ ౦ ౦ ౦ ౦ ౦
17. ౦ ౦ ౦ ౦ ౦ ౦
18. ౦ ౦ ౦ ౦ ౦ ౦
19. ౦ ౦ ౦ ౦ ౦ ౦
20. ౦ ౦ ౦ ౦ ౦ ౦
21. ౦ ౦ ౦ ౦ ౦ ౦
22. ౦ ౦ ౦ ౦ ౦ ౦ ౦

### 4. ఖండ లఘుప్రస్తారము. 9. భేదములు

1. |
2. U O O
3. O U O
4. O O U
5. U U U O
6. U U O U
7. U O U U
8. O U U U
9. U U U U U

---

### 5. సంకీర్ణ లఘుప్రస్తారము. 56. భేదములు

1. |
2. O O O O U
3. O O O U O
4. O O U O O
5. O U O O O
6. U O O O O
7. U U U O O O
8. U U O U O O
9. U O U U O O
10. O U U U O O
11. O U U O U O
12. O U O U U O
13. O O U U U O
14. O O U U O U
15. O O U O U U
16. O O O U U U
17. O U O O U O
18. U O O U U O
19. U O U O U O
20. U U O O O U
21. U O U O O U
22. U O O U O U
23. U O O O U U
24. O U U O O U
25. O U O O U U
26. O U O U O U
27. U U U U U O O
28. U U U U O U O
29. U U U O U U O
30. U U O U U U O
31. U O U U U U O
32. O U U U U U O
33. O U U U U O U
34. O U U U O U U
35. O U U O U U U
36. O U O U U U U
37. O O U U U U U
38. U U U U O O U
39. U U U O U O U
40. U U U O O U U
41. U U O U O U U
42. U U O O U U U
43. U O U O U U U
44. U O O U U U U

| | | | |
|---|---|---|---|
| 45. | ∪ ○ ∪ ∪ ○ ∪ ∪ | 51. | ∪ ∪ ∪ ∪ ○ ∪ ∪ ∪ |
| 46. | ∪ ○ ∪ ∪ ∪ ○ ∪ | 52. | ∪ ∪ ∪ ○ ∪ ∪ ∪ ∪ |
| 47. | ∪ ∪ ○ ∪ ∪ ○ ∪ | 53. | ∪ ∪ ○ ∪ ∪ ∪ ∪ ∪ |
| 48. | ∪ ∪ ∪ ∪ ∪ ∪ ∪ ○ | 54. | ∪ ○ ∪ ∪ ∪ ∪ ∪ ∪ |
| 49. | ∪ ∪ ∪ ∪ ∪ ∪ ○ ∪ | 55. | ○ ∪ ∪ ∪ ∪ ∪ ∪ ∪ |
| 50. | ∪ ∪ ∪ ∪ ∪ ○ ∪ ∪ | 56. | ∪ ∪ ∪ ∪ ∪ ∪ ∪ ∪ ∪ |

లఘువువరకుగల మొత్తము ప్రస్తార భేదములు

| | | |
|---|---|---|
| 1. | అనుద్రుతమునకు | 1 |
| 2. | ద్రుతమునకు | 2 |
| 3. | దుృతవిరామమునకు | 4 |
| 4. | చతురశ్రిజాతి లఘువుకు | 6 |
| 5. | త్రిశ్రిజాతి లఘువుకు | 4 |
| 6. | మిశ్రజాతి లఘువుకు | 22 |
| 7. | ఖండజాతి లఘువుకు | 9 |
| 8. | సంకీర్ణజాతి లఘువుకు | 56 |
| | మొత్తము | 104 తాళములు. |

ఇంతటితో నీ పృస్తారలక్షణమును ముగించి ప్రతి తాళమునందును వినియోగమగు పృస్తారలక్షణమును చెప్పుచున్నాము.

తాళమునందు నడచు మార్గకాలములో అక్షరములను లేక అక్షరకాలములను దీర్ఘ, హ్రిస్వ, చతుశ్భాగ, కళాకాలములలో అనులోమ విలోమముగ ననుష్ఠించుట, అందు చతురశ్రాదిజాతి సంఖ్యలను తాళమార్గమునందు వినియోగించుకొనునప్పుడు ఏ జాతిని ఎచ్చటినుండి ప్రారంభించి ఎన్ని పర్యాయములు అనుష్ఠించిన గ్రహస్థానమునకు సరిపోవునో ఆ మున్నగువానిని అనుష్ఠించుట ప్రస్తారమనబడును. *

* ఈ పద్ధతిలో గానముచేయునప్పుడు అనవసరముగ పద మధ్యమునందలి అక్షరములకు దీర్ఘములు దీయుచు అర్థము లోపించునటుల ఉచ్చరించకూడదు. హ్రిస్వదీర్ఘాక్షరములకు క్రిమప్రకారము

చతురశ్రాది జాతి సంఖ్యగల శబ్దములను ప్రస్తరించి అనుష్ఠించు విధానమును మాదిరికొరకు తకతకాదులతో దిగువ పథకమున ఉదహరించుచున్నాము.

త్రిపుటతాళము - చతురశ్రజాతి - చిత్రతరమార్గము - సమగ్రహము.

| సం | జాతులు | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ఘాత | చిటికెన వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| 1 | చతురశ్ర | తక తక | తక తక | తక తక | తక తక | తక తక | తక తక | తక తక | తక తక |
| 2 | త్రిశ్ర | ,, తకి | టు_తకిట | తకిటు_త | కిటు-తకి | టు_తకిట | తకిటు_త | కిటు_తకి | టు_తకిట |
| 3 | మిశ్ర | ,, ,, | తకిట త | క తక_త | కిట తక | తక_తకి | ట తక త | క-తకిట | తక తక |
| 4 | ఖండ | ,, తక | తకిట_త | క తకిట | తక తకి | ట_తకత | కిట_తక | తకిట-త | క తకిట |
| 5 | సంకీర్ణ | ,, ,, | , తక త | కిట తక | తక-తక | తకిట త | క తక-త | క తకిట | తక తక |

పై పథకములో తాళ ప్రారంభమునుండి ప్రారంభించి తక తక అను చతురశ్రజాతి శబ్దమును ఎనిమిది పర్యాయములును, తాళము రెండక్షరముల

అకారాదులను వినియోగించుకొనవలెను. హ్రస్వాక్షరమునకు ఎన్ని అకారాదులను వినియోగించుకొనెదరో అంతకు రెట్టింపు అకారాదులను దీర్ఘాక్షరమునకు వినియోగించుకొనవలెను. ఇది పదమధ్యము నందలి న్యాయము. ఎచ్చటనైన గీతము తాళమునకు కొరవయైనచో ఆ భర్తీకొరకు సందర్భము ననుసరించి పై నియమముప్రకారము పదమధ్యమందును, పదాంతమునందును, వాక్యాంతమునందును రాగము ననుష్ఠించవలయును. కొద్ది అక్షరములుగల గీతమును గొప్పతాళములలో పాండిత్యమును వెల్లడించుట కొరకు గాను రాగాదులతో పెంచి అర్థము లోపించునటుల గానము చేయకూడదు. అదేవిధమున పెద్ద గీతములను కొద్ది తాళములలో నిమిడ్చి తరిమినటుల పాడినను అర్థమునకు భంగము కలుగును. గీతమునకు యుక్తమగు తాళములతో గానముచేయదగును. గీతమును అనేక తాళములలో గానముచేయుట ప్రజ్ఞావిశేషమని యెంచి విరసముగ గానము చేయకూడదు. అట్టి దురాచారములను తొలగించుట గాయకుల ముఖ్యకర్తవ్యము.

కాలము గడచినవెనుక ప్రారంభించి తకిట అను త్రిశ్రజాతి శబ్దమును పది పర్యాయములును, తాళము నాలుగు అక్షరములకాలము గడచినవెనుక ప్రారంభించి తకిట తక తక అను మిశ్రజాతి శబ్దమును నాలుగు పర్యాయములును, తాళము రెండు అక్షరములకాలము గడచినవెనుక ప్రారంభించి తక తకిట అను ఖండజాతి శబ్దమును ఆరు పర్యాయములును, తాళము అయిదు అక్షరములకాలము గడచినవెనుక ప్రారంభించి తక తకిట తక తక అను సంకీర్ణశబ్దమును మూడు పర్యాయములును అనుష్ఠించిన తాళావర్తాంతమునకు సరిపోవును. ఇటులనే ఒక మార్గమునందు ఒక ఆవర్తములోగాని అనేక ఆవర్తములలోగాని పై జాతులలో ఒకదానిని లేక అయిదింటినిగాని, లేక కొన్నిటినిగాని, కళాది కాలములలో అనులోమ విలోమముగ శాస్త్రనియమములను పాటించుచూ అనుష్ఠించవలయును. గ్రహస్థానమునను సరించి ప్రస్తారముయొక్క గ్రహస్థానము నిర్ణయమగును. ఇంతటితో తాళదశ ప్రాణప్రకరణము ముగింపబడినది.



# సంగీతమార్తాండము

## తాళాధ్యాయము

### 3. బిందుశోధన ప్రకరణము



కొందరు రహస్యముగ కొంతకాలము కుస్తీ పద్ధతులలో గీతాదులను కొన్ని తాళములతో సాధనజేసి శ్రీత్యాగరాజ ఉత్సవములు మున్నగు వాని యందు జరుగు సభలలో కార్య నిర్వాహకులను భ్రమపెట్టి వారిచే పోటీపరీక్షల నేర్పాటు చేయించుకొని అట్టిపరీక్షలలో తాము గెలుపొందుట మూలమున కీర్తిని గడింప నెంచుచున్నారు. అర్థమును వ్యర్థముజేసి కేవలము తాళమునకే ప్రాధాన్యత నొసంగి ఉముకదంపుడు మాదిరి భావశూన్యముగ కొందరు గానము చేయుచున్నారు. కొందరు వక్రపద్ధతులలో తాళము నభ్యసించి లోకముమీద సవాలు చేయుచున్నారు. ఒకరు గానము చేసిన విధముగను, ఒకరు తాళము ననుష్ఠించిన విధముగను మరొకరు గానము చేయవలయుననిగాని, తాళము ననుష్ఠించవలయునని గాని శాస్త్రము శాసించదు. సర్వులు శాస్త్రమును అనుసరించక తప్పదు. అట్టియెడ కొందరు వికృతరీతులలో నంగములను చలింపజేయుచు నవికూడ తాళసంజ్ఞలనుచున్నారు, అట్టివారు అనేక తాళములను ఏకకాలమునందు వివిధాంగములతో ననుష్ఠించుచు వాట్లకు ద్విముఖి, త్రిముఖి, చతుర్ముఖి, పంచముఖి, షణ్ముఖి, ఇత్యాది నామములను సృష్టించుచున్నారు. తదనుగుణములగు శ్లోకములను రచించి శాస్త్రమునందు చొప్పించుచున్నారు. ఇట్టివారి పద్ధతులను లోకమునకు వెల్లడింపదలచి బిందుశోధనమను యీప్రకరణమును చెప్పుచున్నాము. ఇందలి శ్లోకములు కల్పితములు.

బిందువులనగా అక్షరములు. శోధనయన అట్టి అక్షరములను శోధించుట. ఒక్కొకరు ఒక్కొక్క తాళము వంతున కొన్ని తాళములను అందరును ఒక పర్యాయమే ప్రారంభించి కొన్ని ఆవర్తములు గడచిన అనంతరము అందరి తాళములు

ఒకపర్యాయముగ సమాప్తి నొందుటకుగాను ఒక్కొకరు ఎన్ని హస్తక్రియలను అనుష్ఠించుదురో అట్టిక్రియలు బిందువులనబడును. వాటిసంఖ్యయే బిందుసంఖ్య. హస్తక్రియలకు అక్షరములను సంజ్ఞకూడ గలదు.

## సప్తతాళ బిందుసంఖ్యలు

శ్లో॥ రసఃఖాక్షి రసర్వేద గిరిభాను ర్ధ్రువాస్మృతాః
ఖవేదాక్షిర్మత్యతాళః ఖగుణా రంధ్రయోరసః
ర్ఝుంపాఖ వేదనాగా శ్చాద్యక్షుసాగర సంఖ్యకః
ఖవేదార్థ గిరిశ్చైవ బిందు త్రిపుట ఏవచ
ఖరసో నాగగుణవా నబ్జవైరి రతస్తథా
ఖరసాక్షిర్యబ్జవైరి స్తాళబిందోశ్చ లక్షణం
ధ్రువాది సప్తతాళానాం బిందుశోధనముచ్యతే॥

తా॥ ధ్రువతాళమునకు 1746206, మఠ్యతాళమునకు 240, రూపకతాళమునకు 6930, ఝంపతాళమునకు 840, త్రిపుటతాళమునకు 72072, అటతాళమునకు 13860, ఏకతాళమునకు 1260 బిందువులని తాత్పర్యము.

వి:— అయిదుగురు అయిదుజాతుల ధ్రువతాళములను ఏకకాలమందు ప్రారంభించి అనుష్ఠించగా అందరి తాళములు ఏకకాలమందు పూర్తిఅయి తిరిగి అందరును ఒక పర్యాయమే తమతమ తాళములను ప్రారంభించుటకుగాను ఒక్కొకరు 1746206 హస్తక్రియల ననుష్ఠించవలెను. దీనికి బిందు సంఖ్యయని పేరు. ఇదేవిధమున మిగిలిన తాళములను తెలియవలెను. ఇందు హస్తక్రియల సంఖ్యలు మాత్రమే చెప్పబడినవి. ఈపద్ధతియందు ఒక్కొక్కరు తమతమ తాళమునందు ఎన్ని ఆవర్తముల ననుష్ఠించెదరో ఆవివరమును చెప్పుచున్నాము.

# బిందావర్తసంఖ్యలు

## 1. ధ్రువతాళము.

శ్లో॥ రంధ్రాక్షి గిరివేదాశ్చ అక్షిభాను చతుశ్రజాః
రసవేద గిరిర్నాగాః శరభానుశ్చ తిశ్రజాః
అక్షిద్వయో రంధ్రశర గిరిర్యావర్త మిశ్రజాః
దిశోభాను గిరిర్యక్షి ఖవేదార్ధార్థ ఖండజాః
వేదభాను ద్విఖర సంకీర్ణావర్తసంజ్ఞకః॥

తా॥ ధ్రువతాళపు చతురశ్రజాతికి 124729, త్రిశ్రజాతికి 158746, మిశ్రజాతికి 75922, ఖండజాతికి 102718, సంకీర్ణజాతికి 60214 బిందావర్తములు.

వి:— ధ్రువతాళమునందు చతురశ్రాది అయిదు జాతులకు ఏర్పడిన 1746206 బిందుసంఖ్యను ఆయాజాతులందు ఒక ఆవర్తమునకుగల హస్తక్రియల సంఖ్యచే భాగించిన పై ఆవర్త సంఖ్యలు వచ్చును. ధ్రువతాళమునందు చతురశ్రజాతికి 14, త్రిశ్రజాతికి 11, మిశ్రజాతికి 23, ఖండజాతికి 17, సంకీర్ణజాతికి 29 ఆవర్త సంఖ్యలు. ఈ సంఖ్యలతో బిందుసంఖ్యను భాగించిన ఆయాజాతులందు బిందావర్త సంఖ్యలు వచ్చును. ఇదే విధమున మిగిలిన తాళములను తెలియవలెను.

## 2. మఠ్యతాళము.

శ్లో॥ వేదాక్షి చతురశ్రైశ్చైవ ఖగుణా త్రిశ్రజాతయః
శరాబ్జనైరి మిశ్రంతు ఖవేదార్ధసఖండజాః
అక్ష్యబ్జ వైరి మఠ్యస్తా సంకీర్ణావర్త సంజ్ఞకః॥

తా॥ మఠ్యతాళములో చతురశ్రజాతికి 24, త్రిశ్రజాతికి 30, మిశ్రజాతికి 15, ఖండజాతికి 20 సంకీర్ణజాతికి 12 బిందావర్తములు.

## 3. రూపక తాళము.

శ్లో॥ ద్విశరః భానుభానుశ్చ ఆవర్తా చతురశ్రజాః
రసనాగాగ్ని భానుశ్చ ఆవర్తా త్రిశ్రజాతయః,
ఖగిరి ద్వయమిశ్రంచ ఖరంధ్రద్వయ ఖండజాః
ఖగుణా రసరూపంచ సంకీర్ణా వర్త సంజ్ఞకః.

తా॥ రూపక తాళములో చతురశ్రజాతికి 1155, త్రిశ్రజాతికి 1386 మిశ్రజాతికి 770, ఖండజాతికి 990, సంకీర్ణజాతికి 630 బింద్వావర్తములు.

## 4. ఝంపతాళము.

శ్లో॥ ఖవేదార్థాబ్జ వైరిశ్చ ఖవేదా భానుత్రిశ్రజాః
వేదానాగాశ్చ మిశ్రించ శరఖం రవిఖండజాః
ఖగిరీ ఝంపతాళేతి సంకీర్ణా వర్త సంజ్ఞకః.

తా॥ ఝంపతాళములో చతురశ్రజాతికి 120, త్రిశ్రజాతికి 140, మిశ్రజాతికి 84. ఖండజాతికి 105. సంకీర్ణజాతికి 70. బింద్వావర్తములు.

## 5. త్రిపుటతాళము.

శ్లో॥ రంధ్రాఃఖే రంధ్రశ్చతురః రసరంధ్రాక్షిఖారవిః
అక్షిశరద్వయ రసదిగేఖాః ఖేదిగే స్మృతాః
యుగవేదః బాణశర త్రిపుట సంకీర్ణముచ్యతే॥

తా॥ త్రిపుట తాళములో చతురశ్రజాతికి 9009, త్రిశ్రజాతికి 10296, మిశ్రజాతికి 6552, ఖండజాతికి 8008, సంకీర్ణజాతికి 5544 బింద్వావర్తములు.

## 6. అటతాళము.

శ్లో॥ శరద్వయాద్వ్యబ్జవైరి ఆవర్తా శ్చతురశ్రజాః
రసనాగాచ్ఛ గుణవా నబ్జవైరిశ్చ త్రిశ్రిజాః
ఖగిరి ద్వయమిశ్రంచ ఖరంధ్రాద్వయ ఖండజాః
ఖగుణా రససంకీర్ణ అట ఆవర్త సంజ్ఞకా.

తా॥ అటతాళములో చతురశ్రజాతికి 1155, త్రిశ్రజాతికి 1386, మిశ్రజాతికి 770, ఖండజాతికి, 990, సంకీర్ణజాతికి 630 బిందావర్తములు.

## 7. ఏకతాళము.

శ్లో॥ శరాబ్జనైరి గుణవాక్ ఖాక్షి వేదాశ్చ త్రిశ్రజాః
ఖనాగాబ్జ నైరిమిశ్ర అక్షిబాణాక్షి ఖండజాః
ఖవేదా భానుసంకీర్ణా ఏకమావర్తలక్షణం॥

తా॥ ఏకతాళములో చతురశ్రజాతికి 315. త్రిశ్రజాతికి 420. మిశ్రజాతికి 180, ఖండజాతికి 252, సంకీర్ణజాతికి 140. బిందావర్తములు.

ఇంతవరకు ఒక్కొక్క తాళమునందుగల అయిదు జాతులకు బిందుసంఖ్యలు చెప్పబడినవి. సప్తతాళములకును ఒక్కొక్క జాతియందు బిందు సంఖ్యలను చెప్పుచున్నాము.

| | | | | |
|---|---|---|---|---|
| 1. | చతురశ్రజాతి | సప్తతాళములకు | బిందుసంఖ్య | 840 |
| 2. | త్రిశ్రజాతి | సప్తతాళములకు | ,, | 9240 |
| 3. | మిశ్రజాతి | సప్తతాళములకు | ,, | 1275120 |
| 4. | ఖండజాతి | సప్తతాళములకు | ,, | 42840 |
| 5. | సంకీర్ణజాతి | సప్తతాళములకు | ,, | 746460 |

ఏడుగురు ఏడు తాళములను ఒకపర్యాయమే ప్రారంభించి అందరును ఒక జాతినే అనుష్ఠించునప్పుడు అందరి తాళములు ఒక పర్యాయమే సమాప్తి యగుటకుగాను పై సంఖ్యలు చెప్పబడినవి.

ఒక్కొక తాళమునందుగల చతురశ్రాది అయిదు జాతులను అయిదుగురనుష్ఠించునప్పుడు ఏర్పడే బిందుసంఖ్యలును, బిందావర్త సంఖ్యలును దిగువ పథకములో వివరింప బడుచున్నవి.

## సప్తతాళముల స్వజాతి ఛింద్యావర్త సంఖ్యాపథకము

| సంఖ్య | తాళముల పేర్లు | చతురశ్రజాతి | | త్రిశ్రజాతి | | మిశ్రజాతి | | ఖండజాతి | | సంకీర్ణజాతి | | * ఛింను సంఖ్యలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ఆవర్త క్రియలు | ఛింద్యావర్తము | ఆవర్త క్రియలు | ఛింద్యావర్తము | ఆవర్త క్రియలు | ఛింద్యావర్తము | ఆవర్త క్రియలు | ఛింద్యావర్తము | ఆవర్త క్రియలు | ఛింద్యావర్తము | |
| 1 | ధ్రువతాళము | 14 | 124729 | 11 | 155746 | 23 | 75922 | 17 | 102718 | 29 | 60214 | 1746206 |
| 2 | మఠ్యతాళము | 10 | 24 | 8 | 30 | 16 | 15 | 12 | 20 | 20 | 12 | 240 |
| 3 | రూపకతాళము | 6 | 1155 | 5 | 1386 | 9 | 770 | 7 | 990 | 11 | 630 | 6930 |
| 4 | ఝంపతాళము | 7 | 120 | 6 | 140 | 10 | 84 | 8 | 105 | 12 | 70 | 840 |
| 5 | త్రిపుటతాళము | 8 | 9009 | 7 | 10296 | 11 | 6552 | 9 | 3003 | 13 | 5544 | 72072 |
| 6 | అటతాళము | 12 | 1155 | 10 | 1386 | 18 | 770 | 14 | 990 | 22 | 630 | 13860 |
| 7 | ఏకతాళము | 4 | 315 | 3 | 420 | 7 | 180 | 5 | 252 | 9 | 140 | 1260 |

* ఛింద్యావర్తము అనుచోట 'ఉ'ను సర్వత్ర గ్రహింపవలెను.

# సప్తతాళ జాతిక్రమ బింద్వావర్త సంఖ్యాపథకము

| సంఖ్య | తాళముల పేర్లు | చతురశ్రజాతి | | త్రిశ్రజాతి | | మిశ్రజాతి | | ఖండజాతి | | సంకీర్ణజాతి | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ఆవర్త క్రియలు | బింద్వావర్తములు | ఆవర్త క్రియలు | బింద్వావర్తములు | ఆవర్త క్రియలు | బింద్వావర్తములు | ఆవర్త క్రియలు | బింద్వావర్తములు | ఆవర్త క్రియలు | బింద్వావర్తములు |
| 1 | ధ్రువ తాళము | 14 | 60 | 11 | 840 | 23 | 55440 | 17 | 2520 | 27 | 25740 |
| 2 | మఠ్య తాళము | 10 | 84 | 8 | 1155 | 16 | 79695 | 12 | 3570 | 20 | 373230 |
| 3 | రూపక తాళము | 6 | 140 | 5 | 1848 | 9 | 141680 | 7 | 6120 | 11 | 67:60 |
| 4 | ఝంప తాళము | 7 | 120 | 6 | 1540 | 10 | 127512 | 8 | 5355 | 12 | 62205 |
| 5 | త్రిపుట తాళము | 8 | 105 | 7 | 1320 | 11 | 115920 | 9 | 4760 | 13 | 57420 |
| 6 | అట తాళము | 12 | 70 | 10 | 924 | 18 | 70840 | 14 | 3060 | 22 | 33930 |
| 7 | ఏకతాళము | 4 | 210 | 3 | 3080 | 7 | 182160 | 5 | 8568 | 9 | 82940 |
| | జాతిక్రమ బిందు సంఖ్యలు | 840 | | 9240 | | 1275120 | | 42840 | | 746460 | |

ఘుర్వాది సప్తతాళములను ఒక్కొక్కరు ఒక్కొక్కతాళమువంతున ఏడుగురు ఏడుతాళములను ఒకపర్యాయమే ప్రారంభించి అనుష్ఠించునప్పుడు ఈతాళములందు ఒక్కొకజాతిలో ఏర్పడు బిందు సంఖ్యలును, బింద్వావర్త సంఖ్యలును ఈ ప్రక్క పథకములో వివరింపబడియున్నవి. యీ పద్ధతియందు ఏజాతినైనను అందరును ఒక్కజాతినే యనుష్ఠించవలెను.

శ్లో॥ అష్టౌ చతుర్దశ దశ షడ్జశ్చాద్రి మనుర్యుగాః
ఏవమాద్యాది తాళానా మక్షరాః కాలసంజ్ఞకః॥

తా॥ 8,14,10,6,7,14,4 ఈసంఖ్యలు ఆదితాళాదులకు అక్షర(బిందు)సంజ్ఞలు.

వి:— త్రిపుట చతురశ్రజాతికి ఆదితాళమని పేరు. పైవి క్రమముగా ఆది, ధ్రువ ఛతురశ్ర, మఠ్యచతురశ్ర, రూపకము చతురశ్ర, త్రిపుటత్రిశ్ర, అటచతురశ్ర, ఏకచతురశ్ర తాళములకు సంఖ్యలు. గానము నభ్యసించువారు ఈసంఖ్యలందుగల తాళములోననే నేడు అలంకారముల నభ్యసించుచున్నందున వీటికి ప్రత్యేకముగ బిందుసంఖ్యలు చెప్పబడినవి.

శ్లో॥ ఆద్యాదితాళా గతవర్ణసంఖ్యాః
ఖవేద నాగాః కిల శోభయంతి
స్వతాళసంఖ్యాక్షరకాలభాగైః
ఆవర్తసంఖ్యాక్షరపంక్తి గణ్యతే॥

తా॥ ఆద్యాది పైతాళములయొక్క బిందుసంఖ్య 840. తాళావర్త సంఖ్య చేత యీ బిందుసంఖ్యను భాగించగా ఆవర్తసంఖ్య వచ్చును.

వి:— పై ఆది మొదలగు తాళములకు బిందుసంఖ్యలను తెలియవలయునని ఆయాతాళములయొక్క ఆవర్త సంఖ్యలను కనిష్ట సామాన్య గుణకార (యల్. సి. యం) ము చేయవలెను.

ఉదాహరణము:—

2 | 8-14-10-6-7-14-4

4, 7, 5, 3

4+7=28+5=140+3=420+2=840 బిందుసంఖ్యలు.

## పై తాళములకు బిందావర్తములు

శ్లో॥ అదిపంచోత్తర శతంధ్రువషష్టి స్తథైవచ
చతురశీతి ర్మఠ్యతాళః చత్వారింశచ్ఛతోత్తరం
ఝంపా చతురశీతిస్యా ద్వింశోత్తర శతద్వయం
షష్ఠిఖండ సముత్పన్నా దశోత్తర శతద్వయం
ఏవమాద్యాది తాళానాం ఆవర్తా క్రిమశో విదుః॥

తా॥ ఆదితాళమునకు (చ-త్రి) 105, ధ్రువతాళము (చ) నకు 60. మఠ్య తాళము (చ) నకు 84, రూపక తాళము (చ) నకు 140, ఝంపతాళమున (మి)కు 84, త్రిపుట తాళము (తి్రి)నకు 120, అటతాళము (ఖం)నకు 60, ఏకతాళము (చ) నకు 210 బిందావర్తములు.

సప్తతాళముల యొక్క జాతిభేదము వలన ఏర్పడిన 35 తాళములకు బిందు సంఖ్య 8172244880.

ఈప్రికరణములో వివరించిన విధానమున రెండుచేతులతోను, రెండు కాళ్ల తోను, రెండు చంకలతోను తాళములను అనుష్ఠించుచు కసరతు చేయువారుందు రనియు, అది అశాస్త్రీయమనియు సర్వులకును తెలియగలందులకై ఇందు వివరించి తిమి. దీనివలన గానమున కెట్టిప్రయోజనము లేదనియు తెలియదగును.



# సంగీతమార్తాండము

## తాళాధ్యాయము

### 4. ముక్తాయి ప్రకరణము

గీత వాద్యములలో ముగింపు స్థానమునందు అనుష్ఠించు స్వరమునకు గాని శబ్దమున (వాద్యాక్షరముల) కు గాని ముక్తాయి అనిపేరు. గీత సమాప్తియందును, వాద్య సమాప్తియందును ఒక గతిలో గీతమునుగాని వాద్యమునుగాని అనుష్ఠించి తిరిగి మరొక గతిని ప్రారంభింప బోవునప్పుడును, ఒక కాలమునుండి మరొక కాలమునకు మారునప్పుడును, యింకా ముఖ్యమగు సమయములందును ఆయా సందర్భములను తెలిసికొనగలందులకుగాను ముక్తాయి యనుష్ఠించబడును. సమాప్తము చేయునప్పుడు ముక్తాయికూడ నొక యలంకారముగనుండును. ఇయ్యది మంగళప్రదము.

ప్రక్కవాద్యపరులు గానము ననుసరించి ముక్తాయిలను వినియోగించవలెను. అనవసరముగ ప్రతి ఆవర్తమునందును ముక్తాయిలను గుప్పకూడదు. ఈ ముక్తాయించు విధానము అనాదినుండియు ఆచరణలో లేదని కొందరూహించుచున్నారు. ఈపేరుతో లేనంత మాత్రమున అసలు లేదనుటకు వీలుండదు. కాలక్రమమున పరిభాషా పదములకు వ్యవహారము మారుచుండుట సహజము. కావున పూర్వము మరొక పేరుతో నాచరణలోనుండి యుండవచ్చును.

గాయకుడు ముక్తాయిని ప్రారంభింపగనే గీతాదులు సమాప్తము కాబోవుచున్నవని ప్రక్కవాద్యపరులు గ్రహించి గానము ననుసరించి వాదన మొనర్చుటకు ముక్తాయికూడ తోడ్పడుచున్నది. అదే విధముగ ముక్తాయి గాయకులకు

గూడ తోడ్పడుచున్నది. గాయకునకు, వాద్యపరులకుగల సమిష్టి సాంకేతికము లలో ముక్తాయికూడ నొకటియైయున్నది.

ముక్తాయి ముక్తసరిగ నుండుట ఉత్తమము. కొండవీటి చేతాడుమాదిరి గీతమునకు మించినచో నది యన్నమునకు మించిన అనుపాకమువంటిదగును. పల్లవి పాడునప్పుడును, పల్లవియందు ప్రక్కవాద్యములకు ప్రత్యేకముగ నవకాశమొసంగు నప్పుడును సందర్భానుసారముగ నధికమాత్రలుగల ముక్తాయిల ననుష్ఠించిన అంత ప్రమాదముండదుగాని గీతములందు మాత్రము నిషిద్ధము.

కొన్ని స్వరాక్షరములనుగాని, మృదంగాది చర్మ వాద్యములందును, నోటి కొనుగోలునందును వినియోగమగు తకతకాది వాద్యాక్షరములనుగాని మూడు పర్యాయములు చర్వితచర్వణముగా నుచ్చరించుచు గీత ప్రారంభ (గ్రహ) స్థానము నకు సరిపెట్టుట ముక్తాయించుట యనబడును. కొన్ని గ్రంథములందు ఒక పర్యా యము ఉచ్చరించుటయే ముక్తాయిగా చెప్పబడిన స్థానములుగలవు. పై విధముగ ముమ్మారుచ్చరించుట ముక్తాయియను ఆచారము సాంప్రదాయముగ వచ్చుచు న్నది. అంతమాత్రమున ఒక పర్యాయము ఉచ్చరించుపద్ధతిని దోషముగా గ్రహించకూడదు.

ముక్తాయి వినసొంపుగ నుండవలయును. ద్విత్వాక్షరములతో ముక్తాయిం చకూడదు. తాక్రింద తావత్తు మున్నగు కొన్నిటినిమాత్రము వినియోగించుకొన వచ్చును. ఒక గాయకుడు అనుష్ఠించిన ముక్తాయిని మరొకగాయకుడు అనుష్ఠించి తీరవలయునను నియమము ఉండదు. ఆ విధముగ ననుష్ఠించలేనంత మాత్రమున పాండిత్యలోపముగ నెంచకూడదు. ప్రక్క వాద్యపరులుమాత్రము గాయకుడు అనుష్ఠించిన ముక్తాయిలనే అనుష్ఠించుట ఉత్తమపక్షము. గాయకులైనను ప్రక్క వాద్యపరులను మోసముచేయుటకును, అవమానపరుచుటకును అపసవ్యపు మార్గ ములలో రహస్యముగ చాలకాలము సాధికచేసి సభలలో నప్పటికప్పుడు ప్రక్క వాద్యపరులకు తెలియని ముక్తాయిలను వినియోగించకూడదు. కసరతుచేసిన విధమున రక్తిహీనమగు ముక్తాయిలను అనుష్ఠించకూడదు. సభలలో వాద్యము లకు ప్రత్యేకముగ నవకాశమొసంగబడినప్పుడు ప్రక్క వాద్యపరులు తమ కను

కాలమగు ముక్తాయిలను సందర్భానుసారముగ యుక్తమగు మార్గమున అనుష్ఠించ నగును.

స్వరాక్షరములతో ముక్తాయించునప్పుడు ప్రథమ పర్యాయము అనుష్ఠించిన స్వరాక్షరములనే తక్కిన రెండు పర్యాయములుకూడ అనుష్ఠించి తీరవలయునను నియమములేదు. వాద్యాక్షర ముక్తాయిలందుకూడ యీ నియమము లేదు. కాని వాద్యములు ధ్వన్యాత్మకములగుటచే మార్పులు అంతగా వ్యక్తము కానేరవు. నోటితో కొనుగోలు చేయునప్పుడు సాధారణముగా మార్పు జేయకయే ముమ్మారు ఒక శబ్దమునే అనుష్ఠించుచున్నారు. మార్పుజేసి మూడు పర్యాయములు మూడు విధములైన శబ్దముల (అక్షర సముదాయము) నుచ్చరించినను దోషము కానేరదు. ముక్తాయియందలి మాత్రాసంఖ్యగాని, అక్షరసంఖ్యగాని ముమ్మారు ఒక విధముగనే యుండవలయును.

ఉదాహరణము:— మార్పులేనివిధము

ముక్తాయి. 1. తధిగిణతోం
2. తధిగిణతోం
3. తధిగిణతోం

మార్పుగలవిధము: 1. తాం తధిగిణతోం
2. ధీం తధిగిణతోం
3. ఝం తధిగిణతోం

ముక్తాయిలో హ్రస్వాక్షరములు దీర్ఘాక్షరములుకూడా ఉండవచ్చును. లేదా కేవల హ్రస్వాక్షరములైనను ఉండవచ్చును. ముక్తాయి మధ్యమందు ఒక చోటగాని కొన్నిచోట్లగాని కొంత విశ్రాంతి కాలముండవచ్చును. ఈ విశ్రాంతి అక్షరకాలములను ( , ) కామా గుర్తుతో చూపుచున్నాము. వీటికి నేడు కాప్పు అక్షరములను వ్యవహారము గలదు. వాద్యములందు ముక్తాయించునప్పుడు అట్టి విశ్రాంతి కాలములను మౌనానుష్ఠానముతో విని యోగించుకొనవలయును. ముక్తాయియందలి అక్షరములను కొన్నిటిని రెండవ కాలములోగాని ముక్తాయి రెండవకాలములో నున్నప్పుడు మూడవకాలములోగాని, లేక రెండుమూడు కాలములలోగాని

అనుష్ఠించవచ్చును. స్వరముక్తాయిలందు విశ్రాంతికాలమునకు ఎడమవైపున యుండు స్వరమును విశ్రాంతికాలము పూర్తియగునంతవరకు దీర్ఘముగ నుచ్చరించుచు రాగభావముతో వినియోగించుకొనవలెను. కాని యీ పద్ధతిలో ముక్తాయించుట ఆచరణలోనున్నటుల వినము.

నేడు కొంతశబ్దమును ముక్తాయినికలిపి ఆ మొత్తమును ముక్తాయిగ ననుష్ఠించు యాచారముగలదు. ముక్తాయిలో తుదనున్న కొంతశబ్దమును పైకాలములో ననుష్ఠించుటకూడ కలదు. స్వరములను ముక్తాయించునప్పుడు ఆరోహణావరోహణములు వ్యక్తమగుచునేయుండును. అట్లే వాద్యాక్షరములను ముక్తాయించునప్పుడుకూడ నా ధర్మమును పాటింపదగును. ముక్తాయిశబ్దమును ఉచ్చరించునప్పుడు పైనుండి క్రిందికి దిగుచున్నట్లుగా నుండవలయును. మూడు పర్యాయములు మూడు స్థాయిలలో ననుష్ఠించుట యుక్తము, ఈ విధముగ స్థాయి భేదములతో ననుష్ఠించలేనివారు ఏకనాదములో నుచ్చరించినను అది శ్రవణయోగ్యముగా నుండవలయును. వాంతిచేసుకొనువానివలెగను, కలహించునట్లును, శుష్కాక్షరములుగ నుచ్చరించకూడదు. గీతము ఏ రాగములోనుండునో అందలి ముక్తాయి అక్షరములనుకూడ నట్టి రాగమందే యనుష్ఠించవలెను.

## ఉదాహరణములు: —

కేవల హ్రస్వాక్షరములు గల ముక్తాయి
1 కిటతక తధిగిణ త
2 కిటతక తధిగిణ త
2 కిటతక తధిగిణ త

హ్రస్వాక్షరములు దీర్ఘాక్షరములుగల ముక్తాయి—
తాఝుం తరికిట తక తధిగిణతోం
తాఝుం తరికిట తక తధిగిణతోం
తాఝుం తరికిట తక తధిగిణతోం

విశ్రాంతి కాలములుగల ముక్తాయి
1. ధీం ,, తాం ,, తక తధిగిణతోం
2. ధీం ,, తాం ,, తక తధిగిణతోం
3. ధీం ,, తాం ,, తక తధిగిణతోం

ఒకటి రెండు కాలాక్షరముగల ముక్తాయి

1. దిరుగుడు తాకిట తక తధిగిణతోం
2. దిరుగుడు తాకిట తక తధిగిణతోం
3. దిరుగుడు తాకిట తక తధిగిణతోం

తుదియందు పై కాలముగల ముక్తాయి

1. తరికిట తక ఝుంతరి కిటతక
2. తరికిట తక ఝుంతరి కిటతక
3. తరికిట తక ఝుంతరి కిటతక

క్రింద గీటుగల అక్షరములను రెండవకాలములో నుచ్చరించవలెను.

ముక్తాయియొక్క తుది అక్షరము గురువుగనైనను హ్రస్వముగనైనను ఉండవచ్చును.

ఉదాహరణము:—

1. తుదియందు లఘువుగలది. తధిగిణత
2. తుదియందు గురువుగలది. తధిగిణతోం

ఇందు తుదియక్షరము బిందుయుక్తమైన ముక్తాయిలు వినసొంపుగనుండును.

## ముక్తాయిల వినియోగము

తదిగిణత అను అయిదు అక్షరముల ముక్తాయిని ముక్తాయించునప్పుడు ముమ్మారు అనుష్ఠించవలెను. అప్పుడు తధిగిణత, తధిగిణత తధిగిణత అని పదునైదక్షరములగును. ఈ పదునైదక్షరములను గీత ప్రారంభ (గ్రహ) స్థానమునకు సరిపోవునట్లనుష్ఠించవలయును. సమ, అనాగత, అతీత, విషమసమ, విషమవిషమ అను గ్రహస్థానములను అనగా గీత ప్రారంభస్థానములను దశప్రాణప్రకరణమునందు గ్రహప్రాణలక్షణమున వివరించియున్నాము. ఇందు ఒక్కొక్క గ్రహమున ముక్తాయించు విధానమును నిరూపించుచున్నాము.

### 1. సమగ్రహమున ముక్తాయించు విధము

తాళావర్తమునందుగల హస్తక్రియల సంఖ్యను మాత్రాక్షరముల సంఖ్యచే గుణింపగా నేర్పడిన మొత్తము అక్షరములలో ముక్తాయి అక్షరములను మినహా

యించిన ఎన్నిఅక్షరములు మిగులునో తాళప్రారంభమునుండి అన్ని అక్షరముల తాళము గడచిన అనంతరము ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన గీతప్రారంభ (సమగ్రహ) స్థానమునకు సరిపోవును.

ఉదాహరణము:—

గీతమును, ఆదితాళమున చిత్రతరమార్గములో (హస్తక్రియకు నాలుగు అక్షరములవంతున) ననుష్ఠించునప్పుడు ఆవర్తమునందు 32 అక్షరకాలము లుండును. ఆదితాళమునకు గల ఎనిమిది హస్తక్రియలకు క్రియకు నాలుగు అక్షరములవంతున మొత్తము (8×4=32) ముప్పదిరెండక్షరములగును. పైన ఉదహరించిన 'తదిగిణత' అను శబ్దము ముక్తాయించునప్పుడు 15 అక్షరములగును. తాళావర్తమునకుగల 32 అక్షరములలో ముక్తాయియందుగల 15 అక్షరములను తీసివేయవలెను. అప్పుడు (32-15) 17 అక్షరములు మిగులును. తాళప్రారంభము నుండి 17 అక్షరముల కాలము గడచిన అనంతరము ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించినచో సమగ్రహమున గీత ప్రారంభస్థానమువరకు (తాళాంతమునకు) సరిపోవును. ఈ ముక్తాయిని దిగువపథకములో నిరూపించుచున్నాము.

## —• సమగ్రహ ముక్తాయి పథకము •—

### ఆదితాళము చిత్రతరమార్గము

| ఆవర్తములు | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠికవ్రేలు | అనామిక | మధ్యమ వ్రేలు | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| 1 | , , , , | , , , , | , , , , | , , , , | , తధిగి | ణత తధి | గిణ తత | ధిగిణత |
| 2 | దే , వ | , , దే | , వ , ప్ర | సీ , ద | మే , , | , , , గో | , పాల | కృష్ణ, |
| 3 | దే , వ | , , దే | , వ , , | , , , , | , తధిగి | ణత తధి | గిణ తత | ధిగిణత |
| | దే , వ | , , దే | , వ , , | | | | | |

పై పల్లవి సమగ్రహములో నున్నది. 17 అక్షరముల కాలము గడచు నప్పటికి లఘువు పూర్తిఅయి మొదటి ద్రుతమునందు ప్రథమ హస్తక్రియలో

ఒక అక్షరకాలము గడచిన అనంతరము ముక్తాయి ప్రారంభమయి తాళావర్తాంత మునకు సరిపోయినది. అయిదుఅక్షరముల ఖండముక్తాయిని పైన ఉదహరించితిమి. పై మార్గమున 'తక తధి గిణత' అను మిశ్ర ముక్తాయిని తాళ ప్రారంభమునుండి 11 అక్షరముల కాలము గడచిన అనంతరమును, కిట తక తధిగిణత. అను సంకీర్ణ ముక్తాయిని తాళప్రారంభమునుండి అయిదు అక్షరముల కాలము గడచిన అనంతరమును, ప్రారంభించి అనుష్ఠించినచో తాళాంతమునకు సరిపోవును. ఇతర ముక్తాయిలనుగూడ ఈ గ్రహమున ఇదేవిధముగ ననుష్ఠించవలయును.

## అధికాక్షర ముక్తాయి లక్షణము

ముక్తాయిని ముమ్మారు ఉచ్చరించునప్పుడు ఏర్పడే అక్షరముల మొత్తము తాళావర్తాక్షరములకు మించియుండునప్పుడు అట్టి ముక్తాయి అక్షరములను ఆవర్తాక్షరములచే భాగించచలెను. శేషము రానిచో తాళ ప్రారంభమునుండి ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన సమగ్రహమునకు సరిపోవును. ఒక ఆవర్తము అనంతరముగాని, కొన్ని ఆవర్తముల అనంతరముగాని, ముక్తాయి పూర్తియగును. ఇందు ఆవర్తముల సంఖ్య ముక్తాయి అక్షరముల ననుసరించియుండును.

ముక్తాయి, ఆవర్తాక్షరములకు మించియున్నపుడు ముక్తాయి అక్షరములకు ఆవర్తాక్షరములు మించియుండునంతవరకు మొదటి ఆవర్తమునకు అదనముగా నొక్కొక్క ఆవర్తమును కలుపుకొనుచుండవలయును. ఈ విధమున కలుపగా ఏర్పడు మొత్తములో ముక్తాయి అక్షరములను తీసివేయవలెను. అప్పుడు ఎన్ని అక్షరములు మిగులునో తాళప్రారంభమునుండి అన్ని అక్షరములకాలము గడచినతరువాత ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన సమగ్రహమునకు సరిపోవును.

## అధికాక్షర సమగ్రహ సమ ముక్తాయి
### ఆదితాళము-చిత్రతర మార్గము

1. తాధిమి తరికిట తకఝుణు ఝుంతరి కిటతక తళంగు తకతధి గిణతొం.
2. తాధిమి తరికిట తకఝుణు ఝుంతరి కిటతక తళంగు తకతధి గిణతొం.
3. తాధిమి తరికిట తకఝుణు ఝుంతరి కిటతక తళంగు తకతధి గిణతొం.

32 అక్షరములు గల యీ ముక్తాయిని ఆదితాళమున చిత్రతరమార్గములో తాళ ప్రారంభమునుండి ముమ్మారు ఉచ్చరించిన మూడు ఆవర్తములకు సరి పోవును. తాళమునకు పూర్తిగా సరిపోయినందున సమ ముక్తాయి యనబడినది. ముక్తాయిలందు అక్షరమనగా హ్రిస్వాక్షరమని తెలియవలెను. గుర్వాక్షరమును రెండు లఘ్వాక్షరములుగా నెంచవలయును.

అధికాక్షర సమగ్రహ శేష ముక్తాయి లక్షణము

'ఝుంతరి కిట తక తళంగు తక తధిగిణతొం' ఇరువది అక్షరములు గల యీ ముక్తాయిని ముమ్మారు ఉచ్చరించిన 20 × 3=60 అక్షరములగును. ఆదితాళ మునకు చిత్రతరమార్గమున ఆవర్తమునకు 32 అక్షరములుండును. ముక్తాయి అక్షరములు (60) ఆవర్తాక్షరములకు మించియున్నందున ఆవర్తాక్షరములకు మరొక ఆవర్తమును కలుపవలెను. అప్పుడు రెండు ఆవర్తములు కలిసి 32 × 32= 64 అక్షరములగును. ఈ అక్షరములలో 60 ముక్తాయి అక్షరములను తీసివేయ వలయును. అప్పుడు (64-60=)4 అక్షరములు మిగులును. తాళ ప్రారంభము నుండి నాలుగు అక్షరముల కాలము గడచినతరువాత ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన ఆవర్తమును, మరొక ఆవర్తమును పూర్తియై మూడవ ఆవర్త ప్రారంభమగు సమగ్రహమునకు సరిపోవును. ఈ పద్ధతియందు తాళ ప్రారంభము నుండి ముక్తాయి ప్రారంభింపబడక కొంత తాళము గడచిన వెనుక ప్రారంభింపబడి నందున శేషముక్తాయి అనబడినది.

ఇందు మరొక పద్ధతి

ఆవర్తాక్షరములతో ముక్తాయి అక్షరములను భాగించునప్పుడు శేషము వచ్చినయెడల అట్టి ముక్తాయి శేషాక్షరములను ఆవర్తమందుగల అక్షరములలో తీసివేయవలెను. అప్పుడు ఎన్ని అక్షరములు మిగులునో తాళప్రారంభమునుండి అన్ని అక్షరముల కాలము గడచినవెనుక ముక్తాయిని ప్రారంభించిన సమగ్రహ మునకు సరిపోవును.

ఉదాహరణము:—

ఝుంతరి కిటతక తళంగు తక తధిగిణతొం

ఈ ముక్తాయి యందు 20 అక్షరములు గలవు. దీనిని ముక్తాయించు నప్పుడు 60 అక్షరములగును. ఈ సంఖ్యను ఆవర్తాక్షరములగు 32 చే భాగించిన (60÷32=) 28 అక్షరములు మిగులును. ఈ అక్షరములను ఒక ఆ వర్తాక్షరము లగు 32 లో తీసివేసినచో (32-28) 4 అక్షరములు మిగులును. తాళప్రారంభ మునుండి నాలుగక్షరముల కాలము గడచిన తరువాత యీముక్తాయిని ప్రారంభించిన యెడల ప్రారంభించిన ఆవర్తము పూర్తిఅయి రెండవ ఆవర్తాంతము నకు సరిపోవును. ఈ చెప్పబడిన రెండు పద్ధతులలో నేపద్ధతియందయినను లెక్క చూచుకొనవచ్చును. దీనిని దిగువ పథకములో నిరూపించుచున్నాము.

### అధికాక్షర సమగ్రహ శేషముక్తా పథకము.

### ఆదితాళము – చిత్రతరమార్గము

| ఆవర్తసంఖ్య | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠిక వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| 1 | , , , , | ఝంతరి | కిట తక | తళంగు | తక తధి | గిణ తోం | ఝంతరి | కిట తక |
| 2 | తళంగు | తక తధి | గిణ తోం | ఝంతరి | కిట తక | తళంగు | తక తధి | గిణ తోం |
| 3 | బాల , | గోపా | ల, మా | ముద్ధ , | ర , , , | , , గో | పాల, | కృష్ణ, |

ఈ పై పథకములో మూడవ ఆవర్తమున తాళప్రారంభమునుండి గీతము ప్రారంభింపబడినది.

### ముక్తాయి త్రికాల లక్షణము.

ముక్తాయి అక్షరములలో పై కాలాక్షరములు ఉండక అన్నియు సమకాలాక్షరములుగ నున్నచో ముక్తాయిని త్రికాలములలో ముక్తాయించుటకు నవకాశముండును. ముక్తాయి యందు కొన్ని పై కాలాక్షరము లున్నచో అట్టి ముక్తాయిని రెండవ కాలమువరకు ముక్తాయించ వచ్చును.

ముక్తాయిలో నుండు హ్రస్వాక్షరమును ప్రథమ కాలము నందు అక్షర (అర శెకండు) కాలములోను రెండవ కాలమందు చతుర్భాగ (పావు శెకండు) కాలము లోను మూడవ కాలమందు కళా (పరక శెకండు) కాలములోను ఉచ్చరించ వలయును. అప్పుడు క్రియ యందు లఘ్వక్షరములకు రెండు రెట్లు చతుర్భాగాక్షరములను, నాలుగు రెట్లు కళాక్షరములను ఉచ్చరించ వలయును. ముక్తాయి యందలి గుర్వక్షరములను రెండు లఘ్వక్షరముల కాలములో నుచ్చరించవలెను. దీర్ఘాక్షరములు, ద్విత్వాక్షరములు, బిందుయుక్తములు ఇవి గుర్వక్షరములని తెలియవలెను. దీర్ఘాక్షరము బిందు యుతమైన దైనచో దానిని మూడు అక్షరముల కాలములో నుచ్చరించవలెను.

ఉదాహరణము:-

గీతము ఆదితాళములో చిత్రతర మార్గమున నడచునప్పుడు 'ఝుంతరి కిట తక తళంగు తక దధిగిణతొం' అను 20 అక్షరముల ముక్తాయిని ప్రథమకాలములో ముక్తాయించు విధమును పైన నిరూపించి యున్నాము. రెండవ కాలములో వినియోగించు కొనునప్పుడు ఈ ముక్తాయిని ముమ్మారు ఉచ్చరించు నప్పటికి అరువది అక్షరములలో సగమగు ముప్పది అక్షరముల కాలమునకు సరిపోవును. ఇందు తాళావర్తాక్షరములకు రెండక్షరములు తరుగుగా నున్నందున తాళము రెండక్షరముల కాలము గడచిన వెనుక నీ ముక్తాయిని ప్రారంభించి రెండవ కాలములో ననుష్ఠించిన ఆవర్తాంతమునకు సరిపోవును. మూడవ కాలమందు యీ ముక్తాయి అక్షరములు 60 అక్షరములలో నాలుగవ వంతు కాలమునకు సరిపోవును. అనగా 15 అక్షరములకాలము. ఆ వర్తాక్షరములలో ఈ ముక్తాయి అక్షరములను తీసి వేసిన (32–15) 17 అక్షరములు మిగులును. తాళ ప్రారంభము నుండి 17 అక్షరముల కాలము గడచిన వెనుక ఈ ముక్తాయిని ప్రారంభించి మూడవ కాలములో ననుష్ఠించిన ఆవర్తాంతమునకు సరిపోవును. ఈ మూడు కాలములను దిగువ పథకములో నిరూపించుచున్నాము.

## ముక్తాయి త్రికాలపథకము

### ఆదితాళము చిత్రతరమార్గము - సమగ్రహము.

| కాలములు | లఘువు | | | | ద్రుతము | | దృతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠిక వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| ప్రథమ కాలము | , , , , తళంగు | ఝుంతరి తక తధి | కిట తక గిణ తోం | తళంగు ఝుంతరి | తక తధి కిట తక | గిణ తోం తళంగు | ఝుంతరి తక తధి | కిట తక గిణ తోం |
| ద్వితీయ కాలము | , , ఝుంతరి | { కిట తక / తళంగు | { తక తధి / గిణతోం | { ఝుంతరి / కిట తక | { తళంగు / తక తధి | { గిణతోం / ఝుంతరి | { కిట తక / తళంగు | { తక తధి / గిణతోం |
| తృతీయ కాలము | , , , , | , , , , | , , , , | , , , , | , { ఝుంతరి / కిట తక / తళంగు | { తక తధి / గిణతోం / ఝుంతరి / కిట తక | { తళంగు / తక తధి / గిణతోం / ఝుంతరి | { కిట తక / తళంగు / తక తధి / గిణతోం |

పై పథకమునందుగల (,) కామాగుర్తులు అక్షరకాలములు. కామాలస్థానము గీతము నడచుకాలము. ప్రథమకాలమున ముక్తాయి రెండావర్తములలో సరిపోయినది. రెండుమూడు కాలములలో ఒక్కొక్క ఆవర్తములోనే సరిపోయినది.

### పై కాలాక్షరములుగల ముక్తాయి.

'ధిత్తా కిటతక తధిగిణ తోం' అను ఈ ముక్తాయియందు పదునాలుగు అక్షరములున్నను కిటతక అను అక్షరములు నాలుగు పై కాలములో నున్నందున అవి రెండక్షరకాలములో ననుష్ఠించబడుచున్నవి. అందువలన 12 అక్షరములైనవి. (త్తా) అక్షరము దీర్ఘాక్షరమునందు ద్విత్వాక్షరమైనందున మూడక్షరములుగా లెక్కించబడినది.

ఆదితాళమున చిత్రతర మార్గమునందు సమగ్రహమునకు వినియోగించుకొనునప్పుడు ఈ ముక్తాయిని ప్రథమ కాలములో తాళావర్తముయొక్క తుది

హస్తక్రియ ప్రారంభమునుండి అనుష్ఠించినచో రెండవ ఆవర్తాంతమునకు సరి పోవును.

రెండవ కాలమందు తాళము 14 అక్షరముల కాలము గడచిన అనంత రము అనగా లఘువుయొక్క నాలుగవ క్రియయగు మధ్యమ వ్రేలిలో రెండక్షర ముల కాలము గడచిన తరువాత ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన ఆవర్తాం తమునకు సరిపోవును. ప్రథమ కాలమున కిటతక అని పై కాలములో ననుష్ఠించ బడిన అక్షరములను ఈ రెండవ కాలమునందు (కిటతక) మూడవకాలములో వినియోగించు కొనవలయును. ఈ పద్ధతిని దిగువ పథకములో నిరూపించు చున్నాము.

## పైకాలాక్షరముక్తాయి పథకము.

### ఆదితాళము - చిత్రతరమార్గము - సమగ్రహము.

| కాలములు | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | చిటికెన వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| 1 | , , , , కిట తక తధి | , , , , గిణ తోం | , , , , ధిత్తా | , , , , కిట తక తధి | , , , , గిణతోం | , , , , ధిత్తా | , , , , కిట తక తధి | ధిత్తా గిణతోం |
| 2 | , , , , | , , , , | , , , , | , , ధిత్తా | కిటతకతధి గిణ తోం | ధిత్తా కిటతక తధి | గిణ తోం ధి త్తా | కిటతకతధి గిణ తోం |

మూడవ కాలమునకు రెండు గీట్లను, రెండవ కాలమునకు ఒక గీటును గుర్తుకొరకు అక్షరముల క్రింద నుంచితిమి. [,] ఈ కామా గుర్తులు గీతము లేక వాద్యము నడచుకాలము. కామాల స్థానములో కొనుగోలు చేయుట కూడ కలదు. కొనుగోలు అనగా నోటితో వాద్యాక్షరములను అనుష్ఠించుట. ఇంతటి తో ఈ సమగ్రహ ముక్తాయి లక్షణమును ముగించుచున్నాము.

# 2. అనాగత గ్రహ ముక్తాయి లక్షణము

తాళావర్తక్రియలను మార్గాక్షరములచే గుణించి అందు అనాగతగ్రహాక్షరములను కలిపి ఆ మొత్తములో ముక్తాయి అక్షరముల మొత్తమును తీసివేయగా ఎన్ని అక్షరములు మిగులునో తాళప్రారంభమునుండి అన్ని అక్షరముల కాలము గడచిన తరువాత ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన అనాగత గ్రహమునకు సరిపోవును.

'ఝుంతరి కిటతక తళంగు తకతధి గిణ తొం'అను ఇరువదిఅక్షరములుగల శబ్దమును ముక్తాయించు నప్పుడు 60 అక్షరములగును. ఆదితాళములో చిత్రతర మార్గమున మూడు అక్షరముల కాలము గడచిన పిమ్మట గీతము ప్రారంభమగునప్పుడు మూడు అక్షరముల అనాగత గ్రహమనబడును. తాళావర్తము నందుగల 8 క్రియలను చిత్రతర మార్గాక్షరములయిన 4 చే గుణించిన [8×4] 32 ఆవర్తాక్షరములగును. దీనికి గ్రహాక్షరములగు మూటిని కలిపిన [32+3] 35 అక్షరములగును. ముక్తాయి అక్షరములకంటె ఈ సంఖ్య తక్కువగా నున్నందున అధికాక్షర ముక్తాయి లక్షణమందు చెప్పబడినప్రకారము ఈసంఖ్యకు మరియొక ఆవర్తాక్షరములను కలుపవలయును. అప్పుడు మొత్తము [35+32]=67 అక్షరము లగును. ఈ మొత్తములో ముక్తాయి అక్షరములను తీసివేయగా [67-60] 7 అక్షరములు మిగులును. తాళప్రారంభమునుండి 7 అక్షరముల కాలము గడచిన అనంతరము పైముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన ప్రారంభించిన ఆవర్తముగాక యింకొక ఆవర్తమున్నూ పూర్తి అయి మూడవ ఆవర్తములో అనాగత గ్రహస్థానమగు మూడు అక్షరముల వరకు సరిపోవును. ఇది ప్రథమకాలము.

రెండవకాలములో ఈముక్తాయి 30 అక్షరముల కాలమునకే సరిపోవును. క్రియకు ఎనిమిది చతుర్భాగాక్షరముల వంతున నడచును. ప్రథమ కాలమందు ఒక అక్షరమునకుగల కాలములో రెండవ కాలమునందు రెండక్షరములు నడచును. ఆవర్తాక్షరములలో అనాగత గ్రహాక్షరములను కలిపిన [32,+3] 35 అక్షరములగును. రెండవ కాలమునందు ముక్తాయి 30 అక్షరములకే సరి

పోవును కాబట్టి 35 అక్షరములకు మరొక ఆవర్తాక్షరములను కలుప నక్కరలేదు. ఈ సంఖ్యలో ముక్తాయి అక్షరములను తీసి వేయగా (35–30) 5 అక్షరములు మిగులును. తాళప్రారంభమునుండి అయిదుఅక్షరములకాలము గడచినతరువాత ముక్తాయిని ప్రారంభించి రెండవకాలములో అనుష్ఠించిన ఆవర్తము పూర్తి అయి రెండవ ఆవర్త ప్రారంభమునగల అనాగత గ్రహమగు మూడక్షరముల వరకు సరిపోవును.

మూడవకాలమునందు 15 అక్షరములలోననే ఈముక్తాయి సరిపోవును. క్రియకు పదియారు కళాక్షరముల వంతున నడచును. ప్రథమ కాలమందలి ఒక అక్షరమునకు ఈకాలమునందు నాలుగు అక్షరములు నాలుగు కళాకాలములలో అనుష్ఠించబడును. ఆవర్తాక్షరములతో గ్రహాక్షరములను కలుపగా 35 అక్షరము లయినవి. దీనిలో ముక్తాయి అక్షరములు 15 తీసివేయగా [35–15]20 అక్షర ములు మిగులును. తాళప్రారంభమునుండి 20 అక్షరముల కాలము గడచిన అనంతరము ముక్తాయిని ప్రారంభించి మూడవ కాలములో ననుష్ఠించిన ఆవర్త ము పూర్తిఅయి రెండవ ఆవర్త ప్రారంభమున అనాగత గ్రహమగు మూడక్ష రముల కాలము వరకు సరిపోవును.

పై ముక్తాయి యందు రెండు, మూడు కాలములలోగల చతుర్భాగ కళాక్షరములను అక్షరముల లోనికి [అణాలను రూపాయలుగా మార్చుకొను విధమున] మార్చుకొని వ్యవహరించవలెను. అప్పుడు ప్రథమ కాలములో 60 అక్షరములు గల ముక్తాయి రెండు, మూడు కాలములలో క్రమముగా 30, 15 అక్షరములు అర్ధార్ధ న్యాయములో నగుచున్నవి. ఇకముందు రాబోవు గ్రహములలో గూడ ఇదేవిధమున గ్రహించవలయును.

ఈ గ్రహమునందు చెప్పబడిన ముక్తాయిలను, ఉక్తప్రకారముగాగాని వెనుక సమగ్రహమున అధికాక్షర ముక్తాయి లక్షణమునందు రెండవ పద్ధతిలో చెప్పబడిన ప్రకారముగాగాని సరిపెట్టుకొనవచ్చును. పైలక్షణమును దిగువ పథకములో నిరూపించుచున్నాము.

## అనాగత గ్రహ ముక్తాయి త్రికాల పథకము.

### ఆదితాళము – చిత్రతర మార్గము.

| కాలములు | లఘువు | | | | ద్రుతము | | దృతము | | ఆవర్తములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠిక వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ఘాత | ఉసి | ఘాత | ఉసి | |
| 1 | , , , ,<br>ట తక త<br>ణ తో౦- | , , ; ఝం<br>ళంగు త | , తరికి<br>క తధి గి | ట తక త<br>ణతో౦ఝం | ళంగు త<br>, తరి కి | క తధి గి<br>ట తక త | ణతో౦ఝం<br>ళంగు త | , తరి కి<br>క తధి గి | 1<br>2<br>3 |
| 2 | , , , ,<br>తధి గిణ<br>తో౦-, | , ఝంతరి<br>కిట } | తకతళంగు<br>తక } | తధిగిణతో౦<br>ఝం | తరి కిట<br>తక తళం } | ; గు తక<br>తధి గిణ } | తో౦ ఝం<br>తరి కిట } | తకతళంగు<br>తక } | 1<br>2 |
| 3 | , , , ,<br>తళంగు<br>తక తధి<br>గిణ తో౦ | , , , , | , , , , | , , , , | , , , , | ఝంతరి<br>కిట తక<br>తళంగు<br>తక తధి } | గిణతో౦<br>ఝంతరి<br>కిటతక<br>తళంగు } | తక తధి<br>గిణతో౦<br>ఝంతరి<br>కిటతక } | 1 |

పైపథకములో ప్రథమకాలమున ముక్తాయి, రెండావర్తములకు తరువాత మూడవ ఆవర్త ప్రారంభముననను, రెండవ కాలమునందు రెండవ ఆవర్త ప్రారంభముననను, మూడవ కాలమునందు రెండవ ఆవర్త ప్రారంభముననను గ్రహస్థానము వరకు సరిపోయినది. ప్రథమ కాలమున లఘువులో కనిష్ఠిక వ్రేలునందు మూడక్షరముల కాలమునకు తరువాత, రెండవ కాలమున లఘువులో కనిష్ఠిక వ్రేలునందు ఒక అక్షరకాలమునకు తరువాత, మూడవకాలమున మొదటిద్రుతము

యొక్క ఉసియొక్క ప్రారంభము నుండియు ముక్తాయి ఆరంభింపబడినది. ఈ (,) కామాగుర్తులు గీతము నడచు కాలము. ఈ (–) గుర్తు గీత ప్రారంభస్థానము. అనగా గ్రహస్థానము. (;) ఈ గుర్తు పూర్వ గుర్వక్షరమునుండి వచ్చిన అక్షర కాలము పూర్వక్రియలో 'శం' అను గుర్వక్షరములో నుండి ఒక అక్షరకాలమును తరువాత క్రియలో వినియోగించుకొనవలెను. రెండవకాలమున ఒకగీటును, మూడవ కాలమున రెండుగీట్లును అక్షరముల క్రిందగుర్తు కొరకుంచబడినవి. ఒకటి రెండు మూడు కాలములలోని అక్షరములను క్రమముగ ఒకదానియందుకంటె మరొక దానియందు రెట్టింపు తొందరగా ననుష్ఠించ వలయును.

## 3. అతీత గ్రహ ముక్తాయి లక్షణము

తాళా వర్త క్రియలను మార్గాక్షరములచే గుణించి ఆమొత్తము నుండి అతీత గ్రహాక్షరములను ముక్తాయి అక్షరములను క్రమముగ తీసివేసిన ఎన్ని అక్షరములు మిగులునో తాళ ప్రారంభము నుండి అన్ని అక్షరముల కాలము గడచిన అనంతరము ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన యెడల అతీత గ్రహమునకు సరిపోవును.

ఉదాహరణము:-

ఆదితాళములో చిత్రతర మార్గమున మూడు అక్షరములు అతీత గ్రహమైనప్పుడు తాళాంత్య క్రియలో ఒక అక్షర కాలము తాళము గడచిన తరువాత గీతము ప్రారంభమగును. గ్రహస్థానము మొదలు ఆవర్తాంతము వరకు మూడక్షరముల కాలము గీతము నడచును. తాళావర్త క్రియలగు 8. ని చిత్రతర మార్గాక్షరములగు 4. చేగుణించిన (8×4) 32 ఆవర్తాక్షరములగును. ఇందు అతీతగ్రహాక్షరములను మూటిని ఝుంతరి కిట తక తళంగు తక తధిగిణతొం అను శబ్దమును ముక్తాయించునప్పుడు ఏర్పడే 60 అక్షరములను మొత్తము 63 అక్షరములను తీసివేయ వలెను. ఈ అక్షరములు ఆవర్తాక్షరములకు మించి యున్నందున లోగా చెప్పబడిన 'అధికాక్షర' న్యాయము ప్రకారము ఆవర్తాక్షరములకు మరొక ఆవ

ఆవర్తాక్షరములను కలుపవలయును. అప్పుడు(32+32)64అక్షరములగును.ఇచ్చట మరొక విషయము గుర్తుంచుకొన దగును. ఏమన ఒక వేళ రెండవ ఆవర్తమును కలిపినప్పుడు కూడ ఆవర్తాక్షరముల కంటె ముక్తాయి అక్షరములు మిగిలి యున్నచో ముక్తాయి అక్షరములకు మించునంత వరకు ఆవర్తాక్షరములకు ఒక్కొక్క ఆవర్తమును కలుపు చుండవలయును. ఇప్పుడు రెండావర్తములలో ననే ముక్తాయి అక్షరములకు మించి నందున యిక ఆవర్తమును కలుప నక్కర లేదు. ఆవర్తాక్షరములలో అతీత గ్రహాక్షరములను ముక్తాయి అక్షరములను కలుపగావచ్చిన మొత్తమును తీసివేసిన (64-63) 1 అక్షరము మిగులును. తాళప్రారంభము నుండి ఒక అక్షర కాలము గడచిన తరువాత ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన ఆవర్తము పూర్తి అయి రెండవ ఆవర్తాంతమున గల అతీత గ్రహ స్థానము వరకు సరిపోవును.

రెండవ కాలములో ముక్తాయి అక్షరములు ప్రథమ కాలాక్షరముల సంఖ్యలో సగమగును. అనగా 30 అక్షరములు. వీనికి అతీత గ్రహాక్షరములను కలుపగా ఆవర్తాక్షరములకు ముప్పది రెంటికి మించి యున్నందున ఈ కాలములో కూడ ఆవర్తాక్షరములకు మరొక ఆవర్తాక్షరములను కలుప వలెను. అప్పుడు 64 అక్షరములగును. వీనిలో అతీత గ్రహాక్షరములను, ముక్తాయి అక్షరములను కలుపగా వచ్చిన మొత్తమును తీసివేసిన (64-33) 31 అక్షరములు మిగులును. తాళ ప్రారంభము నుండి 31 అక్షరముల కాలము గడచిన తరువాత ముక్తాయిని ప్రారంభించి రెండవకాలములో ననుష్ఠించిన ఆవర్తము పూర్తి అయి రెండవ ఆవర్తమున గల అతీత గ్రహము వరకు సరిపోవును.

మూడవ కాలమున ఈ ముక్తాయి రెండవ కాలాక్షరముల సంఖ్యలో సగమగు 15 అక్షరముల కాలములో సరిపోవును. అతీత గ్రహాక్షరములను, ఈ ముక్తాయి అక్షరములను కలిపిన (3+15=) 18అక్షరములగును. ఆవర్తాక్షరములకు ఈ సంఖ్య మించి యుండ నందున మరొక ఆవర్తమును కలుప నక్కరలేదు. ఆవర్తాక్షరములలో ఈమొత్తమును తీసివేసిన (32-18=) 14 అక్షరములుమిగులును. తాళ ప్రారంభమునుండి 14అక్షరముల కాలము గడచిన తరువాత ముక్తాయినిప్రారంభించి మూడవకాలములో అనుష్ఠించిన అతీతగ్రహమునకుసరిపోవును.

ప్రథమ కాలములో క్రియకు (4) అక్షరములును, రెండవ కాలములో క్రియకు 8 చతుర్భాగ కాలాక్షరములును, మూడవ కాలములో క్రియకు 16 కళా కాలాక్షరములును నడచును. పైముక్తాయిని దిగువపథకములో నిరూపించు చున్నాము.

# అతీత గ్రహ ముక్తాయి త్రికాల పథకము

## ఆదితాళము–చిత్రతరమార్గము

| కాలములు | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | | ఆవర్తములు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | చిటికెన వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ఘాత | ఉసి | ఘాత | ఉసి | |
| 1 | , ఝుంత<br>గు తక త | రి కిట త<br>ధి గిణతొం | క తళం<br>; ఝుంత | గు తక త<br>రికిట త | ధిగిణ తొం<br>క తళం | ; ఝుంత<br>గు తక త | రికిటత<br>ధిగిణతొం | కతళం<br>;—,, | 1<br>2 |
| 2 | , , , ,<br>తరి కిట<br>తక తళం | , , , ,<br>; గు తక<br>తధి గిణ | , , , ,<br>తొం ఝుం<br>తరి కిట | , , , ,<br>తక తళం<br>గుతక | , , , ,<br>తధిగిణ<br>తొంఝుం | , , , ,<br>తరి కిట<br>తక తళం | , , , ,<br>; గు తక<br>తధి గిణ | , , ,ఝుం<br>తొం—,, | 1<br>2 |
| 3 | , , , , | , , , , | , , , , | ,, ఝుం<br>తరికిటతక | తళంగు<br>తక తధి<br>గిణతొం<br>ఝుంతరి | కిట తక<br>తళంగు<br>తక తధి<br>గిణతొం | ఝుంతరి<br>కిట తక<br>తళంగు<br>తక తధి | గిణ తొం<br>—,, | 1 |

పై పథకములో (,) ఈ కామా గుర్తులు గీతము నడచుకాలము. (;) ఈ గుర్తు పూర్వ క్రియలోని గుర్వక్షరము నుండి రెండవ క్రియలోనికి వచ్చిన ఒక మాత్రా కాలము. ఇది ప్రథమ కాలమున అక్షరకాలమును, రెండవ కాలమున చతుర్భాగాక్షరకాలమును తెలుపును. (–) ఈ గుర్తు గ్రహస్థానము అనగా గీత ప్రారంభస్థానము. అక్షరముల క్రింది గీట్లను వెనుకటి వలెనే గ్రహించవలెను. ({) ఈ గుర్తులోని అక్షరములన్నియు ఒక క్రియలోనివి.

## విషమసమ, విషమవిషమ గ్రహముక్తాయి లక్షణము

విషమసమ, విషమవిషమ గ్రహములలో ముక్తాయిలను తాళావర్తము నందుగల క్రియలలో రెండవ క్రియలోగాని, రెండవక్రియ మొదలు మొత్తము ఆవర్తమునందు సగమునకు లోగాగాని గ్రహస్థాన మెచ్చట నున్నను అనాగత గ్రహమునకు వలెనే అనుష్ఠించవలయును. ఆ వర్తములో సగమునకు మించి తాళాంత్యక్రియలోగా ఎచ్చటనైనను లేక తాళాంత్య క్రియలో నైనను గ్రహ స్థానమైన యెడల అతీత గ్రహమునకు వలె అనుష్ఠించవలయును.

అనాగత గ్రహమునకువలె అనుష్ఠించునప్పుడు తాళావర్తక్రియలను మార్గాక్షరములతో గుణించి వచ్చిన మొత్తమునకు తాళ ప్రారంభము నుండి గీత ప్రారంభము వరకు అనగా గ్రహస్థానము వరకు గల అక్షరములను కలుప వలయును. ఈ మొత్తములో ముక్తాయి అక్షరములను తీసివేయగా ఎన్ని అక్షర ములు మిగులునో తాళప్రారంభమునుండి అన్ని అక్షరముల కాలము గడచిన అనంతరము ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించుచో గ్రహస్థానము వరకు సరి పోవును.

అతీత గ్రహమువలె అనుష్ఠించునప్పుడు తాళావర్త క్రియలను మార్గా క్షరములతో గుణించి అట్టి మొత్తములో గీతప్రారంభ స్థానము మొదలు తాళా వర్తాంతమువరకు గల అక్షరములను ముక్తాయి అక్షరములను కలుపగా వచ్చిన మొత్తమును తీసివేయగా ఎన్ని అక్షరములు మిగులునో తాళప్రారంమునుండి అన్ని అక్షరముల కాలము గడచిన తరువాత ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠిం చిన గ్రహస్థానమునకు సరిపోవును.

ఈ రెండు పద్ధతుల యందును గ్రహాక్షరములు, ముక్తాయి అక్షరములు కలుపగా వచ్చిన మొత్తము ఆవర్తాక్షరములకు మించియున్నచో ఈ మొత్తము నకు ఆవర్తాక్షరములు మించునంతవరకు ఒక్కొక్క ఆవర్తాక్షర సంఖ్యను కలుపు చుండవలెను.

## ప్రథమ పద్ధతికి ఉదాహరణము

'తధిగిణత' అను శబ్దమును ముక్తాయించునప్పుడు 15 అక్షరములగును. ఆదితాళమునకు చిత్రతరమార్గమునందు 32 ఆవర్తాక్షరములుండును. తాళము నందు లఘువులో మూడవ క్రియ ప్రారంభమున గ్రహస్థానమైనప్పుడు విషమ సమమగును. మూడవ క్రియ అనామికవ్రేలు. ఈ క్రియను ప్రారంభించునంతవరకు ఎనిమిది అక్షరముల కాలము తాళము గడచినది. తాళావర్తాక్షరములగు 32 అక్షరములకు తాళమునందు గడచిన 8 అక్షరములను కలుపవలయును. అప్పుడు 32+8=40 అక్షరములగును. ఇందు పై ముక్తాయి అక్షరములను తీసివేయగా (40–15)25 అక్షరములు మిగులును. తాళప్రారంభమునుండి 25 అక్షరముల కాలము గడచినపిమ్మట ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన విషమసమ గ్రహ స్థానమునకు సరిపోవును. అప్పుడు ముక్తాయితాళమునందు రెండవద్రుతముయొక్క ప్రథమ క్రియలో ఒక అక్షరకాలము గడచిన అనంతరము ప్రారంభింపబడును.

ఆదితాళమునందు చిత్రతర మార్గమున తాళ ప్రారంభమునుండి మూడవ క్రియలో రెండక్షరముల కాలము గడచిన పిమ్మట గీతమును ప్రారంభించిన విషమ విషమ గ్రహమగును. దీనిని పైన చెప్పిన విధమున ఆవర్తనముకుగల 32 అక్షర ములలో తాళ ప్రారంభమునుండి గీత ప్రారంభ (గ్రహ) స్థానము వరకుగల 10 అక్షరములను కలుప వలయును. అప్పుడు 32+10–42 అక్షరములగును, ఇందు ముక్తాయి అక్షరములను తీసివేయగా (42–15)27 అక్షరములు మిగులును. తాళ ప్రారంభమునుండి 27 అక్షరముల కాలము గడచిన పిమ్మట ముక్తాయిని ప్రారం భించి అనుష్ఠించిన విషమవిషమ గ్రహస్థానమునకు సరిపోవును.

## రెండవ పద్ధతికి ఉదాహరణము

ఆదితాళమునందు రెండవ ద్రుతముయొక్క ఘాతప్రారంభములో గీతము ప్రారంభమైనచో విషమ సమగ్రహమగును.

ఈ తాళమందు చిత్రతర మార్గములో అవర్తాక్షరములు (8×4) 32 ఉం డును. గీత ప్రారంభ స్థానమునుండి ఆవర్తాంతము వరకుగల 8 అక్షరములలో ముక్తాయి అక్షరములను కలిపిన 8×15=23 అక్షరములగును. ఈ మొత్తమును

ఆవర్తాక్షరములలో తీసివేయగా (32-23) 9 అక్షరములు మిగులును. తాళప్రారంభము నుండి 9 అక్షరముల కాలము గడచిన పిమ్మట ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన విషమసమ గ్రహస్థానమునకు సరిపోవును.

ఈ తాళమందు పై గ్రహస్థానమైన రెండవ ద్రుతములో రెండు అక్షరములకాలము గడచిన అనంతరము గీత ప్రారంభస్థానమైనచో విషమవిషమ గ్రహమగును. అప్పుడు గ్రహస్థానము మొదలు ఆవర్తాంతము వరకు 6 అక్షరములుండును. వీటికి ముక్తాయి అక్షరములను కలిపిన 6×15=21 అక్షరములగును. ఈ మొత్తమును ఆవర్తాక్షరములలో తీసివేయగా (32-21) 11 అక్షరములు మిగులును. తాళప్రారంభమునుండి 11 అక్షరముల కాలము గడచిన అనంతరము ముక్తాయిని ప్రారంభించి అనుష్ఠించిన విషమవిషమ గ్రహస్థానమునకు సరిపోవును.

పై రెండు పద్ధతులను దిగువ పథకములో నిరూపించుచున్నాము.

విషమసమ, విషమ విషమగ్రహ ముక్తాయిల పథకము

ఆదితాళము. చిత్రతర మార్గము

| గ్రహములు | | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | ఘాత | కనిష్ఠిక వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ఘాత | విసి | ఘాత | విసి |
| మొదటి పద్ధతి | విషమసమ గ్రహము | , , , , | , , , , | , , , , | , , , , | , , , , | , , , , | , తధిగి | ణత తధి |
| | | గిణ తత | ధిగిణత | ; | | | | | |
| | విషమవిషమ గ్రహము | , , , , | , , , , | , , , , | , , , , | , , , , | , , , , | , , , త | ధిగిణ త |
| | | తధి గిణ | తత ధిగి | ణత ; , | | | | | |
| రెండవ పద్ధతి | విషమసమ గ్రహము | , , , , | , , , , | , తధి గి | ణత తధి | గిణ త త | ధిగి ణత | ; , , , | , , , , |
| | విషమవిషమ గ్రహము | , , , , | , , , , | , , , త | ధిగి ణత | తధి గిణ | త తధిగి | ణత ; , | , , , , |

పై పథకమునందు (,) ఈకామాగుర్తులు గీతము నడచు కాలము. (;) ఈ గుర్తు గీతప్రారంభస్థానము. అనగా గ్రహస్థానము వెనుక చెప్పిన విధముగనే ఈ గ్రహములందు గూడ ముక్తాయిలను త్రికాలములలో అనుష్ఠించనగును.

చౌకకాలములలో ముక్తాయించుట

గీతము నడచుకాలమునకంటె చౌక కాలములలో సందర్భానుసారముగ ముక్తాయిలను అనుష్ఠించవచ్చును. ఈ కాల నియమములను వెనుక జెప్పబడిన విధానము ప్రకారము వినియోగించుకొనవలెను.

కాని ఈ పద్ధతిలో ఒకప్పుడు ముక్తాయి అంతమందు అనగా గ్రహస్థానము వద్ద అక్షరమునకు క్రియాసంధి కలుగును. క్రియాసంధి యనగా రెండు క్రియలను ఒక అక్షరమునకు గల కాలముతో కలుపుట. ఇట్లు కలిపినప్పుడు ముక్తాయి సమాప్తియైన తరువాత గీత ప్రారంభ స్థానమునకు లోగా ఒక క్రియను అనుష్ఠించవలసి వచ్చును. సమాప్తి స్థానమును గుర్తింప జేయుట ముక్తాయియొక్క ప్రయోజనమైనప్పుడు చౌకకాల ముక్తాయిలను యుక్తమార్గములందు మాత్రమే అనుష్ఠించదగును. లోగా చెప్పబడిన నియమముల ననుసరించి అట్టిమార్గములను తెలియదగును.

ఈ పద్ధతియందు గీతము నడచు కాలములో బేసి అక్షరములుగల గ్రహస్థాన మైనచో క్రియలన్నియు అక్షరసంధిలో నుండును. అప్పుడు ముక్తాయి అక్షరములు వెనుకటి క్రియతో అంతమై తుది అక్షరముమీదనుండు ఒక అక్షరకాలము మాత్రమే రెండవక్రియకు మిగులును. గీత కాలమున కంటె చౌక కాలములో ముక్తాయి నడచునప్పుడు ఒక్కొక్క అక్షరము రెండేసి కళా, చతుర్భాగ, అక్షర కాలముల లోననేగాక నాలుగేసి అక్షరముల కాలములో కూడ ననుష్ఠించుట సంభవించును. అప్పుడు పై పద్ధతియందు ముక్తాయి తుది అక్షరమందు గల సగము కాలముగాని, మూడువంతుల కాలముగాని రెండవ క్రియకు వచ్చును. ఇట్లే తాళక్రియ లన్నియు అక్షర సంధిలో నుండును. ఈ పద్ధతుల ననుష్ఠించు వారు ముక్తాయి మనోహరముగనుండి సుందర గమనముగలదిగా నుండదగునని తెలియదగును. పై పద్ధతిని 'తధిగిణత' అను అయిదక్షరముల ముక్తాయితో దిగువ పథకము నందుదహరించుచున్నాము.

## చౌకకాల క్రియాసంధి ముక్తాయి పథకము
## ఆదితాళము - చిత్రతర మార్గము - విషమ విషమ గ్రహము

| | లఘువు | | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | చిటికెన వ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| 1 | . . . . | . . . త | , ది , గి | , ణ , త | , త , ది | , గి , ణ | , త , త | , ది , గి |
| | , ణ , త | , ; . . | | | | | | |

పై పథకములో ( . ) గుర్తు గీతమునడచుకాలము. ( , ) ఈ కామాగుర్తు ముక్తాయి అక్షరములమీాది మాత్రాకాలము. అనగా లఘ్వక్షర కాలము. (;) ఈ గుర్తు గ్రహస్థానము. ఇందు అయిదు అక్షరములు గ్రిహము. ప్రథమావర్తములో రెండవ క్రియలో నాలుగవ అక్షరముతో ముక్తాయి ప్రారంభమయి రెండేసి అక్షరములకు ఒక్కొక్క అక్షరము చొప్పున అనుష్ఠించుచూరాగా రెండవ ఆవర్తములో ప్రథమ క్రియయొక్క నాలుగవ అక్షర స్థానములలో ముక్తాయియొక్క తుది అక్షరమగు (త) అనుష్ఠించబడి (త) మీాది మరొక మాత్రాకాలమును కూడ కలుపుకొనిననే గాని జాగా (గ్రహమున)కు సరిపోలేదు. (స్థానము)

ఈపద్ధతియందు లఘ్వక్షరమును నాలుగు అక్షరముల కాలము వరకు విళంబముగ ననుష్ఠించుచూ వచ్చిన ముక్తాయి తుది అక్షరమునకు తరువాత మూడక్షరముల కాలము మానానుష్ఠానముతోనుండి అనంతరము గీతమును ప్రారంభించవలసి యుండును. ముక్తాయి మధ్యమందు కొన్ని అక్షరములను విళంబముగ ననుష్ఠించిన దోషములేదు. కాని తుది అక్షరములను ఈవిధముగ విళంబ కాలములో ననుష్ఠించకూడదు. కాబట్టి తుది క్రియ సంధి కలుగు ముక్తాయిల ననుష్ఠించకూడదు. అనుష్ఠించిన రక్తి లోపించును. రక్తి లోపించినచో తాళము యొక్క ప్రయోజనమునకు భంగము గలుగును. అప్పుడు ముక్తాయివచ్చి మొదటికి మోసము తెచ్చినదగును. అందువలన తాళప్రయోజనమునకు భంగము కలుగకుండునటుల ముక్తాయిలననుష్ఠించ వలయును.

## అక్షరకాలము చ్యుతమగుట

గీతము క్రియకు నాలుగు అక్షరముల వంతున చిత్రతరమార్గములో నడచు చుండ ఈనాలుగక్షరముల కాలము లోననే క్రియకు మూడక్షరముల వంతున అనుష్ఠించుచు కొందరు ముక్తాయిలను సరిపెట్టుచున్నారు. కాలము సరిపోయి నట్లుగనే యుండును. ఈ విధముగ ననుష్ఠించుటకు శాస్త్రము సమ్మతించదు. గణితమునకు కూడ సరిపోదు. కాల నిర్ణయమునకు అనర్థకము కలుగును. శాస్త్రము నిజమార్గమును మాత్రిమే నిరూపించును. చిత్రతర మార్గమున క్రియకు నాలుగు అక్షరముల వంతున గీతము నడచునప్పుడు ఆదితాళములో లఘువుయొక్క తుది క్రియయగు మధ్యమవ్రేలితో ప్రారంభించి క్రియకు మూడక్షరముల వంతున 'తధి గిణత' అను ముక్తాయిని ఆవర్తాంతమునకు సరిపెట్టి సమగ్రహమున గీతమును ప్రారంభించుచున్నారు. న్యాయపద్ధతియందు ప్రథమ ద్రుత ప్రారంభములో ఒక అక్షరకాలము గడచిన తరువాత యీ ముక్తాయిని ప్రారంభించి ప్రారంభక్రియలో మూడక్షరములనుతరువాత క్రియకు నాలుగక్షరములవంతున అనుష్ఠించుచూఆవర్తాంతమునకు సరిపెట్టవలయును. కావున క్రియకు మూడక్షరముల వంతున నాలుగక్షరముల కాలములో ననుష్ఠించిన అక్షరకాలము చ్యుతమగును. అందువలన ఈపద్ధతి శాస్త్రనిషిద్ధ మైనదని తెలియదగును.

## త్రి కా ల శ బ్ద ము

శబ్దమునుగాని, స్వరమునుగాని త్రికాలములలో ననుష్ఠించి గ్రహస్థానమునకు సరిపెట్టుట త్రికాల ముక్తాయిలుగ నేడు వ్యవహరించుచున్నారు.

తాళప్రారంభమునుండి ముక్తాయిని ప్రథమ పర్యాయము ప్రథమ కాలములోను, రెండవ పర్యాయము రెండవ కాలములోను, మూడవ పర్యాయము మూడవ కాలములోను మున్నారు అనుష్ఠించుచూ ఆవర్తాంతమునకు సరిపెట్టి సమగ్రహములో గీతమును ప్రారంభించుటను త్రికాల ముక్తాయిగ వ్యవహరించుచున్నారు. శబ్దమునుగాని, స్వరమునుగాని ఈ విధముగ అనుష్ఠించుట దోషము కానేరదు. కాని దీనిని ముక్తాయియని వ్యవహరించ కూడదు. అందుకొరకు వినియోగించను కూడదు. ముక్తాయికి ఒక

నియమమును విధించిన అనంతరము తిరిగి మరొక విధముగ సమన్వయము జేయ నెంచుట ఉత్తమముకాదు. దీని నొకవిధముగ స్వరానుష్ఠానము లోననో శబ్దా (వాద్యా) నుష్ఠానములోననో జేర్చుకొన దగును. దీనిని త్రికాల శబ్దమనిగాని లేక స్వరమనిగాని వ్యవహరించుట యుక్తము. ఈపద్ధతిని వాద్యాక్షరములగు శబ్దముతో నిందుదహరించుచున్నాము. స్వరములను కూడ యిదే విధమున వినియోగించుకొనవలెను. ఈ త్రికాల పద్ధతులు మూడు విధములుగానున్నవి.

## మొదటి విధము

శబ్దము నందలి లఘ్వక్షరములను నాలుగుచే భాగించిన శేషము మిగులనిచో అట్టి శబ్దమును త్రికాలములుగా ననుష్ఠించవలెను. ఇచ్చట శబ్దమనగా వాద్యాక్షరముల సముదాయము. శబ్దాక్షరములను నాలుగుచే భాగించగా వచ్చిన లబ్ధ సంఖ్యతో సమానమగు క్రియలుగల తాళములో క్రియకు ఏడేసి అక్షరముల వంతునగాని, శబ్దాక్షరములను భాగించగా వచ్చిన లబ్ధసంఖ్యతో సమానమగు అక్షరములను ఒక్కొక్క క్రియకు నిలుపుచు ఏడుక్రియలుగల తాళమునుగాని అనుష్ఠించిన తాళప్రారంభమునుండి ఆవర్తాంతము వరకు సరిపోవును.

ఉదాహరణము:—

'తరికిట తక తధి గిణతొం' అనునది 12 అక్షరముల శబ్దము ప్రథమకాలమునందు యిది 12 అక్షరముల కాలములో అనుష్ఠించబడుచున్నది. రెండవ కాలమున 6 అక్షరముల కాలములోనను, మూడవ కాలమున 3 అక్షరముల కాలములోనను యీ 12 అక్షరములను వినియోగించు కొనవలెను. అప్పుడు రెండవ కాలమున అక్షర కాలములో రెండక్షరములు ఒక్కొక్కటి చతుర్భాగ కాలము వంతునను, మూడవ కాలమున అక్షర కాలములో నాలుగు అక్షరములు ఒక్కొక్కటి కళాకాలము వంతునను అనుష్ఠించబడును. మూడు కాలములలోనను యీ శబ్దమునకు మొత్తము 12+6+3=21 అక్షర కాలములు ఏర్పడినవి. ప్రథమకాల

లఘ్వక్షరములగు 12 ను నాలుగుచే భాగించిన 3 లబ్ధము వచ్చును. ఈమాటిచే ఈశబ్దముయొక్క త్రికాలాక్షరములగు 21 ని భాగించిన 7 లబ్ధమువచ్చును. కాబట్టి ఏడు క్రియలుగల ఏ తాళములోనైనను క్రియకు మూడేసి అక్షరకాలముల వంతున నిలిపిన ఈశబ్దము త్రికాలములలో తాళావర్తముతో ప్రారంభమై ఆవర్తాంతమునకు సరిపోవును. లేక మూడు క్రియలు గల ఏతాళములోనైనను క్రియకు 7 అక్షరకాలముల వంతున నిలిపిన త్రికాలములలో తాళావర్తముతో ప్రారంభమై ఆవర్తాంతమునకు సరిపోవును. అనగా ఏడు క్రియలుగల తాళములో త్రిశ్రమార్గమునగాని, మూడు క్రియలుగల తాళములో మిశ్రమార్గమునగాని తాళావర్తముతో ప్రారంభమై ఆ వర్తాంతమునకు సరిపోవును. ఈ రెండు మార్గములను దిగువ పథకములలో నిరూపించుచున్నాము.

## త్రికాల శబ్ద పథకములు

### మొదటివిధము - మొదటిపథకము

### త్రిపుటతాళము-త్రిశ్రజాతి-త్రిశ్రమార్గము

### సమగ్రహము

| ఆవర్త సం | లఘువు | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠిక ్రవేలు | అనామిక | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| | త రి కి | ట త క | త ధి గి | ణ తోం | తరి కిట తక | తధిగిణతోం | తరికిట తక తధిగిణతోం |

అక్షరములక్రింది గీట్లను వెనుకటివలెనే గ్రహించవలెను.

# త్రికాల శబ్ద పథకము

## మొదటివిధము–రెండవ పథకము

### ఏకతాళము–త్రిశ్రజాతి–మిశ్రమార్గము

### సమగ్రహము

| సం | లఘువు | | |
|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠిక వ్రేలు | అనామిక |
| 1 | తరికిట తకత | ధిగిణ తొం తరి కిట | తక తధి గిణ తొం తరికిట<br>తకతధి గిణతొం |

అక్షరముల క్రింది గీట్లను వెనుకటివలెనే తెలియవలెను.

### రెండవ విధానము

శబ్దము నందలి మాత్రా (లఘ్వక్షరముల) సంఖ్యను నాలుగుచే భాగించి నప్పుడు నిశ్శేషముకానిచో ఆశబ్దము త్రికాలములుగ తాళాది నుండి తాళాంత మునకు ఒక ఆవర్తమునకు గాని లేక కొన్ని ఆవర్తములకు గాని సరిపోదు. అందు వలన నాలుగుచేత భాగించిన నిశ్శేషమగుటకుగాను ఆ సంఖ్యకు చేరునంతవరకు అట్టి శబ్దము నందలి మాత్రా కాలమును వృద్ధి చేయవలయును. ఒకప్పుడు ద్విగుణించిన సరిపోవును. ఒకప్పుడు నాలుగు రెట్లు వృద్ధి చేయవలసియుండును. వృద్ధి చేయుట యన శబ్దమునందలి లఘ్వక్షరమును రెండు లేక నాలుగు అక్షరముల కాలములో ననుష్ఠించుట. ఆ దామాషా ప్రకారము గురుప్లుతాక్షరములను విని యోగించుకొనుట. ఆవిధముగ కాలము పెంపు జేయబడిన శబ్దమును ప్రథమ కాలముగ నిర్ణయించుకొని అందలి మాత్రా సంఖ్యలో సగము కాలములో ఆశబ్దమును అనుష్ఠించుట రెండవకాలము. నాలుగవ వంతుకాలములో ఆశబ్ద మును అనుష్ఠించుట మూడవ కాలము. ఈ పద్ధతిలో మూడవ కాలమునందు

ఒకప్పుడు శబ్దమునందలి అక్షరములను యథాప్రకారముగను, ఒకప్పుడు చతుర్భాగాక్షరములుగను అనుష్ఠించుట సంభవించును. మూడవ కాలమునందలి యథాక్షరముల సంఖ్యతో సమానమగు క్రియలు గల తాళములోగాని, మూడవ కాలమునందలి చతుర్భాగాక్షరముల సంఖ్యతో సమానమగు క్రియలు గల తాళములో గాని లేక ఏడుక్రియలుగల తాళములో గాని తాళప్రారంభము నుండి ఆవర్తాంతము వరకు శబ్దము త్రికాలములలో ననుష్ఠించిన సరిపోవును.

ఉదాహరణము:

"తధిగిణత" అను శబ్దమునందలి అక్షరములను నాలుగుచే భాగించిన నిశ్శేషము కావు. కాబట్టి ఈ శబ్దముయొక్క మాత్రాకాలమును నాలుగుచేత గుణించవలయును. రెంటిచేత గుణించిన చాలదాయను సంశయము కలుగవచ్చును. రెంటిచేత గుణించగా వచ్చిన మొత్తము నాలుగుచేతభాగింపబడదుగాన నాలుగు చేతనే గుణించవలయును.

నాలుగుచేత గుణించగా 5×4=20 అక్షరముల కాలమగును. ఈ కాలములో "తధిగిణత" అను అయిదు అక్షరములను ఒక్కొక్క అక్షరము నాలుగు అక్షరముల కాలము వంతున అనుష్ఠించుట ప్రథమకాలము. ఇందులో సగమైన 10 అక్షరముల కాలములో 'తధిగిణత' అను అక్షరములను ఒక్కొక్క దానిని రెండేసి అక్షర కాలముల వంతున అనుష్ఠించుట రెండవ కాలము. ఇందులో సగము కాలమైన 5 అక్షరముల కాలములో యథాప్రకారముగ తధిగిణత, అను అయిదు అక్షరములను అనుష్ఠించుట మూడవ కాలము. మూడు కాలములలోనను మొత్తము (20+10+5)35 అక్షర కాలములుండును. అసలు శబ్దమునందు అయిదు అక్షరము లున్నవి, నాలుగురెట్లు పెంపుజేయగా ఏర్పడిన 20 అక్షర కాలములను నాలుగుచే భాగించగా అయిదు లబ్ధము వచ్చును. ఈ అయిదు క్రియలుగల యేతాళములో నైనను పై శబ్దమును త్రికాలముగ అనుష్ఠించనగునని తెలియవలెను. అప్పుడు త్రికాలముల మొత్తము అక్షరసంఖ్యయగు 35ను 5 చే భాగించగా క్రియకు 7 అక్షరకాలములయినవి. అనగా మిశ్రమార్గము. ఏడు క్రియలు గల తాళములో వినియోగించు కొనునప్పుడు 35ను 7 చే భాగించ

వలయును. అప్పుడు 5 లబ్ధము వచ్చును. కాబట్టి క్రియకు అయిదేసి అక్షరకాలముల వంతున ఖండమార్గముగా ననుష్ఠించవలయును. ఈ రెండు మార్గములను రెండు తాళములలో దిగువ పథకమునందు నిరూపించుచున్నాము.

# త్రికాలశబ్ద పథకము

రెండవవిధము—మొదటిపథకము

త్రిపుటతాళము-త్రిశ్రజాతి-ఖండమార్గము

సమగ్రహము

| | లఘువు | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠికవ్రేలు | అనామిక | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| 1 | త , , , ధి | , , , గి , | , , ణ , , | , త , , , | త, ధి, గి | , ణ , త , | తధిగిణత |

# త్రికాలశబ్ద పథకము

రెండవ విధము-రెండవ పథకము

ఏకతాళము-ఖండజాతి- మిశ్రమార్గము

సమగ్రహము

| ఆ. సం. | లఘువు | | | | |
|---|---|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠికవ్రేలు | అనామిక వ్రేలు | మధ్యమ వ్రేలు | తర్జనీవ్రేలు |
| 1 | త , , , ధి , , | , గి , , , ణ , | , , త , , , త | , ధి , గి, ణ , | త , తధిగిణత |

పై రెండు పథకములలోను (,) గుర్తు పూర్వాక్షరము మీది రాగకాలము. ఈ కాలమును మానానుష్ఠానముగ నోటి కొనుగోలునందు వినియోగించుకొనుచున్నారు. ఇది చర్మవాద్యములందు విశ్రాంతి కాలము.

### మూడవ విధము

శబ్దము నందలి మాత్రా కాలమును రెట్టించగా వచ్చిన మొత్తము నాలుగు చేత నిశ్శేషముగ భాగింపబడుచో నట్టి శబ్దమును ప్రథమమున నాలుగుచేత గుణించనక్కరలేదు. నాలుగుచేత నిశ్శేషముగ భాగింపబడని సరి సంఖ్యలను రెట్టించిన ఆ మొత్తము నాలుగుచేత నిశ్శేషముగ భాగింపబడును. బేసి సంఖ్య గల శబ్దమును మాత్రము ఈ త్రికాల పద్ధతియందు నాలుగుచేత గుణించకత ప్పదు. ఒకపర్యాయము రెట్టించిన నాలుగుచేత నిశ్శేషముగ భాగింపబడు సమా క్షర శబ్దమునకు–

ఉదాహరణము :

తరికిటతక అను 6 అక్షరముల శబ్దమును రెట్టించిన 12 అక్షరముల కాల మగును. దీనిని నాలుగుచేత భాగించిన నిశ్శేషమగును. ఇందు ప్రథమకాలమున ఒక్కొక్క అక్షరమును రెండుమాత్రల (అక్షరముల) కాలములోనను, రెండవ కాలమందు యథాప్రకారము అక్షరకాలములోనను, మూడవకాలమునందు చతుర్భాగాక్షర కాలములోనను అనుష్ఠించ వలెను. దీనికి మొత్తము 12+6+3 = 21 అక్షర కాలములు. ఇక తక్కిన విధానమును మొదటి విధాన మునందు చెప్పబడిన ప్రకారము తెలియవలెను. దీనిని దిగువ పథకములందు నిరూపించుచున్నాము.

## త్రికాలశబ్ద పథకము

మూడవ విధము–మొదటిపథకము

త్రిపుటతాళము–త్రిశ్రజాతి–త్రిశ్రమార్గము

సమగ్రహము

| ఆ. సం | లఘువు | | | ద్రుతము | | ద్రుతము | |
|---|---|---|---|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠికవ్రేలు | అనామిక వ్రేలు | ఘాత | ఉసి | ఘాత | ఉసి |
| 1 | త , రి | , కి , | ట , త | . , క , | త రి కి | ట త క | తరికిటతక |

పై పథకములో అక్షరములక్రింది గీటును వెనుకటి వలెనే తెలియవలెను. దీనిని మిశ్ర మార్గములో దిగువ పథకమునందు నిరూపించుచున్నాము.

# త్రికాలశబ్ద పథకము

## మూడవ విధము–రెండవ పథకము

### ఏకతాళము–త్రిశ్రజాతి–మిశ్రమార్గము

| | లఘువు | | |
|---|---|---|---|
| | ఘాత | కనిష్ఠిక వేళ్లు | అనామిక వేళ్లు |
| 1 | త , రి , కి , ట | , త , క , త రి | కి ట త క <u>తరి</u> <u>కిట</u> <u>తక</u> |

ఈ పథకమునందు గూడ అక్షరములక్రింది గీటును వెనుకటి వలెనే తెలియవలెను.

పైన వివరించిన త్రికాల విధానము లన్నియు గీత మార్గమున కనుకూల మగునటుల వినియోగించు కొనదగును ఈ విధముగ శబ్దములను వినియోగించు కొనుట కొరకు గాను గీతమార్గమును మార్పుచేయకూడదు. ఆ పద్ధతి నిషిద్ధమై నదని వెనుకనే చెప్పబడినది.

# జాతి ముక్తాయిలు

చతురశ్ర–త్రిశ్ర–మిశ్ర–ఖండ–సంకీర్ణ–జాతులలో ముక్తాయించు పద్ధతి యొకటి కలదు. ఈ అయిదు జాతులను ఒకదానితో తక్కిన వాటిని ప్రస్తరించిన (5×5)=25 జాతులగును. ఈ జాతులలోని ముక్తాయిలు జాతిముక్తాయిలనబడును. ఒక్కొక్కజాతి ప్రస్తారమునందలి ముక్తాయిలను దిగువ నుదహరించుచున్నాము. ఇవి లఘుజాతుల సంఖ్యలలో నున్నందున వీటికి యీ వ్యవహారమేర్పడినది.

## అయిదు జాతుల ముక్తాయిలు.

| | | | | |
|---|---|---|---|---|
| 1 చతురశ్ర జాతి | = | తధిమిత | = | 4 |
| 2 త్రిశ్ర జాతి | | తకిట | | 3 |
| 3 మిశ్ర జాతి | | తకతధిగిణత | | 7 |
| 4 ఖండ జాతి | | తధిగిణత | | 5 |
| 5 సంకీర్ణ జాతి | = | కిటతకతధిగిణత | = | 9 |

## ప్రస్తార జాతులు

### 1. చతురశ్రి ప్రస్తారము

| | | | |
|---|---|---|---|
| 1. చతురశ్ర+చతురశ్రి | =తకతక+తధిమిత | = | 4+4= 8 |
| 2. చతురశ్ర+త్రిశ్ర | =తరికిట+తధిమి | = | 4+3= 7 |
| 3. చతురశ్ర+మిశ్రి | =తరికిట+తక తధిగిణత | = | 4+7=11 |
| 4. చతురశ్ర+ఖండ | =తరికిట+తక ధిమిత | = | 4+5= 9 |
| 5. చతురశ్ర+సంకీర్ణ | =తధిమిత+కిట తక తక ఝుణుత | = | 4+9=13 |

### 2. త్రిశ్రి ప్రస్తారము

| | | | |
|---|---|---|---|
| 1. త్రిశ్రి +చతురశ్ర | =తకిట +తధిమిత | = | 3+4= 7 |
| 2. త్రిశ్రి +త్రిశ్రి | తకిట +ధిమిత | | 3+3= 6 |
| 3. త్రిశ్రి +మిశ్రి | తకిట +తకధిమి ఝుణుత | | 3+7=10 |
| 4. త్రిశ్రి +ఖండ | తకిట +తకధిమిత | | 3+5= 8 |
| 5. త్రిశ్రి +సంకీర్ణ | =తకిట +కిటతక తధిగిణత | = | 3+9=12 |

### 3. మిశ్రి ప్రస్తారము

| | | | |
|---|---|---|---|
| 1. మిశ్రి +చతురశ్ర | =తకతక తకిట +తధిమిత | = | 7+4=11 |
| 2. మిశ్రి +త్రిశ్రి | =తకతక తకిట +ధిమిత | = | 7+3=10 |
| 3. మిశ్రి +మిశ్రి | =తకతక తకిట +త తకత ధిమిత | = | 7+7=14 |
| 4. మిశ్రి +ఖండ | =త తకత ధిమిత+తధిగిణత | = | 7+5=12 |
| 5. మిశ్రి +సంకీర్ణ | =త తకత ధిమిత+కిటతక తధిగిణత | = | 7+9=16 |

### 4. ఖండ ప్రస్తారము

1. ఖండ+చతురశ్ర =తకిట తక+తధిమిత = 5+4= 9
2. ఖండ+తిశ్రి తకిట తక+ధిమిత 5+3= 8
3. ఖండ+మిశ్రి తకిట తక+తక తధిగిణత 5+7=12
4. ఖండ+ఖండ తకిట తక+తధిగిణత 5+5=10
5. ఖండ+సంకీర్ణ = తకిట తక+కిటతక తకధిమిత 5+9=14

### సంకీర్ణ ప్రస్తారము

1. సంకీర్ణ+చతురశ్ర =కిటతక తధిగిణత+తధిమిత = 9+4=13
2. సంకీర్ణ+తిశ్రి కిటతక తధిగిణత+ధిమిత = 9+3=12
3. సంకీర్ణ+మిశ్రి కిటతక తధిగిణత+తక తధిగిణత = 9+7=16
4. సంకీర్ణ+ఖండ కిటతక తధిగిణత+తధిగిణత = 9+5=14
5. సంకీర్ణ+సంకీర్ణ = కిటతక తధిగిణత+ధిమి తకత ఝుణుతత =9+9=18

పై ప్రస్తారములందు తకతకాది లఘ్వక్షరముల నుదహరించితిమి. వానిని సందర్భానుసారము మార్చుకొని హ్రస్వ దీర్ఘాదిమార్పులతో వినియోగించుకొనవచ్చును. లోగడ వివరించినప్రకారము ఈ ముక్తాయిలనుగూడ వినియోగించుకొనవలెను.

## మరికొన్ని ముక్తాయిలు

1. తద్ధిత్తకణక తక తధిగిణతోం 16×3=48
2. తత్తరితకణం తక తధిగిణతోం 16×3=48
3. తక తరికిట తక తధిగిణతోం 14×3=42
4. తకధికితక తధిగిణతోం 12×3=36
5. తాక్కిటకిట తకతక తధిగిణతోం 16×3=48
6. దిత్తళంగు తకధికితక తధిగిణతోం 18×3=54
7. ఝుంతరి కిటతక తళంగు తకధికి తక తధిగిణతోం 24×3=72
8. ఝుంతరి కిటతక తళంగు తక తధిగిణతోం 20×3=60

| | |
|---|---|
| 9. తధిమితకిట తకఝుణు తక తధిగిణతొం | 18 × 3 = 54 |
| 10. తాధిమి తకతకఝుణు తక తధిగిణతొం | 18 × 3 = 54 |
| 11. తద్ధీనుత ఝుంతరి ధిమితక తధిగిణతొం | 20 × 3 = 60 |
| 12. తత్త్రితా ఝుణు తక తరికిట తక తధిగిణతొం | 22 × 3 = 66 |
| 13. దిత్త్ళాంగు తకధికితక తధిగిణతొం | 19 × 3 = 57 |
| 14. ఝుంతరికిటతక తళాంగుతకధికి తకతధిగిణతొం | 25 × 3 = 75 |
| 15. తత్త్రితాఝుణు తక తరికిట తక తధిగిణతొం | 22 × 3 = 66 |
| 16. తత్త్రికిటతక తకఝుణు తక తధిగిణతొం | 20 × 3 = 60 |
| 17. త , త్త్కిట తక తకఝుణు తక తధిగిణతొం | 20 × 3 = 60 |
| 18. తక తరికిటఝుణుతా తక తధిగిణతొం | 18 × 3 = 54 |
| 19. తాకిటతక ధణ ధిమి ఝుణు తక తధిగిణతొం | 20 × 3 = 60 |
| 20. తధిమి తకిట ధికిత ఝుణుతక తక తధిగిణతొం | 21 × 3 = 63 |
| 21. తత్త్రాఝుంతరి కిటతక తద్ధిమితక తధిగిణతొం | 24 × 3 = 72 |
| 22. తళంగు తొంతక తరికిటతక తధిగిణతొం | 20 × 3 = 60 |
| 23. తాం తధిమికిట తకఝుణు తక తధిగిణతొం | 20 × 3 = 60 |
| 24. తాం, తధిగిణ త తాం, తధిగిణ త తాం, తధిగిణత తధిగిణత తధిగిణత | 37 × 3 = 111 |
| 25. ఝుం, తరికిట త ఝుం, తరికిట త ఝుం, తరికిటత తరికిటత తరికిటత | 34 × 3 = 102 |
| 26. తాం ఝుం, తధిగిణత తాం ఝుం, తధిగిణత తాం ఝుం, తధిగిణత తధిగిణత తధిగిణత | 43 × 3 = 129 |
| 27. తధిమితతకిట ఝుణత ధిమికిట తఝుణు ధిమితా, తధిగిణత తధిగిణత తధిగిణత | 37 × 3 = 111 |
| 28. ధిమిత ఝుణు ధిమిత ఝుణు ధిమిత ఝుణు ధిమితా, తధిగిణత తధిగిణత తధిగిణత | 35 × 3 = 105 |
| 29. తద్ధిత్త్రాకిట ఝుంతరితా ,, తకధిత్త్రాకిట ఝుంతరితా ,, తకఝుంతరితా ,, తధింగిణతొం తధింగిణతొం తధింగిణతొం | 63 × 3 = 189 |

30. ఝుణుత ధిమిత తకతా, ధణాంధిమితా, ఝుణు త తా ,,
తధిగిణత తధిగిణత తధిగిణత $41 \times 3 = 123$

31. తా ,, ఝుణుతా ,, తధిగిణత తధిగిణత తధిగిణత $26 \times 3 = 78$

32. తాహత ఝుంతరితా, త ఝుంతరితా, త ఝుం తధిమిత కిటతక
తకధికి తధిగిణతొం తకధికి తధిగిణతొం తకధికి తధిగిణతొం $60 \times 3 = 180$

33. తాహత ఝుంతరితా, త ఝుంతరితా, తఝుం తధిమితకిట
త తా, ఝుం, తధిగిణత తా, ఝుం, తధిగిణత తా, ఝుం,
తధిగిణత తధిగిణత తధిగిణత $72 \times 3 = 216$

34. తాహత ఝుంతరితా, త ఝుంతరితా, తఝుం తధిమితకిట
తకతక తఝుణుత తధిగిణతొం తక త ఝుణుత తధిగిణతొం
తక త ఝుణుత తధిగిణతొం $66 \times 3 = 198$

ఇట్లే ముక్తాయిలను ప్రస్తరించుకొని అనుష్ఠించవలెను. ఇందలి కామా గుర్తులను మానానుష్ఠానముతోగాని పూర్వాక్షరము మీది (నాద)ముతోగాని వినియోగించుకొనవలెను, అక్షర బాహుళ్యముగల ముక్తాయిలను చర్మ వాద్య పరులు పల్లవులందుగాని మరి ఇతర సమయములందుగాని ప్రత్యేక వాద్యాను ష్ఠానముకొరకు అవకాశమును పొందునప్పుడు అనుష్ఠించదగును.

సంగీతమార్తాండము తాళాధ్యాయమునందు

చ తు ర్థ ప్ర క ర ణ ము

సంపూర్ణము.



శ్రీ

# దశావతారములు

త్రిపుటతాళము - (త్రిశ్ర)జాతి - చిత్రతమమార్గము - సమగ్రహము

## 1. మత్స్యావతారము

త,-గ్గధిం-,త=త్రాం-హాత=ధీ-నుత
త,-ద్ధీ - నుత=ధా - ణుధ=ణ్రాం - తరి
ధణ్రాం-, త-రిత=ధిమి-తఝుం=, త-రిత
తఝుం-, త-రిత=తఝుం-, ఝుం=, త-
రితతరి-తఝు-ణుత=ఝుం-తరి=త,-ద్ధణ
త,-ద్ధణాం-,త=ధిమి-తధ=ణ్రాం - ధిమి
తా-తధ-ణ్రాం=ధిమి - తకి=టత - ధిమి
త్రా-ధిమి-తక=కిట- తఝు=ణుత - తక
తక - కుణ-కకు=త, -క్కృ-ణా=తడి-కుకు
తడి-కుడి-డికు=డిడి - కుకు=ఢిం - కుకు
కుకుం-, త-రిత=కుకుం-తరి=త,-క్కృ-ణా,
త,-క్కృ-ణా - ణాగ=తకుం-తరి=కిణా - ణాగ
తకుం - దది-కుందద=తకుం-ద్రక్కృ=దికుం-
ద్రక్కృ-తది-మిత కిట=తక-తధి=మిత-కిట
మ,-త్సర-మున=మరి-యం=బుధి- లో
జొ,-చ్చియు-,న్న=సో - మకు=ద్రుం-
చియు-వి,-చ్చల-విడి,=వే- దము=లజు
సకు-ని, - చ్చితి - వా=మ,-త్స్యా=
వతా-,,రా-,,-,,=,,-,,=,,-,,

## 2. కూర్మావతారము

త, ఝ్ఝణు-తా=త, -గ్గధి=తకుందధి
గిణ-తఝు-ణుత=ధణ - ధిమి=తక-ధిమి
తఝు-ణుత-ధిమి=ధణ-తధి=మిత-ఝణు
తక-కుణ - కకు=ఝుం - తరి=త,-ద్ధణ
తధ-ణాత - ధిమి=ధణ - తధి=మిత తక
పలు-మరు మిను=ప్ర,-స్తుతి=సే-యుచు
చల - గిసు-రలు=జల - ధిమ=ధిం-పగ
కలి-మిబ-లిమి=యుల-మిలో-నొస-గిస
కుల-గిరి - ధర=కూ - ర్మా=వతా-,,
రా-,,-,,=,,-,,=,,"

## 3. వరాహావతారము

కుకుం-ధరి-కిట=ధరి-కిట=కిట - తక
కుం - ధరి - కిట=కుకుం-ధరి - కిట-తక
ధరి-కిట-తక=తకుం - ధరి - కిట - తక
కిట-తక-ఝణు=ఝణు-తక = తరి కిట
తరి - కిట -ధిమి=తక-తరి=కిట - ధిమి
స్థిర-ముగ - ధర=సురు - వడి=చే కొని
యుర-గప-ధను=యిర-వుకు=జొ,చ్చిన
హిర-,ణ్యా-క్షు=బరి-మా=ర్చితి-వొ
వర- సుగు-ణా=వరా-,హా=రూ - ,,
పా-,,-,,=,;-,,=,,-,,

## 4. నృసింహావతారము

దిం దిం ధిమి=ధణ=తఝు=ణుత=ధిమి
ధణ - ధిమి - కిట=ధిం - ధిం=ధిమి-కిట
ధిమి-ధిమి-కిట=ఝణు-త, - ద్ధిమి తక

తక–దిన–హత=ధిమి–తా=ఝుణు–.తా
దం–దం–ధణ=ఘా – ణుత=ధిం – కుకు
స్త్రం–భం–బున=వెడ–లియు=దా – నవ
డిం–భకు – గా=చితి – నౌ=, నృ సిం
హా–,,–,,=,,–,,=,,,–,

## 5. వామనావతారము

త, ద్ధణాం, త త్రాం హత ధీ నుత
ధీ–నుత–కిట=ఘణ–తఝు=ణుత – ధిమి–
తక–ధీ – నుత ఝుం–తరి = త, – ద్ధణ
త, – ద్ధణాం, త=కుం – దరి·త, – ద్ధణ
తాం–,ధి–మిత=తాం–, ఝు=ణుత–ధిమి
త్రాం–ఝుణు–కిటతక=త్రాం–తక=ధీ నుత
మా నుగ మూ=డడు–గులు=బలి – చే
దా – నను – గొను=వా–మన=రూ–,,
పా.

## 6. పరశురామావతారము

త్రాం–తరి–కిట=తరి–కిట=కిట – తక
తక – తరి – కిట=తరి – కిట=కిట – తక
ధిమి–తా–ఝుణు=తా – తరి=కిట – తక
తకు – కుది – కుకు=త, త్తకు కుది కుకు
ధరి–కిట–తక=ధిమి–తక=ఝుణు – త్రాం
కిటతక–తరికిట–తక=ఝుం – తరి=త, ద్ధ
తధ–ణత–ధిమి=ధిమి–తధ–ణత – ధిమి.
తాం, ఝు–ణుత=తాం–,ది=మిత – తక
తరి–తక–రిత=దిరుగ్గుడు–ద,–క్కిణ ణగ
తరి – మిత – రిమి=ధర–ణీ=పతు–లను
పర–శువు–చే=దును–మా = డితి – వౌ
వర–వీ–రప = రా – క్రమ = ముని ధర
బర – గితి–వౌ = భా – ర్గవ–రా ,,
మా–,,–,,=,,–,,=,,–,,

## 7. రఘురామావతారము

కిట–కిట–తక=త, –క్కిట = కిట–తక
తక్కిట్ట–కిట–తక=త్రాం–హత=ధిమి తక
దిమి–తక–త్రాం=దిన్న–కిట = తక – జం
దిన్న – కిట–తక = జం – జం–, త తక
జం – కుకు – జం = దిన్న–జం తకు జం
జగ జగ ణక జగ ణక రే కిణ
దశ రథ తన యుడవై సుర లకు
వశ–ముగా,ని=దశ–ముఖు–ద్రుం–చియు
విశ–దము–గన=మో–ధ్యకు=సీ – తత్రో
వేం చే – సితి = వౌ రఘు రా ,,
మా

## 8. బలరామావతారము

తా–ధిమి తక=తధి–మిత=కిట–తక–
దిన – కిట–తక = దిం – దిం = కిట తక–
తధి–మిత కిట = తక – ధికు=తడి–కుకు
తడి–కుడి–డికు = తడి–కుకు = డిం– కుకు
యా – దవ – వం=శా–బ్ధిను=ధా కరు
డా–ది దే–, వు = డను–జుడు = గా–ఘన
మో–ద ము–సగి=ఖలు – లను = ద్రుం–

చియు నే-దిని-భర = ముడి-పిన=బల-
రామా-,,-,.=,.-,,=,,-,,

## 9. బౌద్ధావతారము

తాం-,త-కిట=ఝుం-తరి=త, - ధ్ధణ ధణ-తధి-మిత=ధిమి-తధ = క్ర్రాం - ధిం ధిమి-ఝుం-తరి=త,- ధ్ధణ = తఝ్ఝం-తరి తఝం-, త రిత = ఝుం-తక = రే - కిణ రం-గుగ-పుర = క్రాం-తల=వ్రత-ముల భం-గప - రచి = తౌ-బా = ధ్ధవ-తా
రా-,,-,,=,,-,,=,,-,,

## 10. కల్క్యావతారము

త్రాం-తక - కిణ=తక-తధి=మిత-కిట ధిమి-తఝు-ణుత=ఝుణు-తత= కిట-తక కిటతక-తరికిట-తక=ఝుం-తరి=కిటతక-ఝుంతరి కిట-తక-డెక=కి, జ్జుట-కిటతక డెక ఘో-టక-మున నె=, - క్కి-దు రా త్ముల గీ-టడ-చెడు=క,-ల్క్యావ=తా,,
రా-,,-,,=,,-,,=,,-,,

## అంకితము

జక-ఝణ-కఝ = జే-జే = జక-కిట సురలు మే, ల్ = మే-లని = పొగ-డగ నిర-తము-నీ = దా-సుల=బ్రో - వ తె పర-గవ్యా, ఘు=పుర-మున=వెల-సిన వర-దరా-, జ = ఆ-శ్రిత=సుర - భో జా-పరా-, ఝ=తక - దధి=గిణ-తోం దిరుగుడు-తత-కిట=ఝుం-తరి-త, -ధ్ధణ ధణాం , ధి-మిత=ధిమి-తధ=క్ర్రాం-ధిమి దిరుగుడు-తత-కిట=తక-తత = కిట తక దిరుగుడు-తత-కిట=తక-దధి=గిణ-తోం

ఈ దశావతారముల పరిష్కరించి స్వకల్పితమైన శబ్దమును కొంత జేర్చి సులభముగ ప్రతివారును తెలిసికొని గానము చేయుటకుగాను త్రిశ్రజాతి త్రిపుటతాళములో ప్రస్తరించితిని. ఈ శబ్దమును మనోధర్మము ననుసరించి సరసముగ ననేకవిధముల ప్రస్తరించి గానము చేయవచ్చును.

కొండా శంకరయ్యగారి ప్రీమియర్ ముద్రాక్షరశాల, శికిందరాబాద్.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 8 | 17 | సంఖ్యల | సంఖ్యలను |
| 13 | 12 | అటతాళము | ఆటతాళములు |
| 14 | వి:- లో 5 | నాక | గాక |
| 16 | 4 | గుర్తించు | గుర్తుంచు |
| 18 | 11 | తాళమునందు | తాళములందు |
| 22 | 7 | వరుసక్రిమములో | క్రిమములో |
| 22 | 9 | డిటో | డిటో |
| 23 | 10 | నెంత కాలము | నెంత కాలములో |
| 24 | 4 | గాసమందు | గానమందు |
| 27 | 6 | ఉచ్చరించునప్పుచు | ఉచ్చరించునప్పుడు |
| 36 | 12 | 4 + 4- | 4 × 8 |
| 37 | 8 | మార్గములలో | మార్గతాళములలో |
| 38 | 10 | ఏకతాళ | ఏకకాల (మూడవ |
| 39 | 21 | వంతునమూడవ | వంతున ఉచ్చరించుట |
| 40 | 15 | యున్నవి | యున్నది. |
| 41 | 5 | ముప్పాతిక | ముక్కప్పాతిక |
| ,, | 7 | శెకండు | శెకండ్లు |
| 44 | 9 | అక్షరమున | అక్షరమును |
| 48 | | పథకమున దక్షిణమార్గమందు మూడవ కాలములో రెండుమూడు పంక్తులందు చివర ఒక్కొక్క కామాను తొలగించవలెను. | |
| 49 | 3 | చిత్రమార్గము | చిత్రతమమార్గము |
| ,, | 14 | అక్షరములకు | అక్షరములను |
| 50 | పథకము నందు | $\frac{1}{2}$ | $1\frac{1}{3}$ |
| ,, | ,, | $2\frac{1}{2}$ | $4\frac{1}{2}$ |
| 53 | 8 | తాళమునందు | తాళములందు |
| 56 | 8 | వ్యోమ | వ్యోమం |
| 59 | 3 | కాలమునరకే | కాలమువరకే |
| 60 | 11 | పాఠములు | పాఠకులు |
| ,, | 12 | యున్నవి | యున్నది |
| 61 | 18 | త్తానాంగుళ | త్తాళస్యాంగుళ |
| 62 | 1 | ద్విగుద్విగుణ | ద్విగుణద్విగుణ |
| 62 | 4 | అంగుళ | అంగుళముల |

| పేజి | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 62 | 12 | కుడిచేతి | కుడిచేతిని |
| 63 | 16 | పాటింపగ | పాటింపక |
| 64 | 8 | లందలి | నందలి |
| ,, | 16 | అసావధానములకు | అసావధానములను |
| ,, | 17 | సంగీతమును కొందరు | సంగీతమును కొందరు ప్రోత్సహింతురు కొం |
| ,, | 24 | ముపరిత్యజించి | మనుపరిత్యజించి (దరు |
| 66 | 13 | త్రేలు | వ్రేలు |
| 69 | పథకము సంకీర్ణ లఘువు లో | 224 | 228 |
| 71 | పథకము తిశ్ర గురువు లో | 123 | 192 |
| ,, | ,, | 64 | 96 |
| ,, | ,, | 45 | 48 |
| ,, | మిశ్ర గురువు నందు | 20 | 70 |
| 72 | పథకము దక్షిణ మా॥ నందు | 464 | 864 |
| | డిటో | 232 | 432 |
| ,, | వార్తిక మార్గ మునందు | 232 | 432 |
| ,, | ,, | 116 | 216 |
| ,, | డిటో చిత్రమార్గమునందు | 116 | 216 |

# తప్పొప్పుల పట్టిక.

| పేజి | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 72 | డిటో చిత్రమార్గము నందు | 58 | 108 |
| ,, | చిత్రేతర మార్గము నందు | 46 | 48 |
| 80 | 25 | (మాత్రాధిక్యంచ) | మాత్రాధిక్యంచ |
| 122 | 23 | సప్పటి | నప్పటి |
| 143 | 15 చివర | స్థానము | బ్రాకెట్టులోవున్న గ్రహమునకు తరువాత ఉండవలయును. |

దశావతారములలో మత్స్యావతారమందు 4, 13, 16, 17, 18, ఆవర్తములకు చివర ఉండవలసిన రిత దక్క, చియు,నకు, వతా- ,, అనునవి క్రమముగా 5, 14, 17, 18, 19, ఆవర్తముల మొదట చేరినవి.

6 వదియగు పరశురామావతారమందు 6వ ఆవర్తమ చివర 'ణ' అను అక్షరమును చేర్చుకొన వలెను. 9వ ఆవర్తమున మొదట 'తరితక' అను దానికి బదులు 'త:తత' అని పాఠము.

8 బలరామావ తారమున 7వ ఆవర్తమునకు చివర ఉండవలసిన 'చియు' అనునది 8 ఆవర్తము మొదట చేరినది.

10 కల్క్యావతారము నందు 3. ఆవర్తమునకు చివర ఉండవలసిన ఝంతరి అనునది 4వ ఆవర్తమున మొదటచేరినది. అంకితమున మొదటి ఆవర్తము తుదిఅక్షరము ట కు బదులు ణ ఉండవలయును. మూడవ ఆవర్తమందు చివర వలె అనుటకు బదులు వవె అనిపాఠము.

---

1 మొదలు 72 పేజీలవరకు భట్నాపల్లి శ్రీ శారదాముద్రాక్షరశాలయందును 73 మొ. 158 పే. వరకు [illegible] లయందును ముద్రింపబడియె.